శ్రీరస్తు.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః

---

# వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి

అను

గురుశిష్య సంవాదము.



వెస్టువార్డు అండు కంపెని.

చాకలపేట, మదరాసు.

రిజిష్టర్డు కాపిరైటు] 1962 [వెల రూ 1-50

# వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి

అనెడి

## గురుశిష్య సంవాదము.

### పరబ్రహ్మస్తుతి.

శ్లో. అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే।
సమస్త జగదాధార మూర్తయే బ్రహ్మణే నమః॥

తా॥ పరబ్రహ్మము సత్యజ్ఞానానందమైనది. మనోవాక్కులకు గోచరింపనిది. మాంసమయంబగు నేత్రంబులకు కనబడనిది. సగుణ నిర్గుణ నామరూపములు లేనిది. సకల లోకములకు ఆధారమైనది. అట్టి పరబ్రహ్మము కొఱకు నమస్కారమగును గాక.

### శ్రీరామచంద్రస్తుతి.

శ్లో. శ్రీరామం సరసీరుహాక్ష మమలం దూర్వాంకుర శ్యామలం
విద్యుత్కోటినిభ ప్రభాంబరధరం పీఠాసనాధిష్ఠితమ్।
వామాంకే పరిసంస్థితాం జనకజా మాలింగ్యతాం బాహునా
తత్త్వం చాపరపాణినా మునిగణా నాజ్ఞాపయంతం భజే॥

తా॥ కమలములవంటి కన్నులు గలవాడును నిర్మలుండును శ్యామల వర్ణుండును మెరుపు తీగవంటి స్వర్ణమయమగు పీతాంబరమును ధరించిన వాడును పీఠాసనమందు కూర్చుండువాడును తనదు యెడమ తొడమీద కూర్చుకొని యుండునట్టి త్రిలోకమాతయగు శ్రీ సీతాదేవిని తనయొక్క వామబాహువుతో ఆలింగనము చేసికొని, దక్షిణ హస్తమునందు చిన్ముద్రను ధరించి తన సన్నిధానంబు నాశ్రయించి కూర్చుకొని యుండునట్టి సనకసనందన నారదవసిష్ఠ వ్యాస శుక శౌనకాది మహాఋషులకున్ను పరమ దైవత శిఖామణియగు శ్రీ యాంజనేయులవారికిన్ని తత్త్వోపదేశమును చేయుచుండు సద్గురుండను శ్రీ రామచంద్ర పరబ్రహ్మంబును భజించుచున్నాను.

### శ్రీ సద్గురుస్తుతి.

ప సేత్ర: దానందరూపాయ వ్యాపినే పరమాత్మనే।
మొక్క ఁగురు నాథాయ ప్రకాశానందమూర్తయే॥

# వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి,

తా॥ సచ్చిదానంద స్వరూపుండును అంతటను వ్యాపించి యుండువాడును స్వప్రకాశుండును సదానందుండును పరమాత్మ స్వరూపుండును అగు శ్రీసద్గురు పాదములకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ సత్యానంద స్వరూపాయ బోధైక సుఖకారిణే।
నమో వేదాంత వేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే॥

తా॥ సత్యానంద స్వరూపుండును కేవల జ్ఞానమాత్రమైన సుఖ స్వరూపుండును సకల ఉపనిషత్తులచే తెలుసుకొనదగినవాడును బుద్ధికి సాక్షిగా నుండువాడును ప్రత్యగాత్మ స్వరూపుండును అగు శ్రీ సద్గురుస్వామికి నమస్కారము.

శ్లో॥ యేన చేతయతా హీదం చిత్తం చేతయతే నరః।
జాగ్రత్స్వప్న సుషుప్త్యాది తస్మై శ్రీగురవే నమః॥

తా॥ ఎవని సత్తామాత్రము వలన జడస్వరూపమగు ఈ చిత్తము చేతన స్వరూపముగా తోచుచు సకల కార్యములు చేయుచున్నదో, ఎవని సత్తామాత్రము వలన జీవుడు చేతనస్వరూపుడై జాగ్రత్స్వప్న సుషుప్తి అనెడి అవస్థాత్రయమును పొందుచు, సకలమును అనుభవించుచున్నాడో, అట్టి కేవల సాక్షిమాత్ర ప్రత్యగాత్మ స్వరూపమైన సద్గురువునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ చైతన్యం శాశ్వతం శాంతం వ్యోమాతీతం నిరంజనమ్।
నాదబిందు కళాతీతం తస్మై శ్రీగురవే నమః॥

తా॥ స్వయంప్రకాశమైనదియు నిత్యమైనదియు శాంతమైనదియు ఆకాశము నతిక్రమించినదియు నిర్దోషమైనదియు నాదబిందుకళాతీతమైనదియు చైతన్యస్వరూపమైనదియు నగు ప్రత్యగాత్మ యనెడి శ్రీ సద్గురు పరబ్రహ్మమునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః।
గురు రేకం పరంబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥

తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుండును అద్వితీయ పరబ్రహ్మ స్వరూపుండును అగు శ్రీసద్గురువునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః॥

తా॥ ఈ చరాచర ప్రపంచము సర్వత్ర మండలాకారముగా పరిపూర్ణముగా వ్యాపించి యుండు తత్పదంబెట్టిదనుచు పరమాత్మ ఇట్టిదని [illegible] విశదముగా బోధించినట్టి శ్రీసద్గురుస్వామికి నమస్కరించుచున్నాను.

శ్లో॥ స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్ సచరాచరమ్।
త్వంపదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః॥

తా॥ ఈ చరాచర జంతువులందు వ్యాపించి యుండెడి త్వంపద లక్ష్యార్థమగు జీవాత్మస్వరూప మిట్టిదని దానిలక్షణము నాకు విశదముగా బోధించినట్టి శ్రీ సద్గురు నాథునకు నమస్కరించు చున్నాను.

శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరమ్ ।
అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః॥

తా॥ అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమే పరమాత్మ స్వరూపముగాను జీవాత్మ స్వరూపముగాను వున్నదనియు, పరమాత్మ జీవాత్మలు రెండున్ను, అభేదపరబ్రహ్మ స్వరూపమనియు, కాబట్టి జీవాత్మస్వరూపివగు నీవే పరబ్రహ్మము, పరబ్రహ్మమే నీవు అని జీవబ్రహ్మైక్యమును బోధించెడి అసిపదరహస్యార్థమును నాకు విశదముగా బోధించి నన్ను కృతార్థునిగా జేసినట్టి శ్రీ సద్గురుమూర్తికి నమస్కరించెదను.

శ్లో॥ మన్నాథ శ్రీజగన్నాథో । మద్గురు శ్రీజగద్గురుః ।
స్వాత్మైవ సర్వభూతాత్మా తస్మై శ్రీగురవే నమః॥

తా॥ నా ప్రభువే లోకప్రభువు, నా గురువే లోకగురువు, నా యాత్మయే సమస్త భూతములందు పరిపూర్ణముగా నిండియుండు పరబ్రహ్మముగా నున్నది. అట్టి సద్గురుస్వరూపమైన పరమాత్మకు పరబ్రహ్మమునకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ యస్య ప్రసాదా దహమేవ సర్వం । మయ్యేవ సర్వం పరికల్పితంచ ।
ఇత్థం విజానామి సదాత్మరూపం । తస్యాంఘ్రిపద్మం ప్రణతోస్మి నిత్యమ్॥

తా॥ నేనే సర్వపరిపూర్ణమగు బ్రహ్మమగుచున్నాను. ఈ చరాచర ప్రపంచము సర్వము నాయందు కల్పింపఁబడుచున్నది. ఏ గురుని కటాక్షమువలన యిట్లు నా నిజ రూపమగు పరమాత్మ స్వరూపమును తెలుసుకొంటినో అట్టి సద్గురుని పాదపద్మములకు నమస్కరించు చున్నాను.

శ్లో॥ ఆబ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకమ్ ।
స్థావరం జంగమం చైవ ప్రణమామి జగన్మయమ్॥

తా॥ బ్రహ్మదేవుడు మొదలుకొని తృణపర్యంత ముండెడి స్థావర జంగమరూపం బగు ఈ చరాచర ప్రపంచము సర్వమున్ను పరబ్రహ్మ స్వరూపముగానే యున్నది. అట్టి పరబ్రహ్మమే గురుస్వరూపముగా నున్నది గాన, అట్లు బ్రహ్మాదిస్తంభపర్యంత చరాచర ప్రపంచస్వరూపియగు సద్గురుపరబ్రహ్మమునకు నమస్కరించు చున్నాను.

శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా ।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః॥

తా॥ ఏమహానుభావుని చేత అజ్ఞానాంధకారమువల్ల గ్రుడ్డివాడ నగు నాయొక్క జ్ఞాన నేత్రమును బ్రహ్మజ్ఞానమనెడి కాటుకయొక్క కణికతో తెరవఁబడు చున్నదో అట్టి యొక్క సద్గురుస్వామి చరణకమలములకు నమస్కరించు చున్నాను.

యుతే॥] అనెడి గురుగీతా వాక్యరీతిగాను, దేవుఁడు లేఁడనెడి నాస్తికభావము లేనివాఁడు. సుకరుఁడేకిన భేదము నరయనివాఁడును దురాచారములు లేనివాఁడును భగవంతునియందు భక్తి గలవాఁడును వేదాంతశాస్త్రములు తప్ప తక్కినశాస్త్రములు చూచుటకు ప్రీతి లేనివాఁడును, గురుభక్తుండును సూక్ష్మబుద్ధి గలవాఁడును చిత్తపరిపాకము గలవాఁడును దుర్జన సాంగత్యము లేనివాఁడును పాపకార్యములు చేయనివాఁడును కామక్రోధాది దుర్గుణములు లేనివాఁడును ఇంద్రియజయము గలవాఁడును (దేవుఁడు వేఱే - జీవుఁడు వేఱే) అనెడి ద్వైతబుద్ధి లేనివాఁడును సకల జీవజంతువులను తనవలెనే తలంచుచు వాటికి మేలుచేయుచుండువాఁడును జీవకారుణ్యము గలవాఁడును ఇట్టిలక్షణములుగలవాఁడే సద్గురుసేవచేయుటకును తత్త్వోపదేశమును పొందుటకును తగినట్టి శిష్యుఁడనబడును. ఇట్లు పైచెప్పబడిన శిష్యలక్షణములుగల ముముక్షువగుశిష్యుండు ఒకానొకఁడు, పైచెప్పబడిన గురులక్షణములుగలిగి పద్మాసనాసీనుండై బ్రహ్మనిష్ఠాగరిష్ఠుండై బ్రహ్మానందసారమగ్నుండై బ్రహ్మస్వరూపుండై ప్రకాశించుచుండు శ్రీసద్గురుస్వామిసన్నిధానంబునుజేరి, [శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా। ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥] అనెడి భగవద్గీతావాక్యరీతిగా; శ్రద్ధాభక్తులు గలవాఁడై అట్టి సద్గురుస్వామిపాదపద్మములకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి లేచి అంజలీబద్ధహస్తుండై నిలుచుచు కన్నీరు మున్నీరుగా ప్రవహింపగా దుఃఖించుచు సద్గురునిం జూచి యిట్లనియెను. ఓకరుణా సముద్రుఁడైన గురుస్వామీ! జననమరణదుఃఖ సంసారసాగరంబునందు మునిఁగి మోక్షమనెడి దరిగానక అల్లాడుచు దుఃఖించుచుండు నన్ను దేవరవారికి కరుణాకటాక్ష వీక్షణంబులచేత లేవనెత్తి రక్షింపవలయును, దేవరవారిని వినా యితరులను రక్షకులను యెవరిని గానను, నేను బాలుఁడను, ఏమియు తెలియనివాఁడను, అజ్ఞుండను, స్వామీ! నే నెట్లు ఈ సంసారసాగరమును దాటగలను, ఎయ్యది గతి, ఏది యుపాయము, నే నెట్లు మోక్షమును పొందగలను, నా కొకటియు తెలియదు, దేవరవారు కరుణించి రక్షించి నా సంసారదుఃఖమును నాశము చేయవలయును. అని ఇట్లు ప్రార్థింపగా సద్గురుండు కరుణారసచిత్తుండై,—[శ్లో॥ ఈక్షణధ్యాన సంస్పర్శై ర్మత్స్యకూర్మవిహంగమాః। పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వత్పండిత వృత్తయః॥] అనునట్లు, శిష్యునిం జేరదీసి కూర్చుండ నియమించి, చేపలు తమపిల్లలను కనులతో జూచినమాత్రమున వానిని రక్షించునట్లున్ను, కూర్మములు తమపిల్లలను మనస్సున తలంచినమాత్రమున వానిని రక్షించునట్లున్ను, పక్షులు తమపిల్లలను స్పర్శము చేసినమాత్రమున వానిని రక్షించునట్లున్ను, శిష్యుని కరుణారసదృష్టితోడం జూచి, వీనికి సకలదుఃఖములున్ను నశించి వీఁడు బ్రహ్మస్వరూపుం డౌను గాక యని మనంబున తలంచి ఆశీర్వదించి, హస్తమస్తకసంయోగము చేసి వానిని స్పర్శించి; పుత్రా నీవు భయపడవలదు దుఃఖింపకుము, జననమరణ దుఃఖసాగరంబును దాటుటకున్ను మోక్షానందంబును పొందుటకున్ను వుపాయ మొకటి గలదు, శ్రద్ధ గలవాఁడవై వినుమని యిట్లనియెను.

## వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి,



శ్లో॥ వేదాంతార్థ విచారేణ జాయతే జ్ఞానముత్తమమ్। తేనాత్యంతిక సంసార దుఃఖనాశో భవత్యను ] అనునట్లు, పుత్రా! వేదాంతములైన ఉపనిషత్తులయొక్క రహస్యార్థమును విచారించుటవలన [తత్త్వజ్ఞానము] అనగా ఆత్మానాత్మవివేకము గలుగును, అట్టి జ్ఞానము గలుగుటవలన జననమరణదుఃఖ సంసారసాగరంబును దాటి

### మోక్షద్వారమునందలి ద్వారపాలకులు.

బ్రహ్మస్వరూపుండవై ముక్తి పొందగలవు మఱియు, [శ్రుతి॥ మోక్షద్వారే ద్వారపాలా శ్చత్వారః పరికీర్తితాః। శమో విచార స్సంతోష శ్చతుర్థ స్సాధుసంగమః। ఏకం వా సర్వయత్నేన సర్వముత్సృజ్య సంశ్రయేత్। ఏకస్మిన్ వశగే యాంతి చత్వారోఽపి వశంగతాః॥] అనెడి మహోపనిషత్తు వాక్యరీతిగా; శిష్యా! మోక్షద్వారమందు నలుగురు ద్వారపాలకు లున్నారు. శాంతము, ఆత్మానాత్మవివేకము, తనకు లభించని వస్తువులందు కోరికలేక పూర్వకర్మాను సారముగా తనకు ఏది లభించినదో దానితోడ తృప్తిపొందుట అనెడి సంతోషము, బ్రహ్మజ్ఞానుల సాంగత్యము అనెడి ఈ నాలుగు సాధనములే నలుగురు ద్వారపాలకు లనబడును. ఇందులో నొకటినైనను ప్రయత్నముతో సాధించి వశపఱచుకొనినయెడల అప్పుడే ఈ నాలుగున్ను వశమగును. అట్లు ఈ నాలుగు ద్వారపాలకులున్ను వశమైనయెడల నిరాటంకముగా మోక్షము లభించును, లేకున్న లభింపదు. (శ్రుతి॥ అవిచారకృతో బంధో విచారా న్మోక్షో భవతి। తస్మా త్సదా విచారయే జ్జగజ్జీవ పరమాత్మనః। జీవభావ జగద్భావ బాధే ప్రత్యగ భిన్నం బ్రహ్మైవావ శిష్యతే॥) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, శిష్యా!. విచారణలేనందువలన బంధమున్ను, విచారణవలన మోక్షమున్ను గలుగును గాన, జగత్తు అనగా నేమి, జీవుడనగా నెట్టివాడు, పరమాత్మ యెటువంటిది. అని జగత్తు జీవ పరమాత్మలక్షణములను సదా గురుముఖంబున విచారణ చేయవలయును. అట్లు విచారించుటవలన జీవజగత్తులు రెంటియొక్క లక్షణములు ఇట్టివని కరతలామలకమురీతిగా విశదముగా తెలిసినతోడనే పరమాత్మ యిట్టిదని స్పష్టముగా తెలియును, అట్లు పరమాత్మలక్షణము తెలిసినతోడనే మోక్షము తనంతట తానే సిద్ధించును. అయితే జీవజగత్తులయొక్క లక్షణ మిట్టిదని విచారించి తెలియనేరనివారికి పరమాత్మలక్షణము యిట్టిదని తెలియఁజాలదు గాన, ఎవడు పరమాత్మను యెఱుఁగవలయు నని తలంచుచున్నాడో, వాడు మొట్టమొదట జగత్తు జీవలక్షణములను గురుముఖంబున విచారించి తెలుసుకొని తర్వాత పరమాత్మ

### ఈశ్వర భక్తి మహిమ.

లక్షణమున్ను గురుముఖంబుగా విచారించి తెలుసుకొనవలసినది. (శ్లో॥ యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ। తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః॥) అనెడి గురుగీతావాక్యరీతిని, శిష్యా! దేవునియందున్ను తనకు జ్ఞానోపదేశము చేయు సద్గురునియందున్ను ఈ యిద్దరియందున్ను సమానభక్తి గలవానికే బ్రహ్మజ్ఞానము

సిద్ధించును. దైవభక్తి గురుభక్తి లేనివానికి జ్ఞానము సిద్ధించదు, మోక్షమున్ను సిద్ధించదు. (శ్రుతి॥ భక్తిగమ్యం పరం తత్త్వం అంతర్లీనస చేతసాం) అనెడి యోగశిఖోపనిషత్తు రీతిగాను, మఱియు (శ్రుతి॥ హరేరామ హరేరామ రామరామ హరేహరే : హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే । ఇతి షోడశకం నామ్నాం కలికల్మష నాశనం॥) అనెడి కలిసంతరణోపనిషత్తురీతిగాను, శిష్యా! భగవంతునియందలి భక్తివల్లనే యెట్టివారికిన్ని విషయవైరాగ్యమున్ను బ్రహ్మజ్ఞానమున్ను లభించును. భగవద్భక్తి లేని వారికి విషయవైరాగ్యమున్ను బ్రహ్మజ్ఞానమున్ను లభించదు. గాన సత్యముగా భగవంతునియందు భక్తిగలిగి అతని నామమును 'హరేరామ హరేరామ హరేకృష్ణ హరేకృష్ణ' అని సదా ధ్యానించుచుండవలయును. అట్లు భగవన్నామస్మరణ చేయువారికి సకల పాపములు నశించి శీఘ్రముగానే విషయవైరాగ్యమును బ్రహ్మజ్ఞానమును గలుగును. ఇందుకు యెంతమాత్రమున్ను సందేహములేదు సుమా. (శ్లో॥ లోకవార్తాను గమనే జిహ్వైకైకా సహస్రశః । ఈశవార్తాను గమనే ద్వాత్రింశద్దంతకీలితా॥) అనునట్లు, శిష్యా! లోకవృత్తాంతములను ప్రసంగించవలెనన్నయెడల ప్రతిమనుష్యునికిన్ని ఒక నాలుక వుండినప్పటికిన్ని ఆ ఒక నాలుకయే వేయినాలుకలు చేయుపనిని చేయును. అయితే భగవన్నామమును రామా కృష్ణాయని చెప్పవలయునని తలంచినయెడల ఆ నాలుక కదలక మెదలక ముప్పదిరెండుదంతములసందున చిక్కుకొని స్తంభించి యూరకుండును. కాబట్టి అట్టిదుర్మార్గ నాలుకను హితబోధచేసి వశపఱచుకొని ఆ నాలుక

## సద్గురుమహిమ.

గుండా రామకృష్ణ గోవింద నారాయణ శంకర మహాదేవ శంభో అని భగవన్నామ స్మరణ చేయుచుండ వలయును. మఱియు, (శ్లో॥ గురోః ప్రసాదతః స్వాత్మ న్యాత్మా రామ నిరీక్షణాత్ । సమత్వం ముక్తిమార్గేణ స్వాత్మజ్ఞానం ప్రవర్తతే॥) అనెడి గురుగీతా వాక్యమురీతిగా, శిష్యా! గురుకటాక్షము వలన పరమాత్మ దర్శనమును మోక్షమును ఆత్మజ్ఞానమును గలుగును గాన, (శ్లో॥ గురువక్త్రే స్థితా విద్య గురుభక్త్యాచ లభ్యతే । త్రైలోక్య స్ఫుటవక్తారో దేవాద్య సురపన్నగాః॥) అనెడి గురుగీత రీతిగా, గురునివద్దనుండు బ్రహ్మవిద్యను గురుభక్తివల్లనే సంపాదించుకొనవలయును. అట్లు గురుభక్తి వలన బ్రహ్మజ్ఞానమును పొందినవారు త్రిలోకములందును దేవతలతోడ సమానులగుచు పూజింపబడుదురు. కాబట్టి (శ్లో॥ కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకమ్ । గురుర్విశ్వేశ్వరస్సాక్షాత్ తారకం బ్రహ్మ నిశ్చితమ్॥) అనెడి గురుగీతారీతిగా, తనకు జ్ఞానోపదేశమును చేయునట్టి గురువే కాశీలో నుండు విశ్వనాథుడుగాను, ఆ గురుపాదతీర్థమే కాశీ గంగాతీర్థముగాను, ఆ గురువుచే ఉపదేశింపబడి నిశ్చయమైన బ్రహ్మజ్ఞానమే తారకోపదేశముగాను అగుచున్నది. కాబట్టి (శ్లో॥ సర్వతీర్థవగాహస్య సంప్రాప్నోతి ఫలం నరః । గురోః పాదోదకం

శిత్వా శ్శమం శిరసి ధారయేత్ । శోషణం పాపపంకస్య దీపనం జ్ఞానతేజః । గురోః పాదోదకం సమ్యక్ సంసారార్ణవతారకమ్ । అజ్ఞానమూలహరణం జన్మకర్మ నివారణమ్ । జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్ । గురుపాదోదకం పానం గురో రుచ్ఛిష్టభోజనమ్ । గురుమూర్తే స్సదాధ్యానం గురుస్తోత్రం సదాజపః । గురుమూర్తిం స్మరే న్నిత్యం గురో ర్నామ సదా జపేత్ । గురో రాజ్ఞాం ప్రకుర్వీత గురో రన్యం న భావయేత్॥ అనన్యా శ్చింతయంతో యే సులభం పరమం సుఖమ్ । తస్మా త్సర్వ ప్రయత్నేన గురో రారాధనం కురు॥) అనెడి గురుగీతా వాక్యములరీతిగా, తనకు జ్ఞానోపదేశము చేయు సద్గురుపాద తీర్థమును త్రాగి మిగిలిన జలమును శిరస్సున ప్రోక్షించుకొనుటవలన, ఈ జగత్తులో కలిగిన సమస్త పుణ్యతీర్థ స్నానఫలము కలుగును, పాపము పోగొట్టి బ్రహ్మజ్ఞానమును ప్రకాశింప జేయుచు సంసారసాగరమును దాటింప జేయునది గురుపాదతీర్థమే అజ్ఞానమును పోగొట్టి సకల కర్మములను నాశముచేసి జ్ఞాన వైరాగ్యములను కలుగచేయునది గురుపాద తీర్థమే గాన, అట్టి మాహాత్మ్యము గల గురుపాదతీర్థమును త్రికరణశుద్ధిగా పుచ్చుకొనవలయును. గురుపాద తీర్థము త్రాగుట, గురువుయొక్క యెంగిలిఅన్నమును తినుట, సదా గురుస్తుతిచేయుట ఇవి ముఖ్యముగా చేయుచుండ వలయును. గురునామమును జపించు చుండవలయును. సదా గురుని ఆజ్ఞ మీఱకుండవలయును. గురువుకంటెను అన్యమైనవానిని తలంచగూడదు గురుధ్యానము కంటెను గురుపూజకంటెను సుఖమైన మార్గము ఈ జగత్తునందు యేదిన్ని లేదు, (శ్లో॥ ధ్యానమూలం గురో ర్మూర్తిః పూజామూలం గురోః పదమ్ । మంత్రమూలం గురో ర్వాక్యం ముక్తిమూలం గురోః కృపా॥) అనెడి గురుగీతా వాక్యరీతిగా గురుస్వరూపమును ధ్యానించు చుండవలయును. గురుపాదమునే సదా పూజించు చుండవలయును, గురువాక్యమే సదా స్మరించు చుండవలయును. గురుకటాక్షమే మోక్షమునకు కారణముగా నున్నది. (శ్లో॥ స్వాశ్రమంచ స్వజాతించ స్వకీర్తిం పుష్టివర్ధనమ్ । ఏత త్సర్వం పరిత్యజ్య గురో రన్యం న భావయేత్॥) అనెడి గురుగీతారీతిగా, గురుడు తనకంటె తక్కువజాతి వాడుగాను, తనకంటె చిన్నవాడుగాను, తనయొక్క ఆశ్రమము కంటెను తక్కువ ఆశ్రమమం దుండువాడుగాను వున్నాడని భేదమెంచక తన కులగోత్ర సూత్రమాదులను సర్వమును పరిత్యజించి సద్గురుడు యెట్టి కులస్థుడుగా నున్నను అతనిని ఆశ్రయించి పూజింపవలయును. ఇందుకు మనుస్మృతిలోని వాక్యము ప్రమాణముగానున్నది ఎట్లనగా, (శ్లో॥ శ్రద్ధధాన శ్శుభాం విద్యా మాదదీతా వరా దపి । అంత్యా దపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులా దపి॥ అనెడి మనుస్మృతి రెండవ అధ్యాయము ౨౩౮ శ్లోకము రీతిగా, శిష్యా! విద్యను సంపాదించుటయందు శ్రద్ధ కలవాడు శ్రేష్ఠమైన విద్యను శూద్రునివల్లనైనను, మోక్షమార్గోపదేశము చండాలునివల్లనైనను, గుణవతి యగు స్త్రీని తక్కువ కులమునందుండి యైనను సంపాదించుకొనవచ్చును. ఇందువల్ల యేదోవ

మున్న లేదుసుమా, శ్లో॥ గకారంచ గుణాతీతం రకారం రూపవర్జితమ్। గుణాతీత మరూపంచ యోదద్యాత్ స గురు స్మృతః॥ గకారః ప్రథమో వర్ణో మాయాది గుణభాసకః। రకారోఽస్తి పరం బ్రహ్మ మాయాభ్రాంతి విమోచకం॥ గకారస్య గుణాతీతో రూపాతీతో రకారకః। గుణరూపవిహీనత్వా ద్గురు రిత్యభిధీయతే॥ గకార శ్చాంధకారస్తు రకార స్తన్నిరోధకృత్। అంధకారవినాశిత్వాద్గురు రిత్యభిధీయతే॥ గకార శ్చాంధకారోహి రకారస్తేజ ఉచ్యతే। అజ్ఞానగ్రాసకం బ్రహ్మ గురు రేవ న సంశయః॥ మంత్రరాజ మిదం దేవి గురు రిత్యక్షర ద్వయమ్। స్మృతి వేదార్థవాక్యే నాం గురు స్సాక్షాల్ పరంపదం॥ సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమ కారకాః ఏక ఏవ పరో మంత్రో గురు రిత్యక్షరద్వయమ్॥) అనెడి గురుగీతావాక్యము రీతిగా, గురు అనెడి రెండక్షరములలో (గు) అనెడి అక్షరము శుద్ధనిర్గుణస్వరూపమును, (రు) అనెడి అక్షరముల కేవల నిరాకారమును అగుచున్నది గాన, అట్టి శుద్ధనిర్గుణ నిరాకార పరబ్రహ్మమును యిట్టిదని బోధించువాడే గురు డనబడును. మఱియు (గు) అనగా మాయ అనబడును. (రు) అనగా అట్టి మాయను నాశనముచేయు పరబ్రహ్మ మనబడును. ఇట్లు గురు అనెడి పదము మాయగాను పరబ్రహ్మముగాను వున్నది. మఱియు (గు) అనగా సత్త్వరజస్తమోగుణములు లేనిది అనబడును. (రు) అనగా కరచరణాది అవయవములు లేక నిరాకారముగా నుండునది అనబడును. కాబట్టి గురు అనగా శుద్ధనిర్గుణమై రూపములేక నిరాకారముగా నుండు పరబ్రహ్మ మనబడును. మఱియు (గు) అనగా గాఢాంధకారము అనబడును. (రు) అనగా అట్టి గాఢాంధకారమును నాశముచేయునది అనబడును, కాబట్టి గురు అనగా అజ్ఞానాంధకారమును నాశముచేయువా డనబడును. మఱియు (గు) అనగా అజ్ఞానమనెడి చీకటి సుమా! (రు) అనగా ఆచీకటిని పారద్రోలెడి పరంజ్యోతి కాబట్టి గురు అనగా అజ్ఞానమనెడి చీకటిని పారద్రోలెడి జ్ఞానజ్యోతి, లేక పరంజ్యోతి యనబడును. శిష్యా! సప్తకోటి మహామంత్రములలోపల గురు అనెడి రెండక్షరములుగల ఈ మంత్రమే మిగుల శ్రేష్ఠమైనది సుమా! (శ్లో॥ గురు శ్శివో గురుర్దేవో గురు ర్బంధుః శరీరిణామ్। గురు రాత్మా గురుర్జీవో గురో రన్యం నవిద్యతే॥ నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురో రధికమ్। శివశాసనతః శ్శివశాసనతః శ్శివశాసనతః శ్శివశాసనతః॥ ఇదమేవ శివం ఇదమేవం శివం ఇదమేవశివం ఇదమేవశివం। మమశాసనతో మమశాసనతో మమశాసనతో మమ శాసనతః॥ విదితం విదితం విదితం విదితం విజనం విజనం విజనం విజనమ్। హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతః॥) అనెడి గురుగీతావాక్యరీతిగా; శిష్యా! తనకు జ్ఞానోపదేశమును చేయునట్టి సద్గురుడే ఈశ్వరుడు, గురువే దేవుడు, గురువే బంధువు, గురువే ఆత్మ, గురువే జీవుడు, గురునికంటెను అన్యమేదియు లేదుసుమా! గురువుకంటెను శ్రేష్ఠమైనది ఏమియు లేదు గురువే మంగళకరమైన పరబ్రహ్మము, గురుస్వరూపము, కేవలజ్ఞానమాత్రమైనది, గురుస్వరూపము సాక్షిమాత్రమైనది, గురుస్వరూపము జననమర

జాడి వికారము లేనిది, అని యిట్లు హరిహరాది దేవతలు సత్యము చేసియున్నారు
కుమారీ (శ్లో॥ జ్ఞానం వైరాగ్య మైశ్వర్యం యశ శ్శ్రీ సముదాహృతమ్। షడ్గుణైశ్వర్య
యుక్తశ్చ భగవాన్ శ్రీగురుః ప్రియే।) అనెడి గురుగీతారీతిగా, బ్రహ్మజ్ఞానము, (వై
రాగ్యము) అనగా ఇహపరలోకములందలి సుఖములందు ఆశ లేకుండుట, ఈశ్వరత్వ
ము, యశస్సు శమదమాది షట్కసంపదలు, ఆత్మ అనెడి ఈ ఆరున్ను ఒకటిగాగూడి
యుండుటే షడ్గుణైశ్వర్యము లనబడును గాన, ఈ షడ్గుణైశ్వర్య సహితుడగు సద్గురు
మూర్తియే సాక్షాత్తుగా భగవంతు డగుచున్నాడు. (శ్లో॥ న సుఖం వేదశాస్త్రేషు న
సుఖం మంత్రయంత్రకే। గురోః ప్రసాదా దన్యత్ర సుఖం నాస్తి మహీతలే॥) అనెడి
గురుగీతారీతిగా, శిష్యా! చతుర్వేదములను, అటుశాస్త్రములను, సప్తకోటి మహామంత్ర
ములను, యంత్రములను తెలిసినందువలన బ్రహ్మానంద మనెడి సుఖము గలుగ జాలదు.
సద్గురు కటాక్షమువల్లనే బ్రహ్మానందమైన మోక్షసుఖము గలుగును గాన, గురు కటా
క్షము కంటెను విశేషమైనది యేదియు లేదు కుమారీ! (శ్లో॥ గురుధ్యానే నైతి నిత్యం దేహి
బ్రహ్మమయో భవేత్। స్థితశ్చ యత్రకుత్రాపి ముక్తోఽసౌ నాత్ర సంశయః॥) అనెడి
గురుగీతారీతిగా, శిష్యా! గురుపుత్రుడు యేదేశమునం దుండినను శుద్ధమైనచోట నున్న
ను, లేక అశుద్ధమయినచోట నున్నను, ఏచోట నుండినను సదా సద్గురు ధ్యానము
చేయుటవలన ఆ గురుపుత్రుడు బ్రహ్మస్వరూపుడై ముక్తుడగును. ఇందుకు సందేహము
లేదు, ఇది సత్యము. (శ్లో॥ జ్ఞానం వినా ముక్తిపదం లభ్యతే గురుభక్తితః। గురోః
సామాన్యతో నాన్యత్ సాధనం గురుమార్గిణామ్॥) అనెడి గురుగీతారీతిగా, శిష్యా!
లోకమునందు ఒకనికి బ్రహ్మజ్ఞాన సాక్షాత్కారము లేకున్నను, గురుభక్తి మాత్రము
సత్యముగా గలిగి యుండిన యెడల వాడు సత్యముగా మోక్షమును పొందగలడు,
కాబట్టి గురుపుత్రులకు గురుచరణ ధ్యానముకంటెను శ్రేష్ఠమేమియు లేదుసుమా! అని
యిట్లు గురుమహిమనంతయును బోధించి, ఆ సద్గురుడు తన ప్రియశిష్యునికి లలాటంబున
భస్మంబు బెట్టి గురుపూజా క్రమంబును గురుమంత్ర రహస్యంబును సర్వంబును సాంగం
బుగా బోధించి శ్రీ పాదతీర్థ ప్రసాదంబుల నొసంగి తన కటాక్ష వీక్షణంబులను వాని
యందు సోకునట్లుచేసి, పుత్రా! ఇక నీకు భయములేదు, మోక్షము నీ యరచేతిలోనిది
సుమా! అని ఆశీర్వదించి చిఱునవ్వు ముఖముతో యిట్లనియె. శిష్యరత్నమా! నిత్యా

## సాధన చతుష్టయము

నిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్క సంపత్తి,
ముముక్షుత్వము అను నీ నాలుగు సాధనములు గలవారే ముక్తిపొందును గాని, తక్కిన
వారు ముక్తిని పొందజాలరు. అందులో (1) నిత్యానిత్య వస్తువివేకము, అనగా ఆత్మ
సత్యమనియు, అనాత్మయగు దేహాది ప్రపంచము మిథ్యయనియు ఈ రెండు వస్తువుల
లక్షణములను గురుముఖంబుగా విచారించి తెలియుట, ఇదియే సాంఖ్యతత్త్వ విచారణ
అనబడును. (2) ఇహాముత్రార్థ ఫలభోగవిరాగ మనగా, దేహాది బ్రహ్మ [illegible]

తమ సర్వము మిథ్యయని తెలిసి, ఇహపరలోకము లందలి సకల సుఖములందున్ను దేహమునందున్ను ఆశ లేకుండుట. ఇదే వైరాగ్య మనబడును. (3) శమము, దమము, తితీక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అను నీయారున్ను శమాదిషట్కసంపత్తి యనబడును. అందులో, శమము అనగా అంతరింద్రియనిగ్రహము, దమము అనగా బాహ్యేంద్రియ నిగ్రహము, ఉపరతి అనగా జ్ఞాననిష్ఠాభ్యాసము చేత క్రమేణ నానాట సకలకర్మానుష్ఠానమును పరిత్యజించుట సుమా! ఇదియే సన్న్యాస మనబడును. తితీక్ష అనగా శీతోష్ణ సుఖదుఃఖములను సమముగా నెంచి సహించుట, శ్రద్ధ అనగా తనకు జ్ఞానోపదేశము చేయు గురువునందును వేదాంతశాస్త్రములందును గురుభక్తులందును ఈశ్వరునియందును విశ్వాసము గలిగియుండుట సమాధానము అనగా గురువుచే ఉపదేశింపబడిన (తత్త్వమసి) మొదలగుమహావాక్యార్థ రహస్యములను శాస్త్రములందు చెప్పబడియుండుటను చూచుకొని అవి గురువులవారు బోధించిన అర్థమే సరియని తనమనస్సున దృఢపఱచుకొనుట. ఇవియే శమాదిషట్కసంపత్తి యనబడును. (4) ముముక్షుత్వమనగా మోక్షేచ్ఛ లోకమున సకలజనులున్ను మోక్షము అపేక్షించుచున్నారు గాని అది మోక్షేచ్ఛగాదు. అయితే ఒక యిల్లు అగ్ని తగులుకొని కాలుచుండగా ఆ యింటిలో నుండువాడు ఆ యగ్నిమంటలకు తాళజాలక అతిశీఘ్రముగా ఆయింటినుండి తప్పించుకొని బయలుదేరి శీతలమైన జలమునందు మునిగి తనదేహమును చల్లార్చుకొనునట్లు సంసారమునందు తాపత్రయాగ్నిచేత కాలినపురుషుడు ఈసంసారతాపంబు తొలగించు సద్గురువు ఎవరనియు, ఈ సంసారమునందుండి నే నెప్పుడు తొలగి బ్రహ్మానందసుఖమును అనుభవింపగలననియు సదాతలంచుచు వేగిరపడుచుండుటే మోక్షేచ్ఛ అనబడును. ఈ సాధనచతుష్టయమును పొందినవాడే మోక్షమునుపొందును, తక్కినవాడు మోక్షమును పొందజాలడు గాన, శిష్యా! నీకు ఈ నాల్గుసాధనములలో మొట్టమొదటిదైన (నిత్యానిత్యవివేకమును) అనగా ఆత్మానాత్మవివేక మనెడి సాంఖ్యతత్త్వవిచారణను బోధించుచున్నాను శ్రద్ధగలవాడై వినుమని యిట్లనియె.

## సాంఖ్యసూత్రములు ప్రారంభము.

శ్రుతి. ఓం-తస్మా దాత్మనః-ఆకాశ-స్సంభూతః। ఆకాశా ద్వాయుః॥ వాయో రగ్నిః। అగ్నే రాపః। అద్భ్యః-పృథివీ। తాని-పంచతన్మాత్రాని - గుణాని-భవంతీ పైంగలోపనిషత్తు.

తా. శిష్యా! పరబ్రహ్మమునందు రజ్జు సర్పమురీతిగా మాయగలిగెను. ఆ మాయవలన ఆకాశము పుట్టెను. ఆకాశమునందుండి వాయువు పుట్టెను. వాయువునందుండి అగ్ని పుట్టెను. అగ్నివలన జలము పుట్టెను. జలమువలన పృథివి పుట్టెను. ఈ అయిదున్ను పంచభూతము లనబడును.

శ్రుతి। యత్కఠినం - సా - పృథ్వీ - యద్ద్రవం - తదాపో। యదుష్ణం-తత్తేజో। యత్ - సంచరతి - తద్వాయుః। యత్సుషిరం - తదాకాశమ్॥ శారీరకోపనిషత్తు.

తా. పృథివి కఠినముగా నుండును. జలము ద్రవరూపముగా నుండును. అగ్ని
ఉష్ణముగా నుండును. వాయువు చలించుచుండును. ఆకాశము రంధ్రరూపముగా
నుండును, అనగా ఎక్కడెక్కడ రంధ్రములున్నవో అరంధ్రము అన్నియు ఆకా
మనబడును. ఈ అయిదున్ను పంచభూతము లనబడును.

శ్రుతిః శబ్ద స్పర్శ-రూప-రస-గంధాః - పృథివీగుణాః । శబ్ద-స్పర్శ - రూపా-
న్యగ్నిగుణాః । శబ్ద-స్పర్శ-రూప-రసాః - జలగుణాః॥ శబ్ద-స్పర్శా - ఇతి - వాయు
గుణాః । శబ్ద - ఏక - ఆకాశస్య॥ శారీరకోపనిషత్తు.

తా. ఆకాశమునకు శబ్దము ఒక్కటియే గుణము. వాయువునకు శబ్దము స్పర్శము
అని రెండుగుణములు గలవు. అగ్నికి శబ్దము స్పర్శము రూపము అని మూడుగుణములు
గలవు. జలమునకు శబ్దము స్పర్శము రూపము రసము అని నాలుగుగుణములు గలవు.
పృథివికి శబ్దము స్పర్శము రూపము రసము గంధము అని అయిదుగుణములు గలవు.

పంచీకరణ విమర్శనము.

శ్లో॥ అథాకాశస్య భూతస్య సార్థం జ్ఞాతేతి కథ్యతే। పార్థంచ చతుర్భాగాన్
కృత్వా సంమిశ్ర మాచరేత్॥ పవనే మిళితాకాశం భాగం మానస ఉచ్యతే। అనలే
మిళితాకాశం బుద్ధిరిత్యభిధీయతే । జలేన మిశ్రితాకాశం చిత్త మిత్యభిధీయతే।
పృథివ్యాం మిళితాకాశం అహంకార మితీరితమ్॥ విష్ణుయామిళము.

తా. పంచభూతములు ఒక్కొక్కటిన్ని రెండుభాగములుగా ఆయెను. మొదటి
భాగము పంచభూతములున్ను స్వర్గమర్త్యపాతాళాది ప్రపంచరూప మాయెను.
రెండవభాగము పంచభూతములు ౨౫ తత్త్వము లాయెను. ఈ ఇరువదియైదు తత్త్వ
ములుగూడి శరీరరూపముగా ఆయెను, ఎట్లనగా, ఆకాశాది పంచభూతములు ఒక్కొ
క్కటిన్ని సమష్టి వ్యష్టి అని రెండుభాగము లాయెను. సమష్టి యనగా భాగింపబడక
అఖండముగా నుండునది, వ్యష్టి అనగా భాగింపబడుచు నాలుగుభాగములుగా ఖండ
ఖండములుగా యేర్పడినది. ఇట్లు పంచభూతములున్ను సమష్టి వ్యష్టిభాగములుగా
యేర్పడుచు, ఒకభూతమునందు మఱియొకభూతము గూడుటవలన ౨౫ తత్త్వములు
గలిగెను. ఎట్లనగా, ఆకాశము రెండుభాగము లాయెను, అందులో మొదటి అర్ధభాగము
సమష్టి యనబడును. రెండవఅర్ధభాగము వ్యష్టి యనబడును. మొదటి అర్ధభాగము
సమష్టి ఆకాశము జ్ఞాత ఆయెను, అనగా అంతఃకరణము, దానియందు తోచిన బ్రహ్మము
యొక్క ప్రతిబింబము, ఈ రెండున్నుగూడి జ్ఞాత యనబడును. ఈ జ్ఞాతయే అంతరా
త్ముడనియు, క్షేత్రజ్ఞుడనియు పురుషుడనియు జీవుడనియు చెప్పబడును. రెండవ అర్ధ
భాగము వ్యష్టిఆకాశము నాలుగుభాగము లాయెను. అందులో మొదటిభాగము వ్యష్టి
ఆకాశము వాయువుతో గూడుటవలన మనస్సు అనెడి తత్త్వము పుట్టెను. రెండవ
భాగము వ్యష్టిఆకాశము అగ్నితో గూడుటవలన బుద్ధియనెడి తత్త్వము పుట్టెను.
మూడవభాగము వ్యష్టిఆకాశము జలముతో గూడుటవలన చిత్తమనెడి తత్త్వముపుట్టెను.

నాలుగవభాగము వ్యష్టిఆకాశము పృథివితో గూడుటవలన అహంకారమనెడి తత్త్వము పుట్టెను. ఇట్లు ఈ మనోబుద్ధిచిత్తాహంకారములు నాలుగున్ను అంతఃకరణచతుష్టయ మనియు అంతరింద్రియములనియు చెప్పబడును.

శ్లో॥ తథాచ వాయు రర్ధంచ వ్యానంచ మితి కీర్తితం। శేషార్ధే త్వేకభాగంచ సమానం వ్యోమమిశ్రితం। అగ్నౌ సంమిశ్రితం భాగం ఉదాన మభిధీయతే। జలేషు మిశ్రితం భాగం తత్ ప్రాణమితి కథ్యతే। పృథివ్యాం మిశ్రితం భాగం అపాన మితి కీర్తితమ్॥ విష్ణుయామిళము.

తా. మఱియు, వాయువు సమష్టి వ్యష్టి యని రెండుభాగము లాయెను. సమష్టి వాయువు వ్యానవాయువు ఆయెను. వ్యష్టివాయువు నాలుగుభాగములాయెను. అందులో మొదటిభాగము వ్యష్టివాయువు ఆకాశములో గూడుటవలన సమాన వాయువు కలిగెను. రెండవభాగము వ్యష్టివాయువు అగ్నితో గూడుటవలన ఉదాన వాయువు పుట్టెను. మూడవభాగము వ్యష్టివాయువు జలములో గూడుటవలన ప్రాణ వాయువు పుట్టెను. నాలుగవభాగము వ్యష్టివాయువు పృథివిలో గూడుటవలన అపాన వాయువు పుట్టెను. ఈ సమాన వ్యాన ఉదాన ప్రాణ అపాన వాయువు లైదున్ను పంచప్రాణము లనబడును.

శ్లో॥ అగ్నిమ ర్ధేర్ధ భాగంతు చక్షు రిత్యభిధీయతే। తథావ్యోమగతం భాగ శ్రోత్ర మిత్యభిధీయతే। వాయునా మిశ్రితం భాగం త్వగింద్రియ మితీరితమ్। జలేషు మిశ్రితం భాగం జిహ్వా ఇత్యభిధీయతే। పృథివ్యాం మిశ్రితం భాగం ఘ్రాణేంద్రియ మితి స్మృతమ్॥ విష్ణుయామిళము.

తా. మఱియు, అగ్ని సమష్టి వ్యష్టి యని రెండుభాగములాయెను, సమష్టి అగ్ని నేత్ర మాయెను. వ్యష్టి అగ్ని నాలుగుభాగము లాయెను. అందులో మొదటిభాగము వ్యష్టియగ్ని ఆకాశములో గూడుటవలన శ్రోత్రము పుట్టెను. రెండవభాగము వ్యష్టియగ్ని వాయువుతో గూడుటవలన త్వక్కు పుట్టెను. మూడవభాగము వ్యష్టియగ్ని జలములో గూడుటవలన జిహ్వ పుట్టెను. నాలుగవభాగము వ్యష్టియగ్ని పృథివితో గూడుటవలన ఘ్రాణము పుట్టెను. ఈ శ్రోత్రము త్వక్కు చక్షు జిహ్వ ఘ్రాణములు అయిదున్ను జ్ఞానేంద్రియంబు లనబడును.

శ్లో॥ జలేష్వర్థం రసం జ్ఞేయం శబ్దం వ్యోమేచ మిశ్రితమ్। వాయునా మిశ్రితం భాగం స్పర్శం భవతి నిశ్చయం। అగ్నౌ సంమిశ్రితం భాగం రూప మిత్యభిధీయతే। పృథివ్యాం మిళితం భాగం గంధ మిత్యభిధీయతే. విష్ణుయామిళము.

తా॥ మఱియు, జలము సమష్టి వ్యష్టి యని రెండుభాగము లాయెను. సమష్టి జలము వలన రసతన్మాత్ర కలిగెను. వ్యష్టిజలము నాలుగుభాగము లాయెను. అందులో మొదటి భాగము జలము ఆకాశముతో గూడుటవలన శబ్ద తన్మాత్ర కలిగెను రెండవ భాగము జలము వాయువుతో గూడుటవలన స్పర్శతన్మాత్ర పుట్టెను. మూడవభాగము

జలముఅగ్నితో గూడుటవలన రూపతన్మాత్ర పుట్టెను. నాలుగవభాగము జలము పృథివితో గూడుటవలన గంధతన్మాత్ర పుట్టెను. ఈ శబ్ద స్పర్శ రూపరసగంధములైదున్ను పంచతన్మాత్రలనబడును.

శ్లో॥ పృథివ్యా మర్ధభాగంచ పాయు రింద్రియ ముచ్యతే । వ్యోమ్నేచ మిళితం పృథ్వీభాగం వాగింద్రియం మతం । వాయునా మిశ్రితం పృథ్వీభాగం పాణీంద్రియం తథా । అగ్నినా మిళితం భాగం పాదేంద్రియ మితి స్మృతం । జలేషు మిళితం భాగ ముపస్థ మితి కథ్యతే॥ విష్ణుయామిళము.

తా. మఱియు, పృథివి, సమష్టి వ్యష్టి యని రెండు భాగములాయెను. సమష్టి పృథివివలన గుదము అనగా పాయువు పుట్టెను. వ్యష్టి పృథివి నాలుగు భాగములాయెను. అందులో మొదటిభాగము పృథివి ఆకాశముతో గూడుటవలన వాక్కు పుట్టెను. రెండవభాగము పృథివి వాయువుతో గూడుటవలన పాణి పుట్టెను. మూడవ భాగము పృథివి అగ్నితో గూడుటవలన పాదము కలిగెను. నాలుగవభాగము పృథివి జలముతో గూడుటవలన గుహ్యము అనగా ఉపస్థము కలిగెను. ఈ వాక్కు పాణి పాద గుహ్య గుదములైదున్ను కర్మేంద్రియము లనఁబడును.

శ్లో॥ మహాభూతార్ధ భాగాని వక్ష్యామి శృణు నారద । జ్ఞాతా వ్యానశ్చ చక్షుశ్చ రసం పాయు రితీరితమ్॥ విష్ణుయామిళము.

తా॥ శిష్యా! పంచభూతములందు భాగింపబడక అఖండముగానుండు మొదట అర్ధభాగము లగు సమష్టి భాగములవలన, జ్ఞాత, వ్యానవాయువు, నేత్రము, రసము, (గుదము) అనగా పాయువు అనెడి ఈ అయిదు తత్త్వములు కలిగెను. మఱియు రెండవ అర్ధభాగములగు వ్యష్టిభాగములు ఒక్కొకటిన్ని నాలుగు భాగములగుచు, ఒక్కొక్కభాగము మఱియొక భూతములో గూడుట వలన తక్కిన ఇరువది తత్త్వములు కలిగెను.

## తత్త్వ కదంబములు.

శ్లో॥ జ్ఞాతా సమానంచ శ్రోత్రంచ శబ్దం వాగ్గగనం మతమ్ । మనో వ్యాన స్త్వచ స్పర్శ పాణౌ వాయు రితీరితం । బుద్ధిః దానశ్చ చక్షుశ్చ రూపం పాదాః ధనంజయం । చిత్తం ప్రాణశ్చ జిహ్వాచ రసం చోపస్థకం జలం । అహంకార మపానశ్చ ఘ్రాణం గంధంచ పాయువః । పృథ్వీసంబంధ మిత్యాహు ర్మునయో యోగి పుంగవాః॥ విష్ణుయామిళము.

తా॥ జ్ఞాత, సమానవాయువు, శ్రోత్రము, శబ్దము, వాక్కు ఈ అయిదుతత్త్వములున్ను ఆకాశభూతములో ఒక్కటిగా చేరియుండుటవలన ఆకాశ స్తబకము, లేక ఆకాశకదంబము అనబడును. మనస్సు, వ్యానవాయువు, త్వక్కు, స్పర్శము, పాణి ఈ అయిదుతత్త్వములున్ను వాయుభూతములో ఒక్కటిగా చేరియుండుటవలన ఇది వాయుస్తబకము, లేక వాయుకదంబ మనబడును. బుద్ధి ఉదానవాయువు, నేత్రము,

రూపము, పాదము ఈ అయిదు తత్త్వములున్ను అగ్నిభూతములో ఒక్కటిగా చేరి యుండుటవలన ఇవి అగ్నిస్తబకము, లేక అగ్నికదంబ మనబడును. చిత్తము, ప్రాణము, జిహ్వ, రసము, ఉపస్థము. ఈ అయిదున్ను జలభూతములో ఒక్కటిగా చేరియుండుట వలన నివి జలస్తబకము, లేక జలకదంబ మనబడును. అహంకారము, అపానము, ఘ్రాణము, గంధము, గుదము ఈ అయిదున్ను పృథివిభూతములో ఒక్కటిగా చేరి యుండుటవలన ఇవి పృథ్వీస్తబకము, లేక పృథ్వీకదంబ మనబడును.

## తత్త్వపంచకములు.

శ్లో॥ వాక్పాణి పాద పాయూపా ముపస్థేతిచ పార్థివాః । శబ్ద స్పర్శంచ రూపంచ రసోగంధ స్తథైవచ । తన్మాత్ర పంచకం జ్ఞేయం జలసంబంధ మిత్యపి । శ్రోత్ర త్వక్చక్షు జిహ్వాచ ఘ్రాణ మాగ్నేయ ముచ్యతే । వ్యానోదాన సమానశ్చ ప్రాణాపానాది పంచకమ్ । వాయుసంబంధ మిత్యాహుర్ జ్ఞాత్వ మానస బుద్ధయః । చిత్తాహంకార యుక్తంచ వ్యోమపంచక మీరితం । పంచ పంచీకృతం కర్మ ప్రపంచ మితి కథ్యతే॥ విష్ణుయామళము.

తా॥ జ్ఞాత మనస్సు బుద్ధి చిత్తము అహంకారము, ఈ అయిదున్ను ఆకాశము యొక్క అయిదుభాగములవలన కలిగినవి గాన, ఇవి ఆకాశాంశములు గాన ఆకాశ పంచకము అనబడును. సమాన వ్యాన ఉదాన ప్రాణ అపానము లైదున్ను వాయువు యొక్క అయిదుభాగములవలన కలిగినవి గాన, ఇవి వాయువు అంశములు గాన వాయుపంచక మనబడును. శ్రోత్ర త్వక్కు చక్షు జిహ్వఘ్రాణము లైదున్ను అగ్ని యొక్క అయిదుభాగములవలన కలిగినవి గాన, ఇవి అగ్నియొక్క అంశములు గాన అగ్నిపంచక మనబడును. శబ్ద స్పర్శ రూప రస గంధము లైదున్ను జలముయొక్క అయిదుభాగములవలన కలిగినవి గాన, ఇవి జలముయొక్క అంశములు గాన జలపంచక మనబడును. వాక్కు పాణి పాద గుహ్య గుదము లైదున్ను పృథివియొక్క అయిదు భాగములవలన కలిగినవి గాన, ఇవి పృథివియొక్క అంశములుగాన పృథ్వి పంచకము అనబడును. ఇట్లు పంచభూతముల వలన కలిగిన ఇరువదియైదు తత్త్వములు గూడినదే స్థూలశరీర మనబడును ఈ స్థూలశరీరమే కర్మప్రపంచ మనబడును.

శ్రుతి॥ శ్రోత్రాది విజ్ఞానేంద్రియాణి । శ్రోత్ర మాకాశే । వాయౌ త్వక్ । అగ్నౌ చక్షు । రప్సు జిహ్వా । పృథివ్యాం ఘ్రాణ మితి॥ శారీరకోపనిషత్తు.

తా॥ శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము అనెడి ఈ అయిదున్ను జ్ఞానేంద్రియంబు లనబడును. శ్రోత్రము ఆకాశమునందును, త్వక్కు వాయువునందును, చక్షువు అగ్నియందును, జిహ్వ జలమునందును, ఘ్రాణము పృథివియందును, తత్త్వములు చేయు కార్యములు సంబంధించి యున్నది.

శ్రుతి॥ ఏత మింద్రియాణాం యథాక్రమేణ శబ్ద స్పర్శ రూపరస గంధాశ్చేతి విషయాః పృథివ్యాది మహాభూతేషు క్రమేణోత్పన్నాః శారీరకోపనిషత్తు.

శా। ఈ జ్ఞానేంద్రియంబు లైదున్ను, అగ్నిపంచకము గాన అగ్ని యంశములుగా నున్నను, ఇవి ఏయేభూతములందు సంబంధించియుండునో, అనగా ఏయేభూతకదంబములలో చేరినదిగా నుండునో, ఆయాభూత తన్మాత్రలను తెలియుచుండును. ఎట్లనగా శ్రోత్రము, ఇది అగ్నిపంచకము లోనిదిగాన అగ్నియంశమైనదిగా నున్నను ఆకాశము తోడ సంబంధించినదిగా నుండుటవలన, అనగా ఆకాశకదంబములో చేరినదిగా నుండుటవలన, ఆకాశతన్మాత్రయగు శబ్దమును ఈ శ్రోత్రము తెలియుచుండును. తక్కిన జ్ఞానేంద్రియములు ఆకాశముతో సంబంధము లేనిదిగాన, అవి ఆకాశతన్మాత్రయగు శబ్దమును తెలియజాలవు. త్వక్కు ఇదిఅగ్నిపంచకములోనిదిగాన అగ్నియంశమైనదిగా నున్నను వాయువుతోడ సంబంధించినదిగా నుండుటవలన, అనగా వాయుకదంబములో చేరినదిగాన, వాయుతన్మాత్రయగుస్పర్శమును ఈ త్వక్కు తెలియుచుండును. తక్కిన జ్ఞానేంద్రియంబులు వాయువుతో సంబంధములేనిదిగాన, అవి వాయుతన్మాత్రయగు స్పర్శమును తెలియజాలవు. మఱియు నేత్రము, ఇది అగ్నిపంచకములోనిదియగుచు అగ్నియంశమైనదిగా నుండుటవల్లను, తక్కినభూతములలో చేరక సంబంధించక, అగ్నిస్వరూపముగానే యుండుటవల్లను, అగ్నికదంబములోనిదిగానుండుటవల్లను, అగ్నితన్మాత్రయగు రూపమును ఈ నేత్రము తెలియుచుండును. తక్కిన జ్ఞానేంద్రియంబులు అగ్నియంశములుగానున్నను, అవి అగ్నికంటెను అన్యములుగ నుండు భూతములతో సంబంధించి యుండుటవలన అగ్నితన్మాత్రయగు రూపమును తెలియజాలవు. జిహ్వ ఇది అగ్నిపంచకములోనిదియగుచు అగ్నియంశమైనదిగానున్నను జలముతోడ సంబంధించినదిగా నుండుటవలన, అనగా జలకదంబములోనిదిగా నుండుటవలన జలతన్మాత్రయగురసమును జిహ్వ తెలియుచుండును, తక్కిన జ్ఞానేంద్రియంబులు జలముతోడ సంబంధము లేనిదిగాన జలతన్మాత్రయగు రసమును తెలియజాలవు ఘ్రాణము ఇది అగ్నిపంచకములోనిదియగుచు అగ్నియంశమైనదిగానున్నను పృథివితో సంబంధించినదిగా యుండుటవలన, అనగా పృథివికదంబములోనిదిగా నుండుటవలన, పృథివితన్మాత్రయగు గంధమును ఈ ఘ్రాణముతెలియుచుండును, తక్కినజ్ఞానేంద్రియంబులు పృథివితో సంబంధము లేనిదిగాన, అవిపృథివితన్మాత్రయగు గంధమును తెలియజాలవు. ఇట్లు ఈ శ్రోత్రము త్వక్కు నేత్రము జిహ్వ ఘ్రాణములు ఒక్కొక్కటిన్ని ఒక్కొక్క తన్మాత్రను తెలియుచుండుటవలన, ఇవి జ్ఞానేంద్రియంబు లనబడును. ఈ జ్ఞానేంద్రియంబులచే తెలియబడిన శబ్ద స్పర్శ రూప రస గంధము లైదున్ను జ్ఞానేంద్రియముల యొక్క విషయంబు లనబడును.

శ్రుతిః వాక్పాణి పాదపాయూపస్థాఖ్యాని। కర్మేంద్రియాణి। తేషాం క్రమేణ వచనాదాన గమన విసర్గా నందాశ్చైతే విషయాః। పృథివ్యాది మహాభూతేషు క్రమేణోత్పన్నాః॥ శారీరకోపనిషత్తు.

తా॥ వాక్కు పాణి పాదము ఉపస్థము గుదము ఈ అయిదున్ను పృథివిపంచక మగుచు పృథివియంశము లగుచున్నది. ఇట్లు ఇవి పృథివియంశములుగానున్నను, ఇవి యేయేభూతములతోడ సంబంధించియున్నదో ఆయాభూతకార్యములనే చేయుచుండును. ఎట్లనగా వాక్కు, ఇది పృథివిపంచకములోనిది యగుచు పృథివియంశమైనదిగా నున్నను, ఆకాశముతోడ సంబంధించినదిగా యుండుటవలన, అనగా ఆకాశకదంబములోనిదియగుటవలన ఆకాశగుణమగు శబ్దమును వాక్కు పలుకుచుండును. తక్కిన కర్మేంద్రియంబులు ఆకాశముతోడ సంబంధము లేనిదిగాన ఆకాశగుణ మగు శబ్దమును పలుకజాలదు. పాణి, ఇది పృథివిపంచకములోనిదియగుచు పృథివి అంశ మైనదిగా నున్నను, వాయువుతో సంబంధించినదిగా యుండుటవలన, అనగా వాయుకదంబములోనిది యగుటవలన, వాయుగుణమగు స్పర్శమును; పాణిస్పృశించుచు, పట్టుటవిడచుట ఇచ్చుట పుచ్చుకొనుట మొదలగు కార్యములను చేయుచుండును, తక్కిన కర్మేంద్రియంబులు వాయువుతోడ సంబంధములేనిదిగాన వాయుగుణమగు స్పృశించుట మొదలగు కార్యములను చేయజాలవు. పాదము ఇది పృథివిపంచకములోనిది యగుచు పృథివియంశ మైనదిగా నున్నను, అగ్నిలో సంబంధమైనదిగానుండుటవలన, అనగా అగ్నికదంబములోనిది యగుటవలన, అగ్నికార్య మగు గమనమును చేయుచుండును. తక్కిన కర్మేంద్రియంబులు అగ్నిలో సంబంధము లేనిది గాన అగ్నికార్యమగు గమనాది కార్యములను, అనగా నడచుట పోవుట వచ్చుట మొదలగు కార్యములను చేయజాలవు. గుహ్యము అనగా ఉపస్థము; ఇది పృథివిపంచకములోనిదగుచు పృథివియంశ మైనదిగానున్నను, జలముతోడ సంబంధ మైనదిగా నుండుటవలన, అనగా జలకదంబములోనిదిగా నుండుటవలన, జలకార్యమగు మూత్రమును శుక్లమును విడుచుచు, ఆనందించుచుండును. తక్కిన కర్మేంద్రియంబులు జలముతో సంబంధము లేనిదిగాన జలకార్యమగు మూత్రమును శుక్లమును విసర్జనము చేయజాలవు. పాయువు అనగా గుదము, ఇదిపృథివిపంచకములోనిదగుచు పృథివియంశ మైనదిగా నుండుచు, తక్కిన భూతములతో సంబంధము లేక పృథివిస్వరూపముగానే యుండుటవల్లను, పృథివికదంబములోనిది యగుటవల్లను, పృథివికార్యమగు మలవిసర్జనమును చేయుచుండును. తక్కిన కర్మేంద్రియంబులు పృథివియంశములుగా నున్నను పృథివికంటెను అన్యములైన భూతములతోడ సంబంధించి యుండుటవలన, ఆ సంబంధమైనట్టి భూతకార్యములను చేయుచుండునుగాని, పృథివికార్యమగు మలవిసర్జన కార్యమును చేయజాలవు. ఇట్లు ఈ వాక్కుపాణి పాదము గుహ్యము గుదములు, ఒక్కొక్కటిన్ని ఒక్కొక్క కార్యమును చేయుచుండుటవలన ఇవి కర్మేంద్రియము లనబడును. ఈ కర్మేంద్రియంబులచే చేయబడిన వచన ఆదాన గమన విసర్జన ఆనంద యిత్యాది కార్యములను కర్మేంద్రియముల యొక్క విషయంబు లనబడును॥

శ్లో॥ హృది ప్రాణో గుదేపానః సమానో నాభిసంస్థితః । ఉదానః కంఠదేశస్థో వ్యానః సర్వశరీరగః॥ అమరమునందలిది.

తా॥ సమానవాయువు నాభిస్థానమందు నిలిచియుండుచు జఠరాగ్నిని కలిగించుచు అన్నరసమును సకలమైన నాడులకు భాగించిపెట్టును, వ్యానవాయువు శరీరమునందు నఖశిఖపర్యంతము సర్వత్ర వ్యాపించియుండుచు అన్నరసమును శరీరమంతయు వ్యాపించునట్లు చేయును, ఉదానవాయువు కంఠస్థానమందుండుచు కంఠము జిహ్వ తాలువులు మూర్ధము పెదవులు అష్టస్థానములగుండా శబ్దమును పలికించుచు, మఱియు నిద్రావస్థయందు సర్వేంద్రియములను అవిద్యయందు చేర్చి మరల జాగ్రదవస్థయందు ఆయా ఇంద్రియములను యథారీతిగా దానిదాని స్థానంబునందు జేర్చుచు; సకల జంతువులను అన్నపానాదులను మ్రింగునట్లు అనగా భుజించునట్లున్ను జలమును త్రాగునట్లున్ను చేయును, ప్రాణవాయువు హృదయస్థానమందుండుచు నాసికారంధ్రముల గుండా ఊపిరితిత్తులయందు ఉచ్ఛ్వాస నిశ్వాసరూపముగా సంచరించుచుండును, ఎల్లవారికి ఆకలి దప్పి గలిగించును. అపానవాయువు గుదస్థానమందుండుచు మలమును వెలుపలికి విసర్జింపజేయును.

శ్రుతి॥ మనోబుద్ధిరహంకారశ్చిత్తమిత్యంతఃకరణచతుష్టయం । తేషాం క్రమేణ సంకల్ప వికల్పాధ్యవసాయాభిమానావధారణా స్వరూపాశ్చైతే విషయాః । మనస్థానం గళాంతం బుద్ధేర్వదన మహంకారస్య హృదయం చిత్తస్య నాభిరితి॥ శారీరకోపనిషత్తు.

తా॥ మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అను నీ నాలుగున్ను అంతఃకరణచతుష్టయము అనబడును. ఇవియే అంతరింద్రియంబు అనబడును. మనస్సు సంకల్ప వికల్పములు చేయుచుండును. బుద్ధి ఇదిమంచిది ఇది చెడ్డది అని వస్తుగుణములను యోచించి నిశ్చయించుచుండును. చిత్తము సదా విషయభోగములను స్మరించుచుండును. అహంకారము నేనే కర్తను నాకు మించినవాడు లేడు అని అభిమానించి కార్యాకార్యములందు విచారణ లేక తనయిష్టప్రకారము సర్వకార్యములు చేయుచుండును. మనస్సు కంఠస్థానమందుండును. బుద్ధి ముఖమునందుండును. అహంకారము హృదయస్థానమందుండును. చిత్తము నాభిస్థానమందుండును. మఱియు ఈ మనోబుద్ధిచిత్తాహంకారములు ఒక్కటిగాగూడి అంతఃకరణమనంబడును. ఈ అంతఃకరణము భ్రూమధ్యంబున నుండును.



స్థూలదేహ పంచీకరణ చక్రము.

| ఇది ఆకాశ పంచకము | ఇది వాయు పంచకము | ఇది అగ్ని పంచకము | ఇది జల పంచకము | ఇది పృథివి పంచకము | |
|---|---|---|---|---|---|
| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి | ఇవి పంచభూతము |
| జ్ఞాత | మనస్సు | బుద్ధి | చిత్తము | అహంకారము | ఇవి ఆకాశపంచకము |
| సమాన | వ్యానము | ఉదాన | ప్రాణము | అపాన | ఇవి వాయుపంచకం |
| శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణ | ఇవి అగ్నిపంచకము |
| శబ్దము | స్పర్శము | రూపము | రసము | గంధము | ఇవి జలపంచకము |
| వాక్కు | పాణి | పాదము | గుహ్యము | గుదము | ఇవి పృథివిపంచకం |

మఱియొక విధమైన పంచీకరణము.

శ్రుతి॥ అస్థిచర్మనాడీరోమ మాంసశ్చేతి పృథివ్యంశాః । మూత్ర శ్లేష్మరక్త శుక్ల స్వేదాః అబంశాః॥ క్షుత్తృష్ణాలస్య మోహ మైథునా నగ్నేః । ప్రచారణ విలేఖన స్థూలాక్ష్యున్మేష నిమేషాది వాయోః । కామక్రోధ లోభమోహ భయాన్యాకాశస్య॥ శారీరకోపనిషత్తు.

తా॥ ఎముకలు, చర్మము, నరములు, రోమములు, మాంసము, ఈ అయిదున్ను పృథివియొక్క అంశములు. మూత్రము, కఫము, రక్తము శుక్లము, చెమట ఈ అయిదున్న జలాంశములు. ఆకలి, ఆశ, ఆలస్యము లేక నిద్ర, మోహము మైధునము, ఇవి అగ్నియంశములు. నడుచుట, కదలుట, పోవుట, వ్రాయుట, కనుఱెప్పలు మూయుట లేక తెరచుట ఇవి వాయువు, అంశములు. కామ క్రోధ, లోభ, మోహ, భయములు, ఇవి అయిదున్న ఆకాశాంశములు.

గుణత్రయములు.

శ్రుతి॥ సాత్త్విక రాజసతామస లక్షణాని త్రయోగుణాః । అహింసా సత్య మస్తేయం బ్రహ్మచర్యా పరిగ్రహః । అక్రోధో గురుశుశ్రూషా శౌచస్సంతోష ఆర్జవం। అమానిత్వ మదంభిత్వ మహింప్రసతా ఏతేస్సర్వగుణాః జ్ఞేయా స్సాత్త్వికస్య విశేషతః॥ అహంకర్తా స్మ్యహంభోక్తా స్మ్యహం వక్తాభిమానవాన్ । ఏతే గుణా రాజసస్య ప్రోచ్యంతే బ్రహ్మవిత్తమైః॥ నిద్రాలస్యే మోహరాగౌ మైథునం చౌర్యమేవచ ।

ఏతే గుణాస్తామసస్య ప్రోచ్యంతే బ్రహ్మవాదిభిః॥ ఊర్ధ్వే సాత్త్వికో మధ్యే రాజసో ధస్తాత్తామస ఇతి। సమ్యగ్ జ్ఞానం సాత్త్వికం ధర్మజ్ఞానం రాజసం। తిమిరాంధం తామస మితి॥ శారీరకోపనిషత్తు.

తా॥ సాత్త్వికము రాజసము తామసము అని మూడుగుణములు గలవు. (1)జీవ హింసచేయకుండుట, సత్యమాడుట, దొంగలించకుండుట, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, కోపములేకుండుట, గురుశుశ్రూష, శౌచము, సంతోషము, సదాచారము, ప్రతిష్ఠలేకుండుట, దంభము లేకుండుట, జీవకారుణ్యము గలిగియుండుట, ఇవి యన్నియును సాత్త్వికగుణలక్షణములు, నేను కర్తను నేను భోక్తను నేను వక్తను అనెడి అహంకారములు గలిగియుండుటే రాజసగుణలక్షణములు, నిద్ర ఆలస్యము మోహము రాగము మైథునము చోరత్వము ఇవి యన్నియును తామసగుణలక్షణములు, ఉత్తమము సాత్త్వికగుణము, మధ్యమము రాజసగుణము, అధమము తామసగుణము. సాత్త్వికగుణము పరిశుద్ధ ఆస్తిక్యబుద్ధిని గలుగజేయుచు, నివృత్తిమార్గమును అచంచలభగవద్భక్తిని గురుభక్తిని సాధుజనవిశ్వాసంబును అభేదబ్రహ్మైక్యజ్ఞానమును గలుగజేయును. రాజసగుణము ప్రవృత్తిమార్గమును, అనగా కామ్యకర్మానుష్ఠానము తత్సంబంధమైన దేవతోపాసనలు మొదలైనవాటిని గలుగజేయును. తామసగుణము దేవుడు లేడు అనెడి నాస్తిక్యబుద్ధిని దురహంకారమును అవివేకాంధకారమును గలుగఁజేయును.

శ్రుతి॥ జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయ మితి॥ చతుర్విధావస్థాః। జ్ఞానేంద్రియ కర్మేంద్రియాంతః కరణ చతుష్టయ సంయుక్తం జాగ్రత్। అంతఃకరణచతుష్టయ సంయుక్తః స్వప్నః। చిత్తైకకరణా సుషుప్తిః। కేవల జీవయుక్త మేవ తురీయ మితి॥ శారీరకోపనిషత్తు.

తా॥ జాగ్రత్తు స్వప్నము సుషుప్తి తుర్యము అని నాలుగవస్థలుగలవు. (1) జ్ఞానేంద్రియంబులైదు, కర్మేంద్రియంబులైదు, అంతఃకరణ చతుష్టయము నాలుగు, మొత్తము ఈ పదునాలుగు ఇంద్రియములున్ను అదియది దానిదాని కార్యములు చేయుచుండునప్పుడు జాగ్రదావస్థయనబడును. (2) అంతఃకరణచతుష్టయమాత్రము తోచుచుండుటే స్వప్నమనబడును. (3) కేవల అజ్ఞానమునందు అంతఃకరణచతుష్టయము లయించి యుండుటే నిద్రావస్థ యనబడును. (4) మనస్సు మొదలగు పదునాలుగింద్రియములున్ను లయించి, జీవుడు కేవల ప్రజ్ఞానస్వరూపముగా నుండుటే తుర్యావస్థ యనబడును.

(శ్రుతి॥ తేషాం మనుష్యాదీనాం పంచభూత సమవాయ శ్శరీరం। జ్ఞాన కర్మేంద్రియైః జ్ఞానవిషయైః ప్రాణాది పంచవాయు మనోబుద్ధి చిత్తాహంకారైః స్థూలకల్పితై స్సోపి స్థూల ప్రకృతి రుచ్యతే.) అనెడి యోగచూడామణి ఉపనిషత్తురీతిగా; శిష్యా! మనోబుద్ధి చిత్తాహంకారములు నాలుగున్ను, పంచప్రాణములు ఐదున్ను, జ్ఞానేంద్రియంబులైదున్ను, కర్మేంద్రియంబులైదున్ను పంచతన్మాత్రలు ఐదున్ను ఈ మొత్తము ఇరువది తత్త్వములున్ను ఒకటిగా గూడి స్థూలశరీర మనబడును. ఈ స్థూలశరీరమునందు వసించుచుండు

## జీవాత్మ పరమాత్మ లక్షణములు.

జీవుడు ౨౫-వ. తత్త్వ మనబడును. (శ్రుతి॥ ద్వా సుపర్ణాభరతో, బ్రహ్మణో హంసభూత। స్తథేతరో భోక్తా భవ త్యన్యోపి సాక్షీ భవతీతి। వృక్ష ధర్మే తా తిష్ఠత। అతో భోక్త్రీ భోక్తారౌ పూర్వోపి భోక్తా భవతి। తథేతరో భోక్తా కృష్ణో భవతి) అనెడి గోపాలతాపిన్యుపనిషత్తు వాక్యరీతిగా, శిష్యా! ఈ శరీరమే ఒక వృక్షముగా నున్నది. అట్టి ఈ శరీరమనెడి వృక్షమునందు జీవాత్మ పరమాత్మ యనెడి రెండుపక్షులు వసించు చున్నవి. అందులో జీవాత్మయనెడి పక్షి దేహేంద్రియంబులే నేనని అభిమానించి భోక్తగానుండుచు కర్మఫలంబులను అనుభవించుచు సుఖదుఃఖంబులను బొందుచుండును. పరమాత్మ యనెడి పక్షి అభోక్తగా నుండుచు ఏకార్యమున్న చేయక ఏకర్మఫలము లను అనుభవించక సుఖదుఃఖములను జెందక అధిష్ఠానముగా సాక్షీమాత్రముగానుండును. మతియును, శిష్యా! శ్రద్ధగలవాడవై వినుమని యిట్లనియె. (శ్రుతి॥ జ్ఞానకర్మేంద్రియైః

## సూక్ష్మ శరీర వివరణము

ప్రాణాది పంచవాయు మనోబుద్ధిశ్చ సూక్ష్మ స్సోపి లింగ మి త్యుచ్యతే.) అనెడి యోగచూడామణి ఉపనిషత్తురీతిగా, శిష్యా! ఈ యిరువదిఅయిదు తత్త్వములే స్వరూప ముగాగల ఈస్థూలశరీరము లోపల పదియేడు తత్త్వములలో గూడిన సూక్ష్మశరీరము ఒకటి యున్నది. ఎట్లనగా మనోబుద్ధులు రెండున్ను, సూక్ష్మ జ్ఞానేంద్రియంబులు అయి దున్ను, సూక్ష్మ కర్మేంద్రియంబులు అయిదున్ను. పంచ ప్రాణవాయువులు అయిదున్ను ఈ మొత్తము పదియేడుతత్త్వములు ఒకటిగాగూడి సూక్ష్మశరీర మనబడును. ఈ సూక్ష్మ

## సూక్ష్మదేహ పంచీకరణ చక్రము.

| | | | | |
|---|---|---|---|---|
| ఆకాశము | వాయువు | అగ్ని | జలము | పృథివి |
| మనస్సు | | | బుద్ధి | |
| శ్రోత్రము | త్వక్కు | చక్షువు | జిహ్వ | ఘ్రాణము |
| సమానము | వ్యానము | ఉదానము | ప్రాణము | అపానము |
| వాక్కు | పాణి | పాదము | గుహ్యము | గుదము |

శరీరము అపంచీకృతమైనది, అనగా స్థూలశరీరము రీతిగా పంచీకరణముగానిది సూక్ష్మ శరీరమనగా కండ్లకు కనబడని శరీరమనబడును. శ్లో॥ సర్వవ్యాపృతికరణం లింగ మిదం స్యాచ్చి దాత్మనః పుంసః । వ్యాసాదిక మిత్యుక్తే నైవాత్మా భవ త్యసంగోయం॥ అనునట్లు, శిష్యా! ఒక వడ్లవాడు ఒక కొయ్యను చెక్కుడి విషయమందు వాడిక ఉంపను మొదలగు ఆయుధములను గలిగియుండుటవలన తాను కర్తగా అగుచున్నాడు. ఆ యాయుధంబులు లేనియెడల తాను కర్తగాజాలడు, అనగా తాను ఆకొయ్యను చెక్కుట మొదలగు కార్యములను చేయజాలడు. అట్లు జీవుడు సూక్ష్మ శరీరముతోడ సంబంధించి యుండుటవల్లనే తాను కర్తృత్వాహంకారముతోడ గూడుకొని కర్తగా అగుచు స్థూల శరీరముద్వారా సకల కార్యములను చేయుచు భోక్త అగుచున్నాడు, అనగా సకలమును అనుభవించుచున్నాడు. ఈ సూక్ష్మశరీర సంబంధము జీవునికి లేని యెడల జీవుడు కర్తృత్వాహంకారము లేనివాడగుచున్నాడు గాన కర్తగాజాలడు, అనగా ఏ కార్యములను చేయజాలడు, భోక్తగాజాలడు అనగా ఏదిన్ని అనుభవింప జాలడు. ఈ సూక్ష్మశరీరమే లింగశరీర మనబడును. మఱియు శ్రుతి॥ అనాది మాయా

## కా ర ణ శ రీ ర వి వ ర ము.

సుప్తో జీవః) అనెడి శ్రుతిరీతిగా, శిష్యా! ఈ జీవునికి అనాదిగా గలిగియుండు అజ్ఞానమే కారణశరీర మనబడును. ఇట్లు జీవుడు అజ్ఞానమువలన తాను పరబ్రహ్మ స్వరూపి యగుటను మఱచి దేహాభిమానము గలవాడై సూక్ష్మశరీరముతోడ గూడుకొని శ్రుతి॥ సంకల్పన స్పర్శన దృష్టి మోహైర్ గ్రాసాంబు వృష్ట్యాచాత్మ వివృద్ధ జన్మకర్మానుగా న్యనుక్రమేణ దేహీ స్థానేషురూపా ణ్యభి సంప్రపద్యతే॥ అనెడి శ్వేతాశ్వతరోపనిత్తు రీతిగా, శిష్యా! స్థూలశరీరముద్వారా నానావిధ తలంపులు గలవాడై లోకమునందలి విషయంబులను స్మరించుటవల్లను, స్పృశించుటవల్లను, చూచుటవల్లను, మోహించుట వల్లను, పుణ్యపాప కర్మములను చేయుచు ఆ కర్మఫలంబులగు సుఖదుఃఖములను అనుభవించుటకుగాను స్థూలశరీరంబును విడిచిపెట్టి సూక్ష్మశరీరముతోడ స్వర్గ నరకంబులను చేరి అచ్చట దేవతాశరీరంబునందు ప్రవేశించి స్వర్గలోకంబునందలి సుఖమును నరకలోకమునందలి దుఃఖమును అనుభవించి, మరల పూర్వకర్మానుసారముగా ఆ దేవతా శరీరమును విడిచిపెట్టి సూక్ష్మశరీరముతోడ భూలోకంబునందు తల్లిగర్భమునందు స్థూల శరీరమునందు ప్రవేశించి శిశువుగా జన్మించును. ఇట్లు భూలోకంబునకును స్వర్గలోకంబునకును పలుమారు సంచరించుచు జననమరణంబులం బొందుచు దుఃఖించుచుండును. ఈ జీవుడు స్థూలశరీరమును విడిచిపెట్టి సూక్ష్మశరీరముతోడ స్వర్గలోకమును చేరుటయే మరణమనబడును మరల స్వర్గమునందుండి సూక్ష్మశరీరంబుతోడ భూలోకంబున తల్లి గర్భంబునందు స్థూల శరీరంబులోపల ప్రవేశించి భూమిమీద శిశురూపముగా పుట్టుటే జననమనబడును. శిష్యా! జీవునికి కర్మానుసారముగా స్థూలశరీరములు అనేకములు

నశ్యించు పోవుచుండును. అయితే సూక్ష్మశరీరము మాత్రము ఒక్క శరీరమే గాని అనేక
ములు లేవు. శిష్యా! శ్రద్ధగలవాడవై వినుము అనియిట్లనియె. శిష్యా! జీవుడు సదాసూక్ష్మ
శరీరమును యెడబాయక దానితోడ గూడియుండునుగాన, జీవునికి సూక్ష్మ శరీరమే
సహజస్వరూపముగా నుండునుగాని, స్థూలశరీరము జీవునికి సహజస్వరూపము గాజా
లదు. కాబట్టి ఈ సూక్ష్మశరీరము అగ్నిలో కాలదు, ఆయుధములచే ఖండింపబడదు,
జలములో నానదు, వాయువుచే అల్లాడి శోషింపదు, ఈ సూక్ష్మశరీరము మహా ప్రళ
యంబునందున్ను నశింపదు. అయితే ఈ సూక్ష్మశరీరము, దీనికి కారణమైన అజ్ఞాన
మనెడి కారణశరీరము యెందాక నశింపకుండునో అందాక నశింపకుండును. (కారణ
శరీరము) అనగా అజ్ఞానము. జ్ఞానాగ్నివలన నశించినయెడల తోడనే సూక్ష్మశరీరము
తనకుతానే నశించిపోవును. అట్లు సూక్ష్మశరీరము నశించిన తోడనే జీవుడు జనన
మరణ సాగరంబునుదాటి ముక్తి పొందును కాబట్టి (లింగశరీర భంగమే) అనగా సూక్ష్మ
శరీర నాశనమే ముక్తి పొందుటకు కారణముగా నున్నది. అయితే ఈ సూక్ష్మశరీరము
దీనికి కారణమగు (అజ్ఞానమనెడి) కారణశరీరము నశింపని యెడల నశింపదు, అయితే
అజ్ఞానమనెడి కారణశరీరము జ్ఞానాగ్నివలన నశించునుగాని తక్కిన దానివలన నశిం
పదు. కాబట్టి ఒక్కొక్క మనుష్యుడున్ను తనకు గలిగియుండు అజ్ఞానమనెడి కారణ
శరీరమున్ను సూక్ష్మశరీరమున్ను నశించి తాను ముక్తి పొందుటకుగాను ముఖ్యముగా
ప్రయత్నపడి బ్రహ్మజ్ఞానమును సంపాదించవలయును. కాబట్టి (శ్లో॥ పాకస్య వహ్ని
వద్ జ్ఞానం వినా మోక్షో నైవ సిద్ధ్యతి॥) అనునట్లు, శిష్యా! బ్రహ్మజ్ఞానము లభింపని
యెడల యెంతటివారికిన్ని మోక్షము లభింపదుసుమా! అయితే బ్రహ్మజ్ఞానమనగా యెట్టి
దనగా; (శ్రుతి॥ మృత్యోస్స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥) అనెడి
కఠోప నిషత్తు రీతిగాను, మఱియు (శ్రుతి॥ యదాహ్యేవైష ఏతస్మి న్నుదర మంతరం
కురుతే। అథ తస్య భయం భవతి॥) అనెడి తైత్తిరీయోపనిషత్తు రీతిగాను, శిష్యా!
జీవుడు వేఱే పరమాత్మ వేఱే అని భావించుటే ద్వైతమనియు, భేదజ్ఞాన మనియు
చెప్పబడును. ఇట్టి భేదజ్ఞానమువలన జీవునికి జననమరణములు గలిగి దుఃఖించుచుం
డును. అయితే (శ్రుతి॥ జీవః పంచవింశకః స్వకల్పిత చతుర్వింశతి తత్త్వం పరిత్యజ్య
షడ్వింశ పరమాత్మాహ మితి నిశ్చయా జ్జీవన్ముక్తో భవతి॥) అనెడి మండల బ్రాహ్మ
ణోపనిషత్తు రీతిగా, జీవస్వరూపియగు నేను దేహేంద్రియంబులకు వేఱుగా నున్నాను
గాన, దేహేంద్రియంబులు నేనుగాను, మఱియు జీవస్వరూపియగు నేను పరమాత్మ
యొక్క అంశముగా నున్నానుగాన, నేనుపరమాత్మ, పరమాత్మయే నేను అని తెలిసి సదా
అభేదముగా జీవబ్రహ్మైక్యాను సంధానము చేయుచుండుటే అద్వైతమనియు బ్రహ్మ
జ్ఞానమనియు చెప్పబడును. కాబట్టి అట్టి అభేద అద్వైత బ్రహ్మజ్ఞానము వల్లనే జనన
మరణ హితమైన (ముక్తి) అనగా జీవబ్రహ్మైక్యము సిద్ధించును సుమా! (శ్రుతి॥ సోహం

బ్రహ్మేతి జానాతి తస్య ముక్తి ర్నజాయతే॥) అనెడి పైంగలోపనిషత్తు రీతిగా, శిష్యా! జీవుడే బ్రహ్మమని తెలియనివానికి యెన్నటికిని మోక్షము గలుగ జాలదు సుమా! కాబట్టి (శ్లో॥ నయోగేన నసాంఖ్యేన నకర్మణా నో నవిద్యయా। బ్రహ్మాత్మైకత్వ బోధేన మోక్షస్సిద్ధ్యతి నాన్యథా॥) అనునట్లు, శిష్యా! కేవలకుంభక ప్రాణాయామయోగ బంధముద్రాభ్యాసము చేతను, సాంఖ్యతత్త్వ విచారణచేతను, జప తప వ్రత దాన యాగాది కర్మానుష్ఠానము చేతను, వ్యాకరణము ఛందస్సు జ్యోతిషము మొదలైన అరువదినాలుగు విద్యలచేతను మోక్షము సిద్ధింపదు. అయితే నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేను; అని భావించి సదా జీవబ్రహ్మైక్య సంధానమును చేయుచుండుట వల్లనే మోక్షము సిద్ధించును. (శ్రుతి॥ అన్యవిద్యా పరిజ్ఞాన మవశ్యం నశ్వరం భవేత్। బ్రహ్మవిద్యా పరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం స్థితమ్ అనెడి శుకరహస్యోపనిషత్తురీతిగ; శిష్యా! లోకములోని విద్యలు యెన్ని నేర్చినను ఫలములేదు, ముక్తి లభింపదు, ఐతే జీవుడే బ్రహ్మము, బ్రహ్మమే జీవుడు అని తెలిసి, సదా జీవబ్రహ్మైక్యాను సంధానమనెడి బ్రహ్మవిద్యను అభ్యసించి, తాను బ్రహ్మస్వరూపుడై యుండుట వల్లనే ముక్తి లభించును సుమా! శిష్యా! నీకు బ్రహ్మజ్ఞాన మిట్టిదని సులభముగా బోధపడుటకు గాను గురుశిష్య సంవాదరూపంబులైన సర్వసారోపనిషత్తు మొదలగు ఉపనిషత్తులను కొన్నిటిని తాత్పర్యముతోడ విశదముగా బోధించుచున్నాను. శ్రద్ధ గలవాడవై వినుమని సర్వసారోపనిషత్తులను సంపూర్ణముగా బోధింప నారంభించెను.

సాంఖ్యసూత్రము - తాత్పర్య సహితము - సంపూర్ణము.

---

శ్రీరస్తు.

యజుర్వేదమునందలి గురుశిష్య సంవాదరూపమైన

# సర్వసారోపనిషత్తు ప్రారంభము.

---

సహనావవతు సహనౌ భునక్తు సహ వీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ఓం శాంతిః శాంతిః శాంతిః॥

తా॥ సత్యజ్ఞానానంద నిత్యనిర్మల సర్వపరిపూర్ణమగు నారాయణ పరబ్రహ్మము గురుశిష్యులగు మమ్మును కాపాడునుగాక, విషయాసక్తి లేక సదా బ్రహ్మవిచారణయందే కాలము గడుపుచుండవలయు ననెడి ఇచ్ఛగలిగిన మామీద ఆ పరబ్రహ్మము ప్రేమ యుంచునుగాక, ఆ పరబ్రహ్మము యొక్క కృపాకటాక్షములవలన శక్తి విద్యయు మైన

శ్రవణ మనన నిదిధ్యాసనములను మేము పొందుటకు మాకు వీర్యము గలుగుగాక. మా లోపల ఒకరి కొకరికి ద్వేషము మొదలగు దుర్గుణములు లేకపోవునుగాక, ఓ పరబ్రహ్మా! నారాయణా! భగవంతుడా! ఓం శాంతము, శాంతము, శాంతము.

శ్రుతి॥ ఓం కథం బంధః కథం మోక్షః! కా అవిద్యా కా విద్యాచేతి। జాగ్రత్స్వప్న సుషుప్తి తురీయంచ కథం। అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయ కోశాః కథం। కర్తా జీవః పంచవర్గః క్షేత్రసాక్షీ కూటస్థోం తర్యామీచ కథం। ప్రత్యగాత్మా పరమాత్మాచ కథం। కిం బ్రహ్మ। కతి పదార్థాః మాయాచేతి చ॥

తా॥ శిష్యప్రశ్నలు.—ఓ గురుస్వామి! (1) బంధమనగా నెట్టిది? మోక్షమనగా నెట్టిది? (2) అవిద్య యనగా ఏది? విద్య యనగా ఏది? (3) జాగ్రత్స్వప్నము సుషుప్తి తుర్యము లనగా ఎట్టివి? (4) అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశము లనగా ఏవి? (5) కర్త, జీవుడు, పంచవర్గము, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, సాక్షి, కూటస్థుడు, అంతర్యామి అనగా ఏవి యేవి? (6) ప్రత్యగాత్మ యనగా ఏది? పరమాత్మ యనగా ఏది? (7) బ్రహ్మమనగా ఎట్టిది? (8) ఎన్ని పదార్థము లున్నవి. (9) మాయ యనగా ఎట్టిది.

## బంధమోక్ష వివరణము.

శ్రుతి॥ ఆత్మా నాత్మనో దేహాదీన్ స్వాత్మత్వేనాభిమన్యతే। సాభిమాన ఆత్మనో బంధః। తన్నివృత్తి ర్మోక్షః॥

తా॥ గురుని ఉత్తరములు,—శిష్యా! ఆత్మ, ఈ దేహేంద్రియంబులను తానని తలంచుకొని అభిమానించుచున్నది. అట్లు అభిమానించుటవలన గలిగిన ఆ యభిమానమే బంధము, అట్టి అభిమానమును విడిచిపెట్టుటే మోక్షము. ఎట్లనగా, (శ్రుతి॥ కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః। ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః॥ సవా ఏష మహానజ ఆత్మా। యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు।) అనెడి బృహదారణ్యోపనిషత్తు వాక్యరీతిగా, సకలశరీరములందున్న (హృదయములోపల), అనగా బుద్ధి యనెడి గుహలోపల వసించుచు, (అహమహమని) అనగా నేను నేనని స్ఫురించుచుండు, కేవలజ్ఞానమాత్ర స్వరూపమైన వస్తువే ఆత్మ యనంబడును. మఱియు (శ్రుతి॥ కోఽయమాత్మేతి వయముపాస్మహే కతరః। స ఆత్మా ఏనవా రూపం పశ్యతి॥ ఏనవా శబ్దం శృణోతి। ఏనవా గంధానాజిఘ్రతి। ఏనవా వాచం వ్యాకరోతి। ఏనవా స్వాదుచాస్వాదుచ విజానాతి। సర్వాణ్యేవైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతి] అనెడి ఐతరేయోపనిషద్వాక్యరీతిగా, ఈ శరీరమునందు అంతఃకరణవృత్తితోడ గూడుకొని ఏది నేత్రేంద్రియముద్వారా సకలరూపములను దెలుసుకుచున్నదో, ఏది శ్రోత్రేంద్రియము ద్వారా సకలశబ్దములను ఎఱుగుచున్నదో, ఏది ఘ్రాణేంద్రియముద్వారా సకల వాసనలను నెఱుగుచున్నదో, ఏది జిహ్వేంద్రియముద్వారా సకలరసముల నెఱుగు

చున్నదో, ఏది వాగింద్రియముద్వారా సకలమాటలను చెప్పుచున్నదో, మఱియు పంచేంద్రియములద్వారా ఏది సకలవిషయముల తెలియుచున్నదో అదే జ్ఞానస్వరూపమగు ఆత్మ యనబడును. మఱియు జాగ్రత్తయందు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ అంతరింద్రియము లనెడి చతుర్దశేంద్రియముల చేత తాను అనుభవించినట్టి సుఖదుఃఖములనున్న, స్వప్నమునందు తా ననుభవించిన సుఖదుఃఖములనున్న, నిద్రయందు తాను సుఖముగా నుండుటనున్న, మరల మేల్కొన్నతోడనే పూర్వము నిద్రయందు తాను సుఖముగా నుండినట్లు చెప్పుటయు, ఒక్కొక్కరికిన్ని లోకమున అనుభవముగా నున్నది. ఇవే అవస్థాత్రయమునందలి సంగతులను శరీరము జ్ఞానములేని జడపదార్థ మగుటవలన తెలియగజాలదు, చెప్పజాలదు. కాబట్టి దేహమునకంటె వేరుగా ఒక జ్ఞానస్వరూపమగు వస్తువు ఈ శరీరమునందు వుండి సకలవిషయములను తెలియుచు చెప్పుచున్నదనుటకు సందేహములేదు సుమా? శిష్యా! అట్టి జ్ఞానస్వరూపమగు వస్తువే ఆత్మ యనబడును. అట్టి యాత్మ జన్మజరామరణములు లేనిది, ఉత్పత్తినాశములు వృద్ధిక్షయములు లేనిది, ఖడ్గాది ఆయుధంబులచే ఖండింపబడనిది, అగ్నిచే దహింపబడనిది, జలముచే తడుపబడనిది, గాలిచే చలింపబడనిది, అణువు కానిది, మహత్తు కానిది, హ్రస్వదీర్ఘములు కానిది, ఆదిమధ్యాంతములు లేనిది, పంచవర్ణములు కానిది, శబ్దస్పర్శరూపరసగంధములు లేనిది, ఆకాశాదిపంచభూతములు కానిది, ఆకాశమువలె నిరాకారమైనది, నిర్గుణమైనది, సర్వపరిపూర్ణమైనది, అనాదియైనది, అచలమైనది, పరిశుద్ధమైనది, స్వయంప్రకాశమైనది, పరంజ్యోతియైనది, సత్యజ్ఞానానందస్వరూపమైనది. శిష్యా! దేహము జన్మజరామరణంబులను గలది. ఉత్పత్తినాశంబులు వృద్ధిక్షయంబు గలిగినది, ఖడ్గాది ఆయుధంబులచే ఖండింపబడునది, అగ్నిచే దహింపబడునది, జలముచే తడుపబడునది, గాలిచే చలింపబడునది, ఆకాశాది పంచభూతములవలన గలిగినది, షడ్భావవికారములు గలది, కరచరణాది అవయవములే ఆకారముగా గలది, ఆదిమధ్యాంతములు గలది, సత్త్వరజస్తమోగుణములు గలది, సప్తధాతుమయమైనది, అశుద్ధమైనది, అసత్యమైనది, అజ్ఞానమైనది, దుఃఖస్వరూపమైనది. శిష్యా! కారణమగు నూలే కార్యమగు వస్త్రముగా నయినట్లు కారణము లగు ఇంద్రియంబులే కార్యమగు శరీరరూపముగా అగుచున్నది గాన, అట్టి ఇంద్రియంబులే సకలకార్యములు చేయుచున్నవి. నిర్వికారియై నిర్గుణుడైన ఆత్మ ఏకార్యములను చేయుటలేదు సుమా? (శ్రుతి॥ ననభో ఘటయోగేన సురాగంధేన లిప్యతే। తథాత్మోపాధియోగేన తద్ధర్మైర్నవిలిప్యతే॥) అనెడి అధ్యాత్మోపనిషత్తు వాక్యరీతిగా, కల్లుపోసియుండునట్టి ఒకకుండలో ఆకాశము వ్యాపించియున్నను, ఆకుండలో అంటుకొనియుండు కల్లుయొక్క దుర్గంధమును ఆయాకాశము అంటక, ఆకుండయొక్క వికారములను పొందక, అసంగముగా నుండునట్లు, దేహమునందు ఆత్మ వసించుచున్నను దేహమునంటక అసంగమై, దేహేంద్రియంబులయొక్క వికారంబులును దోషంబులును లేనిదై, (అకర్తగా) అనగా తాను ఏకార్యమును చేయక,

ఒకరిచే ఏకార్యమును చేయింపక, (అభోక్తగా) అనగా తాను ఏదిన్ని అనుభవించక
ఒకరిని అనుభవింపచేయక, కేవల సాక్షిమాత్రమై జ్ఞానానందస్వరూపముగా నున్నది.
అట్టి యాత్మ, మాయాభ్రాంతివలన తన నిజస్వరూపంబును మఱచి దేహేంద్రియంబులే
తనస్వరూప మని తనకు తోచుటచే అధ్యాస మనబడును. అధ్యాస మనగా ఒక
వస్తువునందలి గుణములు మఱియొక వస్తువునందు గలిగియుండునట్లు తోచుట, అట్టి
అధ్యాసమువలన ఆత్మ, దేహేంద్రియంబులే నే ననుచు, దేహమునకు గల జననమర
ణాదివికారములు నాకు గల వనుచును, ఇంద్రియంబులకు గల సుఖదుఃఖములు నాకు
గలవనుచును, ఇంద్రియంబులు చేయుకార్యములు నేను చేయుచున్నాననియు తలచుటే
అహంకార మనియు అభిమానమనియు చెప్పబడును. (శ్రుతి॥ కృశోఽహం దుఃఖబద్ధోఽహం।
హస్తపాదాది మానవహం। ఇతి భావానురూపేణ బధ్యతే॥) అనెడి మహోపనిష
ద్వాక్యరీతిగా ఆత్మ, అట్టి యభిమానమువలన నేను జననమరణములు గలవాడను నేను
చిక్కినవాడను, నేను సంసారదుఃఖముచే కట్టుబడియున్నాను, నేను కరచరణాది
అవయవములుగలవాడను, నేను అనాదికాలమునుండి కర్మపాశబద్ధుడై యున్నాను అని
భావించుచు దుఃఖించుచున్నాను గాన, ఆత్మకు దేహేంద్రియంబులే నే నని భావించు
అభిమానమే బంధ మనబడును. అట్టి యభిమానమును విడుచుటే మోక్షమనబడును.
ఎట్లనగా, (శ్రుతి॥ నాహం మాంసం నచాస్థీని దేహాదన్యః పరోఽస్మ్యహం। ఇతి
నిశ్చితవానంతః క్షీణావిద్యో విముచ్యతే॥ నాహం దుఃఖి నమే దేహో బంధః కోఽస్యా
త్మని స్థితః। ఇతి భావానురూపేణ ముచ్యతే॥) అనెడి మహోపనిషద్వాక్యరీతిగా,
తోలు మాంసము రక్తము నరములు మెదడు మజ్జ ఎముకలు అనెడి సప్తధాతుమయం
బగు శరీరమున్ను నేనుగాను, ఇంద్రియంబులు నేను గాను, ఈ దేహేంద్రియంబుల
కంటెను వేఱుగానున్నాను, శరీరము దుఃఖస్వరూపమైనది, ఈ శరీరముకంటెను
వేఱుగా నుండు నేను యెన్నటికిని దుఃఖినిగాను, సదానందుండను, నాకు దేహము
లేదు, నేను ఏకార్యమున్ను చేయుటలేదు, దేనిని అనుభవించుట లేదు, కర్మ నేనుగాను,
నాకు కర్మలేదు, నేను శుద్ధనిర్గుణనిర్వికార బ్రహ్మస్వరూపుడను, బ్రహ్మస్వరూపుడ
నగు నాకు బంధమెక్కడిది, నేను నిత్యముక్తుండను, అని యెఱుంగుటే మోక్ష మన
బడును. (శ్రుతి॥ ద్వేపదే బంధమోక్షాయ నిర్మమేతి మమేతిచ। మమేతి బంధ్య
తే జంతుర్ నిర్మమేతి విముచ్యతే॥) అనెడి మహోపనిషద్వాక్యరీతిగా, శిష్యా! దేహే
[illegible]యములే నేననియు, ఇంద్రియములు చేయు కార్యములు నేను చేయుచున్నాననియు
భావించుటే అహంకార మనబడును. ఈ శరీరము నాది, ఈభార్యాబిడ్డలు ధనము
గృహము ఇవి యన్నియు నాది యని తలంచుటే మమకార మనబడును. కాబట్టి అట్టి
యహంకార మమకారములు ఆత్మకు గలిగియుండుటే బంధ మనియు, అవి లేకపోవుటే
మోక్ష మనియు [illegible]బడును.

## విద్యావిద్యల లక్షణము.

శ్రుతి॥ యా తదభిమానం కారయతి సాహ్యవిద్యా । సోభిమానోయయా
నివర్తతే సా విద్యా॥

తా॥ దేహేంద్రియంబులే నేననెడి అభిమానము ఆత్మకు దేనివలన కలుగు
చున్నదో, అదే అజ్ఞాన మనియు లేక అవిద్య యనియు చెప్పబడును. అట్టి యభిమానము
ఏజ్ఞానమువలన నివర్తింపబడుచున్నదో ఆ జ్ఞానమే విద్య యనబడును.

## అవస్థాత్రయ లక్షణము.

శ్రుతి॥ మన ఆది చతుర్దశకరణైః పుష్కలై రాదిత్యా ద్యనుగృహీతైః శబ్దాదీన్
విషయాన్ స్థూలాన్ యదోపలభతే తదాత్మనో జాగరణం (1) తద్వాసనాసహితై
శ్చతుర్దశకరణైః శబ్దాద్యభావేపి వాసనామయాన్ శబ్దాదీన్ తత్కాలికాన్ ప్రతిభా
సమానాన్ యదోపలభతే తదా స్వప్నః (2) చతుర్దశకరణోపరమాద్ విశే
విజ్ఞానాభావాద్ యదా శబ్దాదీన్ విషయాన్ నోపలభతే తదాత్మా సుషుప్తం (3
అవస్థాత్రయ భావాభావ సాక్షిస్స్వయం భావాభావ రహితం నిరంతర చైతన్యమాత్ర
యదా తత్తురీయం॥ (4)

తా॥ శిష్యా! మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనెడి అంతరింద్రియము
నాలుగున్ను, శ్రోత్ర త్వక్కు నేత్ర జిహ్వ ఘ్రాణములు అనెడి జ్ఞానేంద్రియము
లైదున్ను, వాక్కు పాణి పాద గుహ్య గుదములనెడి కర్మేంద్రియంబు లైదున్ను, ఈ
పదునాలుగు ఇంద్రియములు ఒక్కటిగాగూడి చతుర్దశేంద్రియంబు లనబడును. (శ్రుతి॥
తత్తద్దేవతానుగ్రహాన్వితైః శ్రోత్రాది జ్ఞానేంద్రియైః శబ్దాద్యర్థవిషయగ్రహణ జ్ఞానం
జాగ్రదవస్థా భవతి॥) అనెడి పైంగలోపనిష ద్వాక్యరీతిగా, ఒక్కొక్కయింద్రియ
మున్ను దానిదాని అధిదేవతచే ప్రేరేపింపబడినదై ఆయాయింద్రియము దానిదాని కార్య
మును చేయుచుండును గాన, అట్లు అధిదేవతాసహితంబు లగు జ్ఞానేంద్రియంబు లైదు
న్ను దానిదాని విషయంబగు శబ్దస్పర్శరూపరసగంధంబులను ఒక్కొక్కటిని ఒక్కొక్క
యింద్రియంబు వేఱువేఱుగా ప్రత్యక్షముగా నెఱుగుచుండగా, అప్పట్లో తక్కి
కర్మేంద్రియాదులు అది యది దానిదాని కార్యంబుల జేయుచుండుటే జాగ్రదవ
యనంబడును. (1) (శ్రుతి॥ కరణోపరమే జాగ్రత్సంస్కారార్థ ప్రబోధవద్ గ్రాహ్య
గ్రాహక రూప స్ఫురణం । స్వప్నావస్థా భవతి॥) అనెడి పైంగలోప నిషత్తురీతిగ
జ్ఞానేంద్రియంబులు శబ్దస్పర్శరూపాది విషయంబులను ఎఱుంగక, తక్కిన కర్మే
యాదులు అది యది దానిదాని సహజమైన కార్యములను చేయక నెమ్మదిగా విశ్రమి
యుండగా అప్పుడు అంతకుముందు జాగ్రదావస్థయందు ఆయాయింద్రియంబుల
తెఱుంగబడిన విషయంబులనున్ను చేయబడిన కార్యములనున్ను అనుభవింపబడిన భో
ములను మనస్సు సంకల్పించుకొనుచుండును. అట్లు సంకల్పిం కొనుచుండగా

అప్పట్లో అక్కడ ఏవిషయంబులున్ను ఏకార్యములున్ను ఏభోగంబులున్ను సత్యముగా లేకున్నను, ఉన్నట్లున్ను వాటిని అనుభవించుచున్నట్లున్ను ఆ మనస్సునకు తోచుచుండుటే స్వప్నావస్థ యనబడును. (2) (శ్రుతి॥ చిత్తైక కరణా సుషుప్త్యవస్థా భవతి॥) అనెడి పైంగలోపనిషద్వాక్యరీతిగా; శిష్యా! మనస్సు మొదలగు చతుర్దశేంద్రియములున్ను దానికి కారణం బగు (అవిద్యయందు) అనగా అజ్ఞానమందు బీజాంకురమురీతిగా అణగి లయించి యుండగా ఇంద్రియంబులకు శబ్దస్పర్శరూపాది విషయంబుల నెఱింగెడి జ్ఞానంబులేక ఆయింద్రియంబులు ఏకార్యములను చేయక ఏభోగంబులను అనుభవించక ప్రపంచమున్ను తోచక గాఢాంధకారంబుగా నుండుటే నిద్రావస్థ యనబడును." (3) (శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్తీనా మయం చానాయ భాసకః। యతో భవతి సాహ్యాత్మా స్వప్రకాశ శ్చిదాత్మకః॥) అనునట్లు; శిష్యా! జాగ్రత వచ్చెను పోయెను, స్వప్నము వచ్చెను పోయెను, సుషుప్తి వచ్చెను పోయెను, అని దేని వలన తోచుచున్నదో, ఏది ఈ అవస్థాత్రయమును యెఱుంగుచున్నదో, అదే అవస్థాత్రయ భావాభావసాక్షియనియు ఆత్మయనియు చెప్పబడును. అట్టి అవస్థాత్రయ భావాభావ సాక్షియగు ఆత్మ, భావాభావ రహితమై, అనగా ద్రష్ట దృక్కు దృశ్యము లనెడి త్రిపుటిరహితమై, సంకల్ప వికల్పములు లేక, ఎటువంటి మఱపులు లేక, నిరంతర చైతన్య స్వరూపముగా నుండుటే తురీయావస్థ యనియు, నిర్వికల్పసమాధి యనియు, బ్రహ్మనిష్ఠ యనియు చెప్పఁబడును.

## చైతన్యలక్షణము.

శ్రుతి॥ అవస్థాత్రయోపహిత మవస్థాత్రయోప లక్షితంచ నిరవస్థ విశుద్ధ మేవ చైతన్యం॥

తా॥ శిష్యా! (శ్లో॥ నజాగరే స్వప్నసుషుప్తి భాసం। స్వప్నే ఽపి నాస్యే వపరేచ సుప్తౌ। యాద్యోతయంతే విశంతి త్రయంతత్। స్యాత్ చిత్తురీయేతి సదా చకాస్తి) అనునట్లు, ఏది అవస్థాత్రయంబునందు వ్యాపించి జాగ్రత్తయందు స్వప్న సుషుప్తులు లేవనియు, స్వప్నమునందు జాగ్రత్సుషుప్తులు లేవనియు, సుషుప్తియందు జాగ్రత్స్వప్నములు లేవనియు యెఱుంగుచు అవస్థాత్రయమునంటక; వాటికంటెను విలక్షణంబై పరిశుద్ధమై నిర్వికారమై స్వయంప్రకాశముగా తోచుచుండునో, ఆ స్వయంప్రకాశమే తురీయచైతన్యమనియు, లేక ఆత్మయనియు చెప్పబడును.

## పంచకోశవివరణము.

శ్రుతి॥ అన్నకార్యాణాం సమూహోఽన్నమయకోశః॥

తా॥ శిష్యా! (శ్రుతి॥ అన్నరసేనైవ భూత్వాన్న రసేనాభి వృద్ధిం ప్రాప్యాన్నరసమయ పృథ్వ్యాం యద్విలీయతే। సోన్న మయకోశః। తదేవ స్థూలశరీరమ్॥) అనెడి పైంగలోపనిషత్తు రీతిగా అన్నమువలన పుట్టి అన్నరసమువల్లనే వృద్ధి

పొందుచు, షడ్భావవికారములు గలదియై, తోలు ఎముకలు మాంసము రక్తము మొదలగు సప్తధాతుమయంబై, కరచరణాది అవయవసహితమై, స్తంభమువలె స్థూలాకారముగా కనబడుచు, కడపట కనపడక నశించి మట్టితోడమట్టిగా కలిసిపోవునట్టి ఈ స్థూలశరీరమే అన్నమయకోశ మనబడును.

శ్రుతి॥ ప్రాణాది దశవాయవోన్నమయకోశే యథా వర్తంతే తథా ప్రాణమయ కోశః॥

తా॥ శిష్యా! (శ్రుతి॥ కర్మేంద్రియైస్సహ ప్రాణాది పంచకం ప్రాణమయ కోశః) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, వాక్కు పాణి పాదము గుహ్యము గుదము అనెడి కర్మేంద్రియంబు లైదున్ను, ప్రాణ అపాన ఉదాన వ్యాన సమానము లనెడి పంచప్రాణములున్నుగూడి ప్రాణమయకోశ మనబడును. లేక, ప్రాణ అపాన ఉదాన వ్యాన సమాన నాగ కృకర కూర్మ దేవదత్త ధనంజయము లనెడి దశ వాయువులున్ను అన్నమయకోశం బగు స్థూలశరీరంబులోపల యెప్పుడు సంచరించుచున్నదో, అప్పుడు ప్రాణమయకోశ మనబడును.

శ్రుతి॥ ఏతత్కోశ ద్వయ సంయుక్తా ఆత్మా। మన ఆదిచతుర్దశ కరణై శ్శబ్దాది విషయ సంకల్పాది ధర్మాన్ యదా కరోతి తదా మనోమయకోశః॥

తా॥ శిష్యా! (శ్రుతి॥ జ్ఞానేంద్రియైస్సహ మనో। మనోమయకోశః॥) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, మనస్సున్ను జ్ఞానేంద్రియములైదున్ను గూడి మనోమయ కోశ మనబడును. లేక, అన్నమయ ప్రాణమయ కోశసహితుడైన ఆత్మ, మనస్సు మొదలగు చతుర్దశేంద్రియంబులతోడగూడి శబ్దస్పర్శరూపాది విషయంబుల నెఱుంగుచు సంకల్ప వికల్పములను చేయుచుండునపుడు మనోమయ కోశమనబడును.

శ్రుతి॥ ఏతత్కోశ త్రయ విశిష్టాంతః కరణే తద్గతవిశేషధ్యాన మననాది వృత్తయో యదోత్పద్యంతే। తదా విజ్ఞానమయకోశః॥

తా॥ శిష్యా! (శ్రుతి॥ జ్ఞానేంద్రియైస్సహ బుద్ధిర్విజ్ఞానమయకోశః।) అనెడి పైంగలోపనిషత్తు రీతిగా, బుద్ధియు జ్ఞానేంద్రియంబు లైదున్ను గూడి విజ్ఞానమయకోశ మనబడును. లేక అన్నమయ ప్రాణమయ మనోమయంబుల నెడి మూడుకోశములతోడ అంతఃకరణమున్ను గూడి, ఆ యంతఃకరణమునందు దాని సంబంధమగు ధ్యాన మననాది వృత్తులు ఎప్పుడు కలుగుచున్నదో, అప్పుడు విజ్ఞానమయ కోశ మనబడును. (శ్రుతి॥ ఏతత్కోశత్రయం లింగశరీరం॥) అనెడి పైంగలోపనిషత్తురీతిగా; శిష్యా! ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములు మూడున్ను లింగశరీరమనియు సూక్ష్మశరీర మనియు చెప్పబడును. జీవుడు ఈ సూక్ష్మశరీరముతోడ సదా ఎడబాయక కూడి యుండుచు, స్థూలశరీరముద్వారా తానుచేసిన కర్మానుసారముగా స్థూలశరీరంబును విడిచి సూక్ష్మశరీరంబుతో స్వర్గనరకంబులను జేరి యచ్చట సుఖదుఃఖంబు లనుభవించుచు, మరల కర్మశేషమునకుగాను భూలోకసంకల్పనందు బుట్టుచు మరల చావుచు, ఈ ప్రకారము జనన

మరణంబులెత్తుచు అల్లాడుచు దుఃఖించుచుండును. ఈ సూక్ష్మశరీరము దీనికి కారణమగు (కారణశరీరము) అనగా అజ్ఞానము ఉండువఱకును ఉండును, అజ్ఞానము నశించినయెడల దానితోగూడ దాని కార్యమగు సూక్ష్మశరీరమున్ను నశించును. కాబట్టి లింగశరీరమనెడు సూక్ష్మశరీరము యెంతదాక వుండునో, అందాక జీవుడు దానితో గూడుకొని జనన మరణంబులం బొందుచు దుఃఖించుచుండును. అజ్ఞానమనెడి కారణశరీరము నశించి దానితోగూడా లింగశరీరము నశించినయెడల తోడనే జీవుడు జనన మరణములు లేనివాడై పరబ్రహ్మమునందు ఐక్యమగుచూ నిత్యానందమగు మోక్షమునుబొందును.

శ్రుతి॥ ఏతత్కోశ చతుష్టయ కారణాజ్ఞాన సంపృక్తం। స్వకారణజ్ఞానం స్వరూపసుఖే వటధానాసు వటవృక్ష ఇవ। యదా వర్తతే త దానందమయకోశః॥

తా॥ శిష్యా! (శ్రుతి॥ స్వరూపాజ్ఞాన మానందమయ కోశః। తత్కారణశరీరం) అనెడి పైంగలోపనిషత్తు రీతిగా, ప్రియము మోదము ప్రమోదము అని మూడువృత్తులు గలవు. ప్రియమనగా తనకిష్టమైన పదార్థమును జూచినంతనే గలుగు సంతోషము. ఆ పదార్థము తనచేతికి లభించినతోడనే గలుగు సంతోషము మోదమనబడును. అట్లు చేతికి లభించిన పదార్థమును తాను అనుభవించినంతనే గలుగు సంతోషము ప్రమోదమనబడును, ఈ మూడువృత్తులతోగూడి అజ్ఞానమే ప్రధానముగా గల అంతఃకరణమే ఆనందమయ కోశమనబడును. లేక అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయములనెడి నాలుగు కోశములున్ను వాటికి కారణమగు అజ్ఞానములో గూడి యుండునపుడు, మఱ్ఱివిత్తనమునందు మఱ్ఱివృక్షము అణగియుండునట్లు స్వరూప సుఖమునందు తన కారణజ్ఞానము అణగియుండుటె ఆనందమయకోశ మనబడును.

శ్రుతి॥ కోశోపాధ్యుపహిత ఏవ ఆత్మా కోశ ఇత్యుపచర్యతే॥

తా॥ శిష్యా! కత్తిని ఒరయు, చింతపండును చింతగుల్లయు, బియ్యమును పొట్టును, వీణెను గవిసెనయు కప్పుకొని యుండునట్లు, పై జెప్పబడిన పంచకోశములున్ను ఆత్మను కప్పుకొని కనబడక జేయుటవలన వాటిని కోశములనబడుచున్నవి. శిష్య-ప్రశ్న. స్వామి! ఒరయును కత్తియును ఈ రెండును వేరువేరు పదార్థములుగాన సమానధర్మములు లేనివి. మఱియు ఇవి ఒక్కొక్కటిన్ని తనంతటతానే ప్రకాశించుచుండును గాని, ఒకటియొక్క సహాయము వలన మఱియొకటి తోచుచు ప్రకాశించుచుండునది గాదు, కాబట్టి కత్తిని ఒరమూసుకొని కనబడక చేయవచ్చును గాని, దార్ష్టాంతికంబున పంచకోశంబులు తమంతట తామే ప్రకాశించుచుండునవి గావు, ఆత్మసత్తామాత్రమును అనుసరించి జీవించుచు ప్రకాశించుచుండు గాన, అట్టి పంచకోశములను ఆత్మను కప్పుకొని కనబడక చేయునట్టి శక్తి యెట్లు కలిగెను? గురుని ఉత్త. శిష్యా! సూర్యుని సత్తవలన గలిగిన మేఘములు ఆ సూర్యుని కమ్ముకొని కనబడక చేయునట్లున్ను, అగ్నివలన గలిగిన ధూమము ఆయగ్నిని కమ్ముకొని కనబడక చేయునట్లున్ను, ఆత్మసత్తవలన

కలిగిన పంచకోశములు ఆత్మను మూసుకొని కనబడక చేయుచున్నవి. శిష్య-ప్రశ్న. స్వామీ! అట్లయితే అన్నమయ కోశమునకును ఆత్మకును ఎట్లు సంబంధము కలిగెను, గురు-ఉత్తర. శిష్యా! అన్యోన్య అధ్యాసమువలన కలిగెను. శిష్య-ప్రశ్న. స్వామీ! అధ్యాసమనగా నేమి? గురు-ఉత్తర. శిష్యా! ఒకవస్తువుయొక్క గుణములు మఱియొక వస్తువునందు కలిగియుండునట్లు తోచుటే అధ్యాసమనబడును. ఎట్లనగా, నేను జీవుడను అనుట జీవధ్యాసము, నేను మనుష్యుడను అనుట జాత్యధ్యాసము, నేను పుట్టి పెరిగి చచ్చుచున్నాడననుట షడ్భావవికారాధ్యాసము, నేను పురుషుడను స్త్రీని నపుంసకుడ ననుట చిహ్నాధ్యాసము, నేను బ్రాహ్మణుడను శూద్రుడననుట వర్ణాధ్యాసము, నేను ఆంధ్రుడను వెలనాటిని భారద్వాజ గోత్రిని కాశ్యప గోత్రుడ ననుట విశేషజాత్యధ్యాసము, నేను బ్రహ్మచారిని సన్న్యాసిననుట ఆశ్రమాధ్యాసము, నేను రాముడను కృష్ణుడననుట నామాధ్యాసము, నేను నల్లనివాడను తెల్లనివాడననుట రూపాధ్యాసము, నేను సోమయాజిననుట సంస్కారాధ్యాసము, నేను తత్త్వవాదిని విశిష్టాద్వైతిని శైవుడను భాగవతుడను శాస్త్రజ్ఞుడను విద్వాంసుడను యోగీశ్వరుడననుట వేషాధ్యాసము, నేను జ్ఞానిని మంగలవాడను చాకలవాడను వడ్లవాడను కంసాలివాడననుట క్రియాధ్యాసము, ఈ అధ్యాసములన్నియు అన్నమయ కోశమనెడి స్థూలశరీరమునకు గల లక్షణములు. ఈ లక్షణములు నిర్వికారమగు ఆత్మయందును, ఆత్మయొక్క సచ్చిదానంద లక్షణములు అన్నమయ కోశమనెడి స్థూల శరీరమునందును తోచుచున్నది గాన, అన్నమయకోశమునకును ఆత్మకును కూటమి కలిగెను. శిష్య-ప్రశ్న. స్వామీ! అన్నమయకోశ మనెడి ఈ స్థూలశరీరము ఏల ఆత్మ గాజాలదు? గురు-ఉత్తర. శిష్యా! ఈ స్థూలశరీరము ఈ జన్మమునకంటె ముందున్ను, మరణించి ఈ జన్మమును విడిచిన తర్వాతనున్ను లేకపోవుచున్నది. మఱియు ఈ స్థూలశరీరము ఉత్పత్తి వినాశాది షడ్భావ వికారములు గలది గాన, ఇది ఆత్మ గాజాలదు. ఈ స్థూలశరీరమే ఆత్మయని చెప్పిన యెడల, ఈ శరీరము ఈ జన్మము రాకమునుపు లేనందువలన పూర్వము చేయబడనట్టి కర్మఫలంబులగు సుఖదుఃఖములను ఈజన్మమునందు అనుభవించుచున్నానని చెప్పవలసివచ్చును ఇట్లు చెప్పుటవలన (అకృతాభ్యాగమ) దోషంబు గలుగును, అనగా పూర్వము కర్మము చేయకనే ఈ జన్మమునందు కర్మఫలంబులగు సుఖదుఃఖములను అనుభవించుచున్నానను దోషము సిద్ధించును, మఱియు మరణించిన తర్వాత ఈ శరీరము లేనందున ఈజన్మమునందు ఇప్పుడు చేయబడిన కర్మముల యొక్క ఫలంబులు అనుభవింప బడకనే క్షీణించి పోవలయును. ఇట్లు అంగీకరించినయెడల (కృత విప్రణాశ) దోషంబు సిద్ధించును అనగా ఈ జన్మమునందు చేసిన కర్మముయొక్క ఫలంబు అనుభవించకయే క్షీణించి పోవు నను దోషంబు సిద్ధించును. (శ్లో॥ అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం। నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి॥) అనెడి ప్రమాణశ్లోకమరీతిగా ఒకడు తాను చేసిన కర్మమును అనుభవించకున్న యెడల నశింపదు. అవశ్యము తా

(ప్ర)చేసిన కర్మఫలంబును తాననుభవించియే తీరవలయును గాన, పూర్వము చెప్పబడిన (కృతవిప్రణాశ) దోషంబును పండితులగు జ్ఞానులు అంగీకరింపజాలరు. ఆత్మ ఈ జన్మము రాకముందున్ను, ఈ జన్మము వచ్చినప్పుడున్ను ఈ జన్మము నశించినతర్వాతమున్ను ఈ త్రికాలములందున్ను ఆత్మనాశము లేకుండును. అయితే అన్నమయకోశమగు ఈ స్థూలశరీరము ఈ జన్మము రాకమునుపు లేనందువల్లను, ఇప్పుడు మరణించిన తర్వాత మట్టితో మట్టిగా కలిసి నశించిపోవుటవల్లను, ఇది నాశము లేనట్టి ఆత్మవలె గాజాలదు. శిష్య-ప్రశ్న-స్వామీ! ప్రాణమయకోశమునకున్ను ఆత్మకున్ను కూటమి యెట్లు కలిగెను? గురు-ఉత్త. శిష్యా! అన్యోన్యఅధ్యాసమువలన కలిగెను ఎట్లనగా, నేను ఆకలియును దప్పియును గలవాడను, సామర్థ్యముగలవాడను, బలపరాక్రమములు గలవాడను, వాచాలకుడను, మూగవాడను, దాతను, కుంటివాడను, నేను పొట్టి చేతులవాడను, నేను మందుడను, అనునివియెల్లను ప్రాణమయ కోశమునకు గల ధర్మములు. ఈ ధర్మములు ఆత్మయందును, నిర్వికారియగు ఆత్మయొక్క సచ్చిదానంద లక్షణములు ప్రాణమయ కోశమునందును గలిగియుండునట్లు తోచుటవలన, ఆత్మకును ప్రాణమయ కోశమునకును కూటమి గలిగెను. అయితే ప్రాణమయకోశమే ఆత్మయని చెప్పదమన్నయెడల పంచప్రాణ వాయువులే స్వరూపముగా గల ఈ ప్రాణమయకోశము జడమైనది, పరిచ్ఛిన్నమైనది, దృశ్యపదార్థమైనది గాన, ఇది అజడమై అపరిచ్ఛిన్నమై అదృశ్యమై దృక్కుగానుండు ఆత్మగాజాలదు. శిష్య-ప్రశ్న. స్వామీ! మనోమయ కోశమునకును ఆత్మకును కూటమి యెట్లు కలిగెను. గురు-ఉత్త. శిష్యా! అన్యోన్యఅధ్యాసమువల్లనే కలిగెను. ఎట్లనగా, నేను సంకల్పవికల్పములు గలవాడను, నేను దుఃఖిని, మోహిని, కామిని. కోపిని, క్రోధిని, ద్వేషిని, నేను వినువాడను స్పర్శించువాడను, చూచువాడను, నేను షడ్రసంబులను రుచి యెఱుంగువాడను, నేనుఆఘ్రాణించువాడను, నేను చెవిటివాడను, గ్రుడ్డివాడను, నాలుక లేనివాడను, ముక్కు లేనివాడను అనునివి మొదలైనవి మనోమయ కోశముయొక్క ధర్మములు. ఇవి నిర్వికారియగు ఆత్మయందును, ఆత్మయొక్క సచ్చిదానంద లక్షణములు మనోమయ కోశమునందును గలిగియుండునట్లు తోచుటవలన మనోమయ కోశమునకున్ను ఆత్మకున్ను కూటమి గలిగెను. శిష్యా! ఈ మనోమయకోశంబే ఆత్మయని చెప్పదమనిన, దేహంబునందు నేననెడి అభిమానమున్ను ఈ భార్యాబిడ్డలు ధనము యిల్లు మొదలయినవి నాది యనెడి మమకారమున్ను కలుగజేయు ఈ మనోమయకోశము ప్రాణమయ కోశంబునకంటెను వేఱై కామక్రోధాది వికారంబులు గలిగినదై, జడమై పరిచ్ఛిన్నమై దృశ్య పదార్థముగానున్నది గాన, ఇది ఆత్మగాజాలదు. శిష్య-ప్రశ్న. స్వామీ! విజ్ఞానమయ కోశంబునకును ఆత్మకును యెట్లు కూటమికలిగెను? గురు-ఉత్త. శిష్యా! అన్యోన్య అధ్యాసము వల్లనే కలిగెను. ఎట్లనగా, నేనుకర్తను, నేను నిశ్చయము గలవాడను, నేను బుద్ధిమంతుడను ఊహాపోహాలందు చతురుండను, ఏకసంతగ్రాహిని, ద్విసంతగ్రాహిని, నేను శ్రోత్రియుడను, భక్తుండను, ఉపాంసకుండను, పండితుండను, నేను విరక్తుండను, నేను లోకా

తరములకు పోవువాడను అనునివి మొదలైనవి విజ్ఞానమయకోశ ధర్మంబులు ఇవి నిర్వికారియగు ఆత్మయందును, ఆత్మయొక్క సచ్చిదానంద లక్షణంబులు విజ్ఞానమయకోశమునందును గలిగి యుండునట్లు తోచుచున్నవి గాన, ఆత్మకును విజ్ఞానమయ కోశంబునకును కూటమిగలిగెను. శిష్యా! ఈ విజ్ఞానమయకోశంబే ఆత్మయని చెప్పవదమనిన మనోమయ కోశంబునకంటెను వేఱుగా కర్తృశబ్ద వాచ్యంబుగ నుండు ఈ విజ్ఞానమయ కోశము చిదాభాసునితోడ కూడియుండెడి బుద్ధియే స్వరూపముగాగలది. ఈ బుద్ధి నిద్రావస్థయందు తనకు కారణంబగు అజ్ఞానమునందు లయించుచు, మరల జాగ్రదావస్థయందు ఉత్పత్తియగుచు, స్థూలదేహంబున నఖశిఖపర్యంతము వ్యాపించు చుండును, ఇట్లు ఉత్పత్తి లయంబులను బొందియుండు ఈ విజ్ఞానమయకోశము దృశ్యపదార్థము గాన, ఇది ఆత్మగాజాలదు. శిష్య-ప్రశ్న. స్వామీ! ఆనందమయ కోశమునకును ఆత్మకును కూటమి యెట్లుకలిగెను. గురు-ఉత్త. శిష్యా! అన్యోన్య అధ్యాసమువల్లనే కలిగెను. ఎట్లనగా నేను భోక్తను, నేను సంతుష్టుండను, నేను సుఖిని, నేను రాజసుండను, తామసుండను సాత్త్వికుండను, మూఢుడను, దుష్టుడను, శూన్యుడను, మోహితుడను, అవివేకిని, అజ్ఞానిని, భ్రాంతుండను అనునివి మొదలైనవి ఆనందమయకోశ ధర్మములు. ఇవి నిర్వికారియగు ఆత్మయందును, ఆత్మయొక్క సచ్చిదానంద లక్షణములు ఆనందమయ కోశంబునందును గలిగియుండునట్లు తోచుటవలన, ఆత్మకును ఆనందమయ కోశమునకును కూటమిగలిగెను. శిష్యా! ఈ ఆనందమయకోశంబే ఆత్మయని చెప్పవదమనిన, ఇది పరిచ్ఛిన్నంబై ఘటపటాదులవలె దృశ్యమగుచు జడమగుచున్నది గాన ఆత్మగాజాలదు. శిష్య-ప్రశ్న. స్వామీ! ఆత్మకు పంచకోశ వ్యతిరిక్తజ్ఞానము ఎట్లు గలుగును? గురు-ఉత్త. శిష్యా! కత్తిని ఒరమూసుకొని అవి రెండున్ను ఒకటిగా గనబడుచున్నను, శోధించిచూడగా ఆ కత్తియును ఒరయును వేఱుగానుండునట్లు, వేదాంతశాస్త్ర విచారణవలన ఆత్మ కోశత్రయమునందును, పంచకోశములకు వేఱుగా నున్నదని యెఱుగవచ్చును. ఎట్లనగా, ఒకడు నా యావు నాభార్య నాబిడ్డ నాయిల్లు అని చెప్పునపుడు తాను ఆ యావు భార్య బిడ్డ ఇల్లు మొదలగు వానికంటెను వేఱుగా నుండునట్లు, నా శరీరము నా ప్రాణము నా మనస్సు నా బుద్ధి అనునప్పుడు శరీరము ప్రాణము మనస్సు బుద్ధి మొదలగువానికంటెను తాను వేఱుగా నుండుటవలన, ఆత్మకు పంచకోశ వ్యతిరిక్తత్వము సిద్ధించును మఱియు ఒకకుండను జూచువాడు ఆ కుండకంటెను వేఱుగా నుండునట్లు, పంచకోశములను ఆత్మ యెఱుగుచున్నది గాన, అట్టి ఆత్మకు తాను పంచకోశములకంటెను వేఱుగా నున్నదను జ్ఞానము గలుగవచ్చును. మఱియు ఒకడు నా యావు చిక్కియున్నది, నా భార్య దుష్టురాలు, నా కొయ్య విరిగినది అనునప్పుడు ఆ యావు, భార్య, కొయ్యకు గలిగిన వికారములు తనకు లేక తాను వానికంటెను వేఱుగా నుండునట్లున్ను, మఱియు ఒకకుండయం దుండుజలము చలించుచుండగా ఆ జలమునందు దోచిన సూర్యబింబము చలించుచుండునుగాని, ఆకాశమునం దుండు సూర్యబిం

...ము చలింపక ఆ జలవికారంబులను పొందకుండునట్లున్ను, అన్నమయకోశ సంబంధమగు జీవత్వము మనుష్యత్వము మొదలగు ధర్మములున్ను, ప్రాణమయకోశ సంబంధమగు ఆకలిదప్పి మొదలగు గుణములున్ను, మనోమయకోశ సంబంధమగు సంకల్ప వికల్పములున్ను, విజ్ఞానమయకోశ సంబంధములగు కర్తృత్వాది వికారములున్ను ఆనందమయకోశ సంబంధములగు భోక్తృత్వాది వికారములున్ను విచారించిచూడగ, సత్యముగా నిర్వికారమై సద్రూపమై సాక్షిమాత్రమైయుండు ఆత్మకులేవు గాన, ఆత్మ పంచకోశములకంటెను వేఱుగా నిత్యముక్త పరబ్రహ్మ స్వరూపు డగుచున్నాడు. శిష్యా! ఇట్లు విచారించి ఎఱుగుటే పంచకోశ వ్యతిరిక్తజ్ఞాన మనబడును. శిష్య-ప్రశ్న. స్వామీ! పంచకోశములున్ను ఆత్మయున్ను రెండున్ను ఏకముగా కలిసియుండుట వలన ఆత్మ పంచకోశములకంటెను వేఱుగా నున్నదను జ్ఞానము ఎట్లుగలుగును? గురు-ఉత్త. శిష్యా! (శ్లో॥ బాహ్యదృష్టిర్ నేత్రం అంతర్ బుద్ధిః। బాహ్యదృష్ట్యా జ్ఞాతు మశక్యా అపి పదార్థాః। అంతర్ దృష్ట్యా జ్ఞాతుం శక్యం తే.) అనునట్లు బాహ్యదృష్టి నేత్రములు, అంతర్ దృష్టి బుద్ధియనబడును బాహ్యదృష్టియగు నేత్రములచే యెఱుగుటకు సాధ్యము కాని దానిని అంతర్దృష్టియగు బుద్ధిచే యెఱుగవచ్చును. ఎట్లనగా జలమునందుగల ఉష్ణమును వేఱుపఱచుటకు శక్యముగాక జలము ఉష్ణము రెండున్ను ఏకముగా నున్నను, చేతితో ఆజలమును స్పృశించి బుద్ధిచేత జలము వేఱు ఉష్ణము వేఱని యెఱుగునట్లున్ను, జలము గలసియుండు షడ్రసంబులను వేఱుపఱచుటకు శక్యము గాకున్నను, నాలుకచేత ఆ జలమును రుచిచూచి బుద్ధిచేత జలము వేఱు షడ్రసంబులు వేఱని ఎఱుగునట్లును, ఆత్మ పంచకోశములతోడ సంబంధించి వేఱుపఱచుటకు సాధ్యపడ: అవి రెండున్ను ఏకముగానున్నను, వివేకయుక్తమగు బుద్ధిచేత పంచకోశములు, పంచభూతములవలన గలిగినవనియు జడములనియు పరిచ్ఛిన్నములనియు దృశ్యములనియు వికారసహితంబు లనియు అనిత్యంబు లనియు, ఆత్మ పంచభూతముల వలన గలిగినది కాదనియు, జ్ఞానస్వరూపమై అపరిచ్ఛిన్నమై దృశ్యవస్తువు గానిదై నిర్వికారమై నిత్యమై సదా కాలత్రయంబునందును పంచకోశముల నంటక వేఱుగా సాక్షిమాత్రముగా నున్నదనియు యెఱుగవచ్చును. శిష్యా! రజ్జువునందు ఆరోపింపబడిన సర్పము ఆ రజ్జువుకంటెను వేఱుగా లేనట్లును, అనగా భ్రాంతివలన రజ్జువే సర్పముగా కనబడుచున్నది గాని, యథార్థముగా ఆ రజ్జువుకంటెను వేఱుగా సర్పమను పదార్థము మఱియొకటి లేదనియు, ఆ రజ్జువే సర్పరూపముగా గనబడుచున్నదనియు పరీక్షించి యెఱిగినట్లు విచారించి చూడగా ఆత్మయందు ఆరోపితంబులగు పంచకోశములున్ను ఆత్మకంటెను వేఱుగా లేదనియు, ఆత్మయే పంచకోశములుగా కనబడుచున్నదనియు యెఱుగవలయును. శిష్య-ప్రశ్న. స్వామీ! రజ్జు సర్పమును పరీక్షించి అది రజ్జువేగాని, సర్పము గాదని తెలిసిన తర్వాత మఱల ఆ రజ్జువు సర్పమనెడి భ్రాంతి గలుగజాలదు, గాని ఇట్లు ఆత్మకంటెను పంచకోశములు వేఱుగా లేదని విచారించి తెలిసినప్పటికిన్ని

మరల పంచకోశముల ప్రతీతి విడువక వచ్చుచున్నది గాన, ఆత్మకంటెను పంచకోశములు వేఱుగా లేదని యెట్లు చెప్పవచ్చును? గురు-ఉత్త. శిష్యా! ఎండమావులందు తోచెడి జలమును విచారింపగా ఎండమావులు వినా అక్కడ జలము లేదని యెఱిగినను మరల ఆ ఎండమావులందు జలము కనబడుచుండునట్లు, ఆత్మకంటెను పంచకోశములు వేఱుగా లేదని విచారించి తెలిసినప్పటికిన్ని మరల పంచకోశ వ్యవహారములు గలుగ వచ్చును. శిష్య-ప్రశ్న. స్వామీ! ఎండమావులందు జలము తోచుచున్న దను వ్యవహారమే గాని, ఆ జలమునందు యెవరున్ను స్నానపానాదులు చేసినట్లు అనుభవమునకు రాలేదు. ఐతే ఆత్మకంటెను పంచకోశములు వేఱుగా లేదని యెఱిగినప్పటికిన్ని మరల పంచకోశ ప్రతీతియు వాని వ్యవహారములున్ను తోచుచు అనుభవమునకు వచ్చుచున్నది. గాన ఆత్మకంటెను పంచకోశములు వేఱుగా లేదని యెట్లు చెప్పవచ్చును? గురు-ఉత్త. శిష్యా! మట్టివలన గలిగిన కుండలు చట్లు మొదలయినవి ఆ మట్టికంటెను వేఱుగా లేదని యెఱిగినట్లు, పంచకోశములు తోచుచు వ్యవహారమునకు వచ్చుచున్నను, (శ్రుతి॥ చైతన్యం వినా కించిన్నాస్తి॥) అనెడి నిరాలంబోపనిషత్తు వాక్యరీతిగాను, (శ్రుతి॥ సర్వం ఖల్విదం బ్రహ్మ। ఇదం సర్వం యదయమాత్మా। ఆత్మైవేదం సర్వమ్॥) అనెడి ఛాందోగ్య ఉపనిషత్తు రీతిగాను, ఆ పంచకోశములున్ను ఈ ప్రపంచము సర్వమున్ను పరబ్రహ్మమగు ఆత్మకంటెను వేఱుగా లేదని భావించుటే బ్రహ్మజ్ఞాన మనబడును. శిష్యా! ఇట్టి బ్రహ్మజ్ఞానమువల్లనే జీవన్ముక్తియు విదేహముక్తియు కలుగును గాని, తక్కిన వానివలన గలుగ జాలదు సుమీ?

## కర్తలక్షణము.

శ్రుతి॥ సుఖ దుఃఖ బుద్ధ్యాశ్రయత చిచ్ఛాయా। దేహాంతః కృతిమాన్ కర్తా॥

తా॥ శిష్యా! అహంకారమువలన దేహమే నే నని భావించి తెలివిలేనివాడై దేహేంద్రియములచే చేయబడిన కార్యములు నేను చేయుచున్నాననియు దేహేంద్రియంబులకు గల సుఖదుఃఖంబులు నాకుగల దనియు భావించువాడే కర్త యనబడును.

## సుఖదుఃఖములు ఏవి?

శ్రుతి॥ ఇష్ట మితి వృత్తి స్సుఖబుద్ధిః। అనిష్టమితి వృత్తి దుఃఖబుద్ధిః॥

తా॥ శిష్యా! ఏవృత్తి తన కిష్టమైనదిగా నుండునో అదే సుఖ మనబడును. ఏవృత్తి తనకు అనిష్టమైనదిగా నుండునో అదే దుఃఖమనబడును.

శ్రుతి॥ శబ్ద స్పర్శ రూప రస గంధాః సుఖదుఃఖసంయోగ హేతవః॥

తా॥ శిష్యా! శబ్ద స్పర్శ రూప రస గంధంబులే సుఖదుఃఖములు గలుగుటకు హేతువులుగా నున్నవి.

## పారమార్థిక జీవలక్షణము.

శ్రుతి॥ పుణ్యపాప కర్మానుసారీ భూత్వా । ఉప్రాప్తశరీర సంయోగః । ప్రాప్త శరీర సంయోగ మివ కుర్వాణః ప్రాణ్యధ్యాశీ జీవః॥

తా॥ శిష్యా! ప్రపంచము సర్వత్ర నిండియుండు ఒక్క ఆకాశమే ఘటోపాధి వలన ఆ ఘటోపాధియందు వ్యాపించి ఘటాకాశ మనియును, అట్లు ఘటోపాధి లేనిదే మహాకాశ మనియును రెండువిధములుగా వేఱువేఱుగా నైనట్లు, సర్వపరిపూర్ణమగు పరబ్రహ్మము ఒక్కటియే అవిద్యాహంకారము లనెడి ఉపాధియందు వ్యాపించి ఆ యవిద్య అహంకార ఉపాధులలో కూడియుండుటవలన, అవచ్ఛిన్నుడై ఆత్మయని యును, అట్టి ఉపాధులు లేనందువలన పరబ్రహ్మమనియును రెండువిధములుగా వేఱు వేఱుగా చెప్పబడుచున్నది కాబట్టి అట్టి ఉపాధి సహితుడగు ఆత్మ, తాను జననమర ణాది వికారములు లేక నిర్వికారుడుగా అసంగుడుగా సాక్షిమాత్రుడుగా బ్రహ్మ స్వరూపిగా నుండియు, అవిద్యాహంకార ఉపాధిసంబంధమువలన, ఆ యహంకారమే నేనని భ్రమించి (అహమహమనుచు) అనగా నేను నేనని స్ఫురించును. ఆయహం కారమునకుగల కర్తృత్వభోక్తృత్వాది వికారములు తనకు కలిగియుండునట్లును, మఱియు దేహేంద్రియప్రాణాదులే తాననియును భావించుచు, దేహేంద్రియ ప్రాణాదులకు గల జననమరణక్షుత్పిపాస రాగద్వేషాది వికారములు తనకు కలిగి యుండునట్లును భ్రమించుటే అధ్యాసమనబడును. అట్టి అధ్యాసమువలన ఆత్మ తాను జీవభావమునుపొంది (కర్తగాను) అనగా సకల పుణ్యపాపకర్మములను చేయువాడు గాను, మఱియు (భోక్తగాను) అనగా సకలవిషయసుఖదుఃఖములను అనుభవించువాడు గాను అగుచున్నాడు గాన, అట్టి ఆత్మ పారమార్థిక జీవుడనబడుచున్నాడు, అయితే ఆత్మకు గలిగిన ఈ జీవత్వము భ్రాంతివల్లనేగాని సత్యము గాదు గాన యథార్థముగా ఆత్మ యెన్నటికిని జీవుడు గాజాలడు, దేహేంద్రియాహంకారప్రాణాదులే నేననెడి అవిద్యాభ్రాంతి నశించినయెడల ఆత్మకు తాను జీవు డనెడి భ్రాంతి నశించి తాను పరబ్రహ్మస్వరూపు డగుచున్నాడు.

## పంచవర్గములు.

శ్రుతి మన ఆదిశ్చ ప్రాణ ఆదిశ్చ సత్త్వ ఆదిశ్చ భూత ఆదిశ్చ పుణ్య ఆదిశ్చ తే పంచవర్గాః॥

తా॥ శిష్యా! మనోబుద్ధి చిత్తాహంకారములు మనాదులు, ప్రాణ అపాన ఉదాన వ్యాన సమానములు ప్రాణాదులు, సత్త్వరజస్తమోగుణములు సత్త్వాదులు, పృథివి అప్పు తేజస్సు వాయువు ఆకాశములు భూతాదులు, పుణ్య పాప మిశ్రకర్మ ములు పుణ్యాదులు[illegible] అయిదున్ను పంచవర్గము లనబడును.

## క్షేత్రజ్ఞుఁ డనెడి చిదాభాసజీవలక్షణము

శ్రుతి॥ పంచవర్గ ధర్మిభూతాత్మ జ్ఞానామృతేన వినశ్యత్వాత్మ సన్నిధౌ నిత్యత్వేన ప్రతీయతేన మూలావిద్యాత్వాత్మోపాధి రత్ర స్తదేన లింగశరీరబీజం । హృదయగ్రంథి రిత్యుచ్యతే । తత్ప్రతిఫలితం చైతన్యం యత్ ప్రకాశతే సః క్షేత్రజ్ఞః॥

తా॥ శిష్యా! మీఁద చెప్పబడిన పంచవర్గములున్ను అవిద్యాశక్తివలన గలిగినవి, ఈ అవిద్య జ్ఞానోదయము గలుగుపర్యంతము నిత్యముగా నుండును. జ్ఞానోదయము గలిగిన వెనుక ఆత్మసన్నిధియందు తనకు తానే నశించిపోవును. అట్టి అవిద్యయే అజ్ఞానమనియు అంతఃకరణమనియు చెప్పబడును. బీజమునందుండి మొలక పుట్టుటవలన ఆ మొలకకు ఆ బీజము కారణముగా నుండునట్లు, అవిద్యవలన (లింగశరీరము) అనగా పదియేడు తత్త్వములతోఁ గూడిన సూక్ష్మశరీరము కలుగుటవలన, సూక్ష్మశరీరమునకు అవిద్యయే కారణమగుచున్నది. కాబట్టి అవిద్యకు కారణశరీరమనబడును. అట్టి అవిద్యయే అసంగుఁడైన ఆత్మకు ఉపాధి యనఁబడును. ఒక ముఖమే అద్దమునందు ప్రతిబింబించి రెండు ముఖములుగా కనబడుటవలన ముఖమునకు అద్దము ఉపాధి యనబడును. అట్లు ఆత్మ (అవిద్యయందు) అనఁగా అంతఃకరణమునందు ప్రతిబింబించి రెండుగా కనబడుటవలన, అవిద్య ఆత్మకు ఉపాధి యనబడును. అట్టి ఉపాధియగు (అవిద్యయందు) అనగా అంతఃకరణమునందు తోఁచిన ఆత్మయొక్క ప్రతిబింబమే చిదాభాసజీవుఁడనియు, లేక క్షేత్రజ్ఞుఁ డనియు చెప్పబడును. (శ్రుతి॥ అంతఃకరణ ప్రతిబింబిత చైతన్యం యత్ తదే వావస్థాత్రయ భాగ్భవతి । స జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాః ప్రాప్య । ఘటీయంత్రవ దుద్విగ్నో జాతో మృత ఇవ స్థితో భవతి । జాగ్రదావస్థాయాం తత్ర భ్రూమధ్యగతో జీవ ఆపాదమస్తకం వ్యాప్య । కృషి శ్రవణాద్యఖిలక్రియా కర్తా భవతి । తత్తత్ఫలభుక్చ భవతి॥ స్వప్నావస్థాయాం తత్ర విశ్వ ఏవ జాగ్రద్వ్యవహార లోపాన్నాడీ మధ్య చరణ । తైజసత్వ మవాప్య వాసనారూపకం । జగద్వైచిత్ర్యం స్వభాసా భాసయన్ । యథేప్సితం స్వయం భుంక్తే । సుషుప్త్యవస్థాయాం శ్రమవిశ్రాంత శకునిః పక్షౌ సంహృత్య । నీడాభిముఖం యథా గచ్ఛతి । తథా జీవోపి జాగ్రత్స్వప్న ప్రపంచే వ్యవహృత్య । శ్రాంతో ఽజ్ఞానం ప్రవిశ్య స్వానందం భుంక్తే॥) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, శిష్యా! క్షేత్రజ్ఞుఁ డనబడునట్టి చిదాభాసజీవుఁడే జాగ్రదావస్థయందు స్థూలశరీరంబున భ్రూమధ్యంబునందు వసించుచు తల మొదలుకొని పాదములవఱకు దేహమంతయు వ్యాపించి, దేహేంద్రియప్రాణాదులే నేనని అభిమానించి, ఉద్యోగము వర్తకము సేద్యము యజ్ఞము దానము మొదలగు పుణ్యపాపకార్యములను జేయుచున్నాఁడు గాన కర్త అనబడుచున్నాఁడు. మఱియు ఈ చిదాభాసజీవుఁడే స్రక్చందన వనితాది సకలభూలోకభోగంబులను అనుభవించుచున్నాఁడు [illegible] భోక్త అనబడును. ఈ చిదాభాసజీవుఁడే జాగ్రదావస్థను విడిచి స్వప్నా

స్వప్నావస్థను జేరి అచ్చట జాగ్రద్వాసనావశమున తన మనోసంకల్పితంబైన స్వప్న ప్రపంచమునందు సూక్ష్మశరీరముతోడ కూడుకొని । సకలభోగములను అనుభవించుచున్నాడు. మఱియు ఒకవృక్షమునందుండు గూటిలో నుండునట్టి పక్షి ఆ గూటినుండి బయలుదేరి దేశమంతయు నాలుగుదిక్కులందున్న సంచరించి మేతమేసి తనకడుపు నిండించుకొని మరల యథాప్రకారముగా తానుండునట్టి గూటిని పోయిచేరి విశ్రమించునట్లు, ఈ చిదాభాసజీవుడే జాగ్రదావస్థయందలి ప్రపంచమునందున్న స్వప్న ప్రపంచమునందున్న నానావిధ వ్యవహారములుచేసి అలసి నిద్రావస్థను పొంది అజ్ఞానమను గూటిని జేరి విశ్రమించి తన్ను మఱచి నిద్రించుచు అజ్ఞానానందంబున అనుభవించుచుండును. (శ్రుతి॥ సర్వజీవ భయప్రదా స్థూలదేహ విసర్జనీ । మరణావస్థా భవతి॥ కర్మేంద్రియాణి జ్ఞానేంద్రియాణి తత్తద్విషయాన్ ప్రాణాన్ । సంహృత్య కామకర్మాన్వితా అవిద్యా భూతవేష్టితో జీవో। దేహాంతరం ప్రాప్య లోకాంతరం గచ్ఛతి। ప్రాక్కర్మ ఫలపాకేన ఆవర్తాంతర కీటవత్ విశ్రాంతిం నైవ గచ్ఛతి॥) అనెడి పైంగలోపనిషత్తు రీతిగా, శిష్యా! ఇట్లు ఈ చిదాభాసజీవుడు స్థూలశరీరంబునందుండు అవస్థాత్రయమును పొందుచు సకలవ్యవహారములు చేయుచు, ఇట్లు కొంతకాలము గడచినతర్వాత ఈ స్థూలశరీరమును విడిచిపెట్టి సూక్ష్మశరీరముతోడ పోవుచున్నాడు. స్థూలశరీరమును విడిచిపోవుటే మరణమనబడును. ఇట్లు స్థూలశరీరమును విడిచినవాడై సూక్ష్మశరీరముతో కూడుకొని అజ్ఞానమనెడి భూతావేశము గలిగిన ఈ చిదాభాసజీవుడు స్వర్గనరకలోకంబులను జేరి పూర్వము తాను భూలోకమునందు స్థూలశరీరముతోడ కూడుకొని చేసినట్టి పుణ్యపాప కర్మానుసారముగా, అచ్చట దేవతాశరీరంబులనుపొంది సుఖదుఃఖంబు లనుభవించి, కర్మఫలక్షయానంతరము మరల పూర్వకర్మానుసారముగా భూలోకంబున తల్లిగర్భంబున శిశురూపంబుగా నుండి జన్మించుచుండును. మరల పూర్వకర్మానుసారముగా కర్మములు చేయుచు మరణించి స్వర్గనరకంబులం బొందుచు, మరల భూలోకమునందు జన్మించుచు, ఇట్లు జలప్రవాహమునం దుండెడు సుడిలో తగులుకొన్న పురుగు ఆ సుడిని తప్పించుకొని దాటిపోవుటకు శక్తిలేక ఆ సుడియందే చుట్టిచుట్టి తిరుగుచు అల్లాడుచుండునట్లు, జననమరణ ప్రవాహసుడిలో చిక్కుకొని పలుమారు పుట్టుచు చచ్చుచు, దాని తప్పించుకొని దాటపోవుటకు శక్తిలేక అల్లాడుచు తత్తరించుచు దుఃఖించుచుండును. (శ్రుతి॥ సత్కర్మ పరిపాకతో బహూనాం జన్మనామంతే నృణాం మోక్షేచ్ఛా జాయతే। తదా సద్గురు మాశ్రిత్య చిరకాల సేవయా। బంధాన్మోక్షం కశ్చిత్ప్రయచ్ఛతి॥) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, శిష్యా! ఇట్లు ఈ చిదాభాసజీవుడు అనేకజన్మములందు తాను జేసిన పుణ్యవిశేషంబువలన ఒకసారి మానవ జన్మమెత్తి తాను మోక్షము పొందవలయు ననెడి ఇచ్ఛగలవాడై జ్ఞానానుష్ఠానము గలిగిన సద్గురువు నాశ్రయించి, నీడయున్ను దేహమున్ను యెడబాయకుండునట్లు బహుకాలము ఆ గురుని యెడబాయక సేవించుచు వారికటా

క్షమువలన నిత్యానిత్యవివేక శ్రవణ మనన నిదిధ్యాసనంబుల జేయుచు జ్ఞానదీపమును సంపాదించుకొని అజ్ఞానమను చీకటిని పారద్రోలి తనస్వరూపంబు నెఱింగి, అనగా (అంతఃకరణ ప్రతిబింబ మగుచు చిదాభాసజీవుడు అని చెప్పబడిన నాకు ఈ జీవ స్వరూపము మిథ్యాస్వరూపమనియు, దేహేంద్రియాంతఃకరణాదులకు సాక్షిగా నుండునట్టి ఆత్మస్వరూపమే నానిజస్వరూపము గాన, ఈ జీవస్వరూపము నేను గాను, ఈ జీవవికారంబులున్న నాకులేవు, దేహేంద్రియంబులున్ను నేనుగాను, దేహేంద్రియంబులకుగల వికారంబులున్ను నాకులేవు. నేను దేహత్రయ అవస్థాత్రయ జీవసాక్షియగు ఆత్మస్వరూపుడను, అట్టి ఆత్మస్వరూపుడగు నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేను అని యెఱింగి) సదా బ్రహ్మాత్మ అభేద ఐక్యభావముగలిగి ఆత్మానుసంధానమును చేయుచు ప్రారబ్ధకర్మనాశ పర్యంతము (శ్రుతి॥ రాగద్వేష భయాదీనా మనురూపంచరన్నపి। యోంతర్వ్యోమవదత్యచ్ఛ స్సజీవన్ముక్త ఉచ్యతే) అనెడి ఉపనిషద్వాక్యమురీతిగా, తానులోకులరీతిగా రాగద్వేష భయాదులు కలిగిన వానివలె నటించుచు సకల వ్యవహారములు చేయుచున్నను, అంతర్యమున తాను ఆకాశమువలె నిరాకారుడనియు నిర్గుణుడనియు నిర్వికారుడనియు సాక్షిమాత్రుడనియు భావించుచు, జీవకారుణ్యము గలవాడై సదా ఆత్మానుసంధానముం జేయుచు, జీవన్ముక్తుడు అనుభవించును. ప్రారబ్ధకర్మము క్షయించిన తోడనే తనకు గలిగియుండిన బ్రహ్మాత్మ అభేద ఐక్య జ్ఞానమువలన స్థూల సూక్ష్మ కారణదేహములు నశించి, ఘటమునందలి జలము నశించినంతనే ఆ ఘటజలమునందు తోచిన ప్రతిబింబసూర్యుడు ఆకాశమందుండు సూర్యబింబములో కలిసిపోవునట్లు, తన చిదాభాసజీవరూపము ఆత్మయందు లయించి పరిశుద్ధ ఆత్మస్వరూపియగుచు, ఘటము పగిలినంతనే ఘటాకాశము మహాకాశమునందు గలిసి ఏకమైనట్లు, ఆత్మస్వరూపియగు తాను సర్వపరిపూర్ణ పరబ్రహ్మమునందు గలిసి అభేద పరబ్రహ్మస్వరూపుడగుచున్నాడు. అట్టి బ్రహ్మైక్యమే జనన మరణములులేని విదేహ ముక్తియనియు విదేహకైవల్యమనియు నిజమోక్షమనియు చెప్పబడును. కాబట్టి శిష్యా! లోకమున సకల జంతువులందున్ను ఒక్కొక్క దేహమునందున్న ఆత్మతోడ యెడబాయక చిదాభాస జీవస్వరూపమున్ను వ్యాపించియున్నది గాన, ఒక్కొక్క మానవుడున్ను తనకు గలిగిన చిదాభాస జీవస్వరూపము లయించి జనన మరణములు లేనివాడై, పరిశుద్ధ ఆత్మస్వరూపియై, తాను బ్రహ్మస్వరూపుడగుటకుగాను బ్రహ్మ జ్ఞానమును పొందవలయును. అట్లు బ్రహ్మజ్ఞానము పొందుటకుగాను వేదాంత విచారణ చేయవలసినదే. గురుసేవ ఈశ్వరభక్తి విషయవైరాగ్యము జీవకారుణ్యము మొదలగు సద్గుణములు గలిగి సాధుసాంగత్యము చేయవలసినదే సుమా!

## సాక్షి లక్షణము.

శ్రుతిః జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయాదా వావిర్భావ తిరోభావ జ్ఞాతా స్వయం। తదా విర్భావ తిరోరహితః స్వయంజ్యోతి శ్చేతన స్సాక్షీ॥

తా॥ శిష్యా! (జ్ఞాతృ) అనఁగా అంతఃకరణ ప్రతిబింబమగు చిదాభాస జీవుఁడు. (జ్ఞానము) అనఁగా అంతఃకరణము. (జ్ఞేయము అనఁగా దేహేంద్రియాది ప్రపంచము. ఈ జ్ఞాతృజ్ఞాన జ్ఞేయంబులే ద్రష్టదృక్కు దృశ్యము లనియు, ధ్యాతృధ్యాన ధ్యేయములనియు చెప్పఁబడును. ఇవియే త్రిపుటి యనఁబడును. ఇట్టి త్రిపుటి అవస్థాత్రయములో ఒక అవస్థయందు తోఁచుచు మఱియొక అవస్థయందు తోఁచకపోవును. ఈ త్రిపుటి రీతిగా ఒక అవస్థయందు తోఁచుట, మఱియొక యవస్థయందు తోఁచకపోవుటయు లేక, అవస్థాత్రయము నందున్న స్వయంజ్యోతియై నాశము లేకుండును. ఈ త్రిపుటి ఒక అవస్థయందు తోఁచుచున్న దనియు, మఱియొక అవస్థయందు తోఁచుట లేదనియు, ఏది జ్ఞానస్వరూపమై వెలుఁగుచున్నదో, ఆ జ్ఞానస్వరూపమగు వస్తువే సాక్షియనియు చెప్పబడును. అట్టి సాక్షియే ఆత్మ యనఁబడును.

## కూటస్థలక్షణము.

శ్రుతి॥ బ్రహ్మాది పిపీలికాంత సర్వప్రాణి బుద్ధిష్వవిశిష్టతయోపలభ్యమాన స్సర్వప్రాణి బుద్ధి సాక్ష్యధిష్ఠా నాత్మాస్తి భాసతే చ । సః కూటస్థః॥

తా॥ శిష్యా! (శ్రుతి॥ అంతశ్శరీరే నిహితో గుహాయా మజ ఏకో నిత్యః॥) అనెడి సుబాలోపనిష ద్వాక్యరీతిగా, పిపీలికాది బ్రహ్మపర్యంతము ఒక్కొక్క జీవుని దేహమునందును బుద్ధియనెడి గుహలోపల వ్యాపించి, ఆ బుద్ధికి సాక్షిగాను అధిష్ఠానముగాను నుండు స్వయంప్రకాశ వస్తువే కూటస్థుఁ డనఁబడును. అదే ఆత్మ। శ్లో॥ న సాక్షిణం సాక్ష్యధర్మాః సంస్పృశంతి విలక్షణమ్। అవికార ముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్॥) అనునట్లు శిష్యా! ఒక యింటిలోపల కూటమునందు దీపము వెలుఁగుచుండఁగా ఆ దీపమును అనుసరించి ఆ కూటమునందలి జనులు సంచరించుచు సకల కార్యములు చేయుచున్నను, ఆ దీపముమాత్రము ఏ కార్యము చేయక ఏ వికారమున్ను లేక చలింపకుండునట్లు, ఈ దేహంబునందు బుద్ధియనెడి గుహలోపల ప్రకాశించుచుండునట్టి ఆత్మసన్నిధానమును ఆశ్రయించి బుద్ధీంద్రియాదులు చలించుచు, అవి యవి దాని దాని కార్యములను జేయుచున్నను, ఆత్మమాత్రము కూటమునందలి దీపమువలె ఏ వికారమున్ను లేక ఏ కార్యమున్ను చేయక చలింపక అధిష్ఠానముగా నుండును గాన, అట్టి ఆత్మయే కూటస్థుఁ డనఁబడును.

## అంతర్యామిలక్షణము.

శ్రుతి॥ కూటస్థాద్యుపహిత భేదానాం స్వరూపలాభే హేతుర్భూత్వా । మణిగణే సూత్రమివ సర్వ క్షేత్రేషు యదనుస్యూతం । అంతర్యమయం ప్రకాశతే హ్యాత్మా సోంతర్యామి॥

తా॥ శిష్యా! స్వస్వరూపానుభవము సిద్ధించుటకొఱకు ఆత్మ ఒక్కటియే ఒక్కొక్క కారణమునుబట్టి సాక్షి యనియు చైతన్యమనియు కూటస్థుఁ డనియు చెప్ప

శక్తియే అవిద్యాశక్తిగా నున్నది. ఎట్లనగా, సత్త్వగుణముతోడ కూడి యుండునపుడు మాయాశక్తి యనియు, అదే రజోగుణముతోడ కూడి యుండనపుడు అవిద్యాశక్తి యనియును చెప్పబడును. అట్టి అవిద్య మాయ అనెడి రెండు ఉపాధులందలి ప్రతిబింబములగు జీవేశ్వరులు యిద్దరున్ను మాయాస్వరూపు లగుటవల్లను అసత్యములగుటవల్లను ఒకటి కొకటి విరుద్ధ లక్షణములను కలిగి యుండుటవల్లను ఆ జీవేశ్వరులు రెంటికిన్ని ఐక్యము గలుగజాలదు. కాబట్టి ఆ జీవేశ్వరులు రెంటిని విడిచిపెట్టి ఆ రెంటికిన్ని అధిష్ఠానముగా సాక్షిగానుండు ప్రత్యగాత్మ పరమాత్మలు రెండును నిత్యజ్ఞానానంద లక్షణముకలిగి అభేదముగా నుండుటవల్లను, ఆ ప్రత్యగాత్మ పరమాత్మలు రెండున్ను పరబ్రహ్మ స్వరూపములగుటవల్లను, ఆ రెంటికిన్ని ఐక్యము గలుగుచున్నది గాన, ప్రత్యగాత్మయే పరమాత్మ, పరమాత్మయే ప్రత్యగాత్మ అగుచున్నది. శిష్యా! ఏ ఉపాధులున్ను లేనిదై నిర్విశేష చిన్మాత్రస్వరూపమై సత్తామాత్రమై అద్వితీయమై అఖండానందమై అవిద్య మాయ అనెడి రెండువిధ మాయలు లేనిదై, సర్వ పరిపూర్ణముగా నుండునదే పరబ్రహ్మ మనబడును.

శుద్ధనిర్గుణబ్రహ్మమే ప్రత్యగాత్మ పరమాత్మ లనుట.

శ్రుతి॥ తద్ధి త్వంపదార్థాని ధిక తత్పదార్థ చోపాధిక భేదాస్వి లక్షణ। మభేద మధిష్ఠాన తోపలక్షితం శుద్ధం। పారమార్థికం సత్తామాత్ర మవినాశి॥

తా॥ మాయ అవిద్య యనెడి ఉపాధిద్వయము లేనట్టి నిర్విశేష చిన్మాత్రమగు ఆ శుద్ధనిర్గుణ అఖండపరిపూర్ణ పరబ్రహ్మము మాయావిద్య అనెడి ఉపాధిద్వయసహితములగు ప్రత్యగాత్మ పరమాత్మలకంటెను విలక్షణమై అవినాశమైనది. అది అభేదమై సర్వాధిష్ఠానమై, పరిశుద్ధమై, పారమార్థికమైనది, సత్తామాత్రమైనది. (శ్రుతి॥ నిత్యస్సర్వగతో హ్యాత్మా కూటస్థో దోషవర్జితః। ఏకస్సన్ భిద్యతే భ్రాంత్యా మాయయా న స్వరూపతః॥ తస్మాదద్వైత ఏవాస్తి న ప్రపంచో న సంసృతిః॥ యథా ఘటాకాశో మహాకాశ ఇతీరితః। తథా భ్రాంతైర్ద్విధా ప్రోక్తో హ్యాత్మా జీవేశ్వరాత్మనా॥) అనెడి అన్నపూర్ణోపనిషత్తు వాక్యరీతిగా, శిష్యా! ఒక్క మహాకాశాంశమే గృహోపాధిసహితమై ఆ గృహమునకంటెను విలక్షణముగా నిర్వికారముగా నుండును గృహాకాశమనియును, ఎటులను ఆ మహాకాశాంశమే ఘటోపాధిసహితమై ఆ ఘటమునకంటెను విలక్షణముగా నిర్వికారముగా నుండుచు ఘటాకాశ మనియును, వేఱు వేఱుగా చెప్పబడినను, ఆ ఘటమున్ను గృహమున్ను నశించినంతనే ఘటోపాధి గృహోపాధి రెండున్ను నశించి, ఆ ఘటాకాశ గృహాకాశములు రెండున్ను మహాకాశమునకంటెను వేఱుగానందువలన మహాకాశమే అయినట్లు, ఉపాధిద్వయము లేనట్టి కేవలాత్మయగు పరిపూర్ణపరబ్రహ్మమే, మాయోపాధి సహితమై ఆ మాయకంటెను విలక్షణముగా నిర్వికారముగా నుండుటవలన పరమాత్మ యనియు, మఱియును ఆ ఉపాధిద్వయములేనట్టి ఆ పరబ్రహ్మమే అవిద్యోపాధి సహితమై ఆ యవిద్యకంటెను విలక్షణముగా

నిర్వికారముగా నుండుటవలన ప్రత్యగాత్మ యనియు వేఱువేఱుగా చెప్పబడుచున్నవి. అట్లు వేఱువేఱుగా చెప్పబడుచున్నను, మాయావిద్యలనెడి ఉపాధిద్వయము నశించిన తోడనే, ప్రత్యగాత్మ పరమాత్మలు రెండున్ను కేవలాత్మయగు శుద్ధనిర్గుణ మాయాతీత పరిపూర్ణ పరబ్రహ్మమునకు వేఱుగానందువలన, ఆ రెండున్ను కేవలాత్మయగు ఆ పరిపూర్ణ పరబ్రహ్మమే అగుచున్నది. కాబట్టి శిష్యా! ప్రత్యగాత్మ పరమాత్మలు రెండున్ను కేవలాత్మయగు ఆ శుద్ధనిర్గుణ పరిపూర్ణ పరబ్రహ్మమున కంటెను వేఱుగాదు సుమా, ఉపాధివలన ఒక్క పరబ్రహ్మమే ప్రత్యగాత్మ యనియు పరమాత్మయనియు కేవలాత్మ యనియు వేఱువేఱుగా చెప్పబడుచున్నవి గాని, ఉపాధి విడిచిపెట్టి చూడగా పరమాత్మ ప్రత్యగాత్మ కేవలాత్మ అనెడి భేదములులేక, సర్వము నిర్వికేవ చిన్మాత్రము ఆ శుద్ధనిర్గుణ పరబ్రహ్మమే అగుచున్నది సుమా?

సత్య లక్షణము,

శ్రుతి॥ కిం తత్ సత్య మితి॥ సదితి శ్రౌతప్రతీతి లక్ష్యం సత్యం। అసదిత్య వాచ్యం సత్యం। త్రికాలాబాధ్యం సత్యం। సర్వకల్పనాధిష్ఠానం వా సత్యం॥

తా॥ శిష్య-ప్రశ్న. స్వామీ! సత్య మనగా నేమి? గురు-ఉత్త. శిష్యా! వేదములందు జహదజహల్లక్షణ లక్ష్యముగా ఏది సత్తుగా చెప్పబడుచున్నదో ఆ సత్తే సత్యము, అదేపరబ్రహ్మము. అసత్తు అని చెప్పబడనిదే సత్యము, అదే పరబ్రహ్మము కాలత్రయమునందును వ్యాపించియుండునదే సత్యము, అదే పరబ్రహ్మము. ఏది సదా నాశరహితము గానున్నదని చెప్పబడుచున్నదో అదే సత్యము, అదే పరబ్రహ్మము. ఏది తనకు రెండవపదార్థము లేక ఏకముగా నున్నదో అదే సత్యము, అదే పరబ్రహ్మము. సజాతీయ విజాతీయ స్వగతభేదములేనిదే సత్యము. అదే పరబ్రహ్మము. రజ్జుసర్పము, శుక్తిరజతము, గగనారవిందము, వంధ్యాపుత్రుడు, స్థాణుపురుషుడు, మృగతృష్ణ, సముద్రతరంగంబులకీరిగా అధ్యారోపితంబులగుచు మిథ్యాభూతంబులగు జీవేశ్వర జగత్తులనెడి సర్వకల్పనలకు అధిష్ఠానముగా నుండునదే సత్యము, అదే పరబ్రహ్మము,

అవినాశ లక్షణము.

శ్రుతి॥ అవినాశకమితి॥ దేశ కాల వస్తు నిమిత్తాదిషు వినశ్యత్సు యన్న వినశ్యతీతి॥

తా॥ శిష్య-ప్రశ్న. స్వామీ! అవినాశకమనగా ఏమి? గురు-ఉత్త. శిష్యా! దేశములచేతను కాలములచేతను వస్తువులచేతను పరిచ్ఛేదింపబడక, ఆ దేశకాలవస్తువులకు కారణములగు అవ్యక్తమహదాది జగత్తువరకు గల సకలతత్త్వములున్ను నశించిపోగా, ఏది శేషించి నాశములేక వెలుగుచుండునో అదే అవినాశక మనబడును, అదే బ్రహ్మము.

జ్ఞాన లక్షణము,

శ్రుతి॥ కింజ్ఞానమితి స్వప్రకాశకం జ్ఞానం। సర్వప్రకాశకం జ్ఞానం। నిరావరణ చిన్మాత్రం జ్ఞానం। అనాద్యనంతం నిరంతర మనువృత్తి వృత్తి సాక్షిచైతన్యమేవ జ్ఞానమ్॥

తా॥ శిష్య-ప్రశ్న. స్వామీ! జ్ఞాన మనగా నేమి? గురు-ఉత్త. శిష్యా! సాధనాంతరములేక అనగా మఱియొకవస్తువు సహాయము లేక తనకుతానే స్వయం ప్రకాశముగా తోచుచుండునట్టి వస్తువే జ్ఞానమనబడును. సూర్యచంద్రాగ్ని నక్షత్రాది స్వతేజోవంతము అగు వస్తువులను ప్రకాశింపజేయునదే జ్ఞానమనబడును. మాయ అవిద్య అనెడి ఆవరణద్వయములేనిదే జ్ఞానమనబడును. ఆదిమధ్యాంతములులేని వస్తువే జ్ఞానమనబడును. సదా సంకల్పశూన్యమైనదే జ్ఞానమనబడును. సంకల్పవికల్పములే స్వరూపముగానుండు అంతఃకరణమునకు సాక్షిగా నుండు నిర్వికార చైతన్యమే జ్ఞానమనబడును. ఆ జ్ఞానస్వరూప మగు వస్తువే ఆత్మ, లేక బ్రహ్మ మనబడును.

## అనంతలక్షణము.

శ్రుతిః కి మనన్తమితి। ఉత్పత్తి వినాశరహిత మనంతం। షడ్భావ వికారరహిత మనంతం। సర్వోపాధి వినిర్ముక్త మనంతం। మృద్వికారేషు మృదివ స్వర్ణవికారేషు స్వర్ణమివ తంతువికారేషు తంతురివ। అవ్యక్తాది సృష్టి ప్రపంచేషు వ్యాప్య పూర్ణ మవినాశి చైతన్య మనంతమ్॥

తా॥ శిష్య-ప్రశ్న. స్వామీ! అనంత మనగా నేమి? గురు-ఉత్త. శిష్యా! ఉత్పత్తివినాశములు లేనివస్తువే అనంతము. షడ్భావవికారములు లేనిదే అనంతము. ఎట్టి విధమైన శరీరోపాధియు లేనిదే అనంతము. మట్టియే కుండలు చట్లు మూకుడు బిళ్ళ మొదలగు నానావిధవస్తువులుగా నానావిధరూపములు గలిగి నానావిధ నామములతో వ్యవహరింపబడుచున్నను, ఆ వస్తువులయొక్క నిజరూపము మట్టిరూపమేగాన అవి మట్టికంటెను వేఱుగాక మట్టియే అయినట్లున్ను, బంగారు నానా విధరూపములతో నానావిధభూషణములుగా తోచుచున్నను, ఆభూషణములు బంగారుకంటెను వేఱు గాక బంగారమే అయినట్లున్ను, నూలే నానావిధవస్త్రములుగా నానావిధరూపములతో తోచుచున్నను, ఆ వస్త్రములు నూలుకంటెను వేఱుగాక నూలే అయినట్లున్ను, ఏవస్తువు అవ్యక్తతత్త్వము మొదలుకొని ఈ ప్రపంచమువఱకుగల సర్వవస్తువులున్ను తనకంటెను వేఱుగాక, సర్వము తానై నానావిధరూపములతోడ తోచుచు, సర్వత్ర వ్యాపించి పరిపూర్ణమై నాశము లేకున్నదో, ఆ చైతన్యమే అనంత మనబడును ఆ చైతన్యమే ఆత్మ, లేక బ్రహ్మ మనబడును.

## ఆనందలక్షణము.

శ్రుతిః కి మానంద మితి। అంభసా మర్ణవ ఇవ సుఖచేతనానా మధిష్ఠాన నిత్య శుద్ధాఖండాద్వైత చిదానందైకరస మానందమ్॥

తా॥ శిష్య-ప్రశ్న. స్వామీ! ఆనంద మనగా నెట్టిది. గురు-ఉత్త. శిష్యా! సముద్రమునందుండి తోచిన తరంగంబులకున్ను నదులకున్ను ఆసముద్రమే అధిష్ఠాన మగా నుండునట్లు, (సుఖస్వరూపు లగు) అనగా ఆనంద[illegible]సహితు లగు సకల

జీవులున్ను పరబ్రహ్మమునందుండి కలుగుటవలన ఆ సకలజీవులకున్ను పరబ్రహ్మమే అధిష్ఠానముగా నున్నది. అట్లు సుఖస్వరూపు అగు సకలజీవులకున్ను అధిష్ఠానమై నిత్యమై శుద్ధమై అఖండమై అద్వైతమై జ్ఞానానందరసము గల స్వరూపముగా నుండు బ్రహ్మమే ఆనంద మనబడును.

## పదార్థ త్రయ లక్షణము.

శ్రుతి॥ అథ కతి పదార్థా ఇతి। సదసన్మిథ్యా చేతి త్రయః। స దేవ తత్ర బ్రహ్మ అసత్తుచ్ఛం! జగత్కల్పితం బ్రహ్మణ్యసత్యం మిథ్యా॥

తా॥ శిష్య-ప్రశ్న. స్వామీ! ఎన్ని పదార్థములున్నవి? గురు-ఉత్త. శిష్యా! సత్తు, అసత్తు, మిథ్య అని మూడుపదార్థములు గలవు. సత్తు బ్రహ్మ మనబడును. అట్టి సద్రూప మగు పరబ్రహ్మమునందు మాయచే కల్పింపబడిన జగత్తు తుచ్ఛపదార్థమగుట వలన అట్టి జగత్తు అసత్తు అనబడును. సద్రూప మగు పరబ్రహ్మమునందు రజ్జుసర్పము రీతిగా తోచిన అసత్యమగు మాయయే మిథ్య అనబడును.

## అత్మ లక్షణము.

శ్రుతి॥ బ్రహ్మైవాత్మా జ్ఞేయః। బ్రహ్మజ్ఞానం సమూలానాత్మ నివర్తకం। సద్బ్రహ్మణి విలీయతే॥

తా॥ శిష్యా! (శ్రుతి అయమాత్మా బ్రహ్మ॥) అనెడి బృహదారణ్యకోపనిషత్తు రీతిగా, అట్టి సద్రూపమగు పరబ్రహ్మమే ఆత్మ యనబడుచున్నది ఎట్లనగా, (అతతి తత్తద్వస్తురూపేణ వ్యాప్నోతీతి ఆత్మా। అత సాతత్య గమనే ఇతి ధాతుః॥) అనునట్లు ఏది సకలవస్తులందు వ్యాపించి తనకు రెండవదిలేక సర్వము తానైయున్నదో, అదే ఆత్మ యనబడును. మఱియు (బృహిర్ బ్రహ్మ వృద్ధౌ బృహతేర్ధాతోః అర్థానుగమాత్। దేశతః కాలతః వస్తుతః అపరిచ్ఛిన్నం యద్వస్తు తత్ బ్రహ్మేతి భాష్యం) అనునట్లు ఒకదేశమునందున్నది ఒకదేశమునందు లేదనియును, ఒకవస్తువునందున్నది ఒక వస్తువునందు లేదనియును, ఒక కాలమునందున్నది ఒక కాలమునందు లేదనియును చెప్పబడక, ఏది సర్వదేశ సర్వకాల సర్వవస్తువులందున్ను పరిపూర్ణముగా వ్యాపించి, తనకు రెండవదిలేక సర్వము తానై యున్నదో, అదే బ్రహ్మమనబడును. శిష్యా! బ్రహ్మము, ఆత్మ అను శబ్దంబులు మాత్రము భేదములుగా నున్నవి గాని, ఈ రెండుశబ్దంబుల అర్థములు ఒక వస్తువునే తెలియజేయుచున్నది గాన బ్రహ్మమే ఆత్మ యనబడును. అట్టి పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కటియే మాయావిద్యోపాధులవలన పరమాత్మ యనియు ప్రత్యగాత్మయనియు రెండువిధములుగా చెప్పబడుచున్నది గాని, ఉపాధిని విడిచి చూచినయెడల పరమాత్మ ప్రత్యగాత్మ యనెడి భేదము లేక, సర్వము ఏకాత్మస్వరూపముగానే యున్నది. కాబట్టి ఆత్మయే పరబ్రహ్మమనబడును. పరబ్రహ్మమే ఆత్మ యనబడును సుమీ! అట్టి పరబ్రహ్మమగు ఆత్మకంటెను ఇతరములైన వస్తువులు అన్నియు

అనాత్మ యనియు చెప్పబడును, అట్టి అనాత్మ యగు వస్తువులన్నియు పరబ్రహ్మమను ఆత్మయందు ఉత్పత్తి యగుచు, మరల ఆత్మయందే లయించుచుండును గాన, పరబ్రహ్మమగు ఆత్మ నాశము లేని దనియును, సత్యమైన దనియును, అనాత్మ వస్తువులు అసత్యమై నశించు నట్టివనియును చెప్పబడును.

## అనాత్మలక్షణము.

శ్రుతి: అనాత్మాతు సంఘాతో వియదాది ప్రపంచః । అనాత్మ మూలం మాయా॥

తా॥ శిష్యా! (శ్లో॥ దేహేంద్రియ ప్రాణ మనోహ మాదయః సర్వే వికారాః విషయా స్సుఖాదయః । వ్యోమాది భూతా న్యఖిలంచ విశ్వ మవ్యక్త పర్యంత మిదం హ్యనాత్మా) అనునట్లుగా దేహము, దశేంద్రియంబులు, పంచప్రాణములు, అంతఃకరణ ప్రతిబింబమగు చిదాభాసజీవుడు, మనోబుద్ధి చిత్తాహంకారములు, శబ్దాదివిషయంబులు, స్రక్చందనవనితాదులు, ఆకాశాది పంచభూతములు, పంచభూతమయం బగు ప్రపంచము, ఇవియన్నియు అనాత్మ యనబడును. శ్లో॥ మాయా మాయాకార్యం సర్వం మహదాది దేహపర్యంతమ్ । అసదిద మనాత్మకం త్వం విద్ధి మరుమరీచికా కల్పమ్॥) అనునట్లు, శిష్యా! అనాత్మ యగు మహత్తత్త్వము మొదలు దేహము వఱకు గల సకల తత్త్వములున్ను, అనగా దేహేంద్రియాది జగత్తు సర్వమున్ను మాయవలన కలిగినవి గాన, వీటికి మాయయే మూలకారణముగా నున్నది. మాయయు ఆ మాయవలన కలిగిన దేహేంద్రియాది ప్రపంచము సర్వమున్ను నిర్జలభూమియందలి యెండమావులతో సమానము లైనవి అగుచున్నవి.

## మాయాలక్షణము.

శ్రుతి: నభ ఆకాశే మేఘాదిరివ దృశ్యతే । మాయానామ అనాదిరంతవతీ। ప్రమాణా ప్రమాణ సాధారణా । నసతి నాసతీ। సదస దనిర్వాచ్యా ద్వ్యధిష్ఠాన ఏకావిద్య మానాంతర్వాణి వికల్ప నిరూప్య మానో న్యేవవ వ్యవహార భేదవతీ । సా నవిద్యతే వస్తుత స్సామాయా । తత్స్వరూప మజ్ఞానం తదేవ మూలప్రకృతి ర్గుణసామ్యా । అవిద్యే త్యజ్య నేకాకారా । జగదాకారేణ పరిణతా । తదేవం । బ్రహ్మవిజ్ఞానాత్మను భవతి చ॥

తా॥ శిష్యా! రూపము లేనట్టి ఆకాశమునందు తోచిన మేఘముల రీతిగా శుద్ధనిర్గుణ నిరాకార పరబ్రహ్మమునందు మాయ తనకుతానే తోచెను. ఆమాయ ప్రమాణా ప్రమాణములకు సాధారణ మైనది, అది అనాదియైనది, నశించిపోవునది, సత్తుగాదు, అసత్తుగాదు, సదసద్రూపమైనది. (అనిర్వాచ్యమైనది) అనగా ఇట్టిదట్టి దని దానిలక్షణమును తెలిసిచెప్పుటకు హరిహరాదులకైనను సాధ్యము గాదు. శుద్ధనిర్గుణ పరబ్రహ్మమునందు తోచిన ఆ మాయ ఆ పరబ్రహ్మమును ఆవరించుకొని, నానా నామరూపములు కలిగినట్టి జీవేశ్వరాది భేదములుగా వ్యవహారమునందు తోపింప

జేయుచున్నది, యథార్థముగా విచారించి చూడగా (యా-మా-సా-మాయా) అనునట్లు కాలత్రయమునందును ఏది లేకపోవునో అదే మాయ అనబడును. ఏది వస్తువుగాక రజ్జుసర్పము గంధర్వనగరము గగనారవిందము వంధ్యాపుత్రుడు స్థాణుపురుషుడు శుక్తికారజతము ఎండమావులవలె కల్పితంబుగా భ్రాంతిరూపంబుగా మిథ్యగా అవస్తువుగా నున్నదో అదే మాయ యనబడును; ఆమాయ అజ్ఞానమే స్వరూపముగాగలది. ఆ మాయయే మూలప్రకృతిఅని చెప్పబడుచున్నది. అదే సత్త్వరజస్తమోగుణములు గలది యగుచు మాయ, అవిద్య, ఆవరణములనెడి మూడురూపములుగా నున్నది. సత్త్వగుణ ప్రధానమగునప్పుడు మాయాశక్తి యనియు, రజోగుణప్రధానమగునపుడు అవిద్యాశక్తి యనియు, తమోగుణ ప్రధానమగునపుడు ఆవరణ విక్షేప శక్తులనియు చెప్పబడుచున్నది. ఆ మాయయే ఎలుకమలుపులుగా నున్నది. పాలు ఒక్కటే పరిణమించి నానావిధ రూపనామములతో పెరుగు మజ్జిగ వెన్న నేయి మొదలైనవిగా అయినట్లు ఆమాయ ఒక్కటే పరిణమించి నానావిధ రూపనామములతో చరాచరజగత్తు రూపముగా తోచుచున్నది. ఇట్లు మాయయొక్క మిథ్యాలక్షణములున్ను బ్రహ్మముయొక్క సచ్చిదానంద లక్షణములున్ను తెలిసి, దుఃఖస్వరూపమై (మిథ్యాభూతమగు) అనగా అసత్యమయిన మాయను పరిత్యజించి, సచ్చిదానంద లక్షణములు గల బ్రహ్మమే సత్యమనియు, అట్టి బ్రహ్మమే ఆత్మయనియు తెలిసి, సదా ఆత్మానుసంధానము చేయుచుండుటే బ్రహ్మజ్ఞానమనియు, బ్రహ్మనిష్ఠయనియు, చెప్పబడును. అట్లు ఆత్మానుసంధానము చేయువాడే బ్రహ్మజ్ఞాని అనియు, బ్రహ్మవేత్త అనియు చెప్పబడును.

## ఆత్మానుసంధాన శ్లోకములు.

శ్రుతి॥ తత్రైతే శ్లోకాః।

తా॥ శిష్యా! అందుకుగాను చెప్పబడియుండు ప్రమాణ శ్లోకములను చెప్పుచున్నాను. శ్రద్ధగలవాడవై వినుమని గురుడిట్లనియె.

శ్లో॥ నైవం భవామ్యహం దేహో నేంద్రియాణి దశైకతు।
న బుద్ధిర్మనశ్చైవ నాహంకార స్తథైవచ।
అప్రాణో హ్యమనశ్శుభ్రో బుద్ధ్యాదీనాంహి సర్వదా।
సాక్ష్యహం సర్వదా నిత్యశ్చిన్మాత్రోహం సదాశివః॥ ౧

తా. శరీరము నేనుగాను, జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులు నేనుగాను, మనోబుద్ధి చిత్తాహంకారములు నేనుగాను, ప్రాణాపాన ఉదాన సమాన వ్యానము లనెడి పంచప్రాణవాయువులు నేనుగాను, నేను ప్రాణము లేనివాడను, మనస్సు లేనివాడను, బుద్ధి మొదలగు వానికంటెను విలక్షణమైన పరిశుద్ధుడను, దేహేంద్రియాదులకు సాక్షిగా నున్నాను, సదా జ్ఞానమాత్ర స్వరూపుండను, నిత్యమైన వాడను, నేనే (పరమశివము) అనగా నాశములేని నిత్యమంగళమగు పరబ్రహ్మము.

శ్లో॥ నాహం కర్తా నైవ భోక్తా ప్రకృతేః సాక్షిరూపకః మత్సాన్నిధ్యాత్ప్రవర్తంతే దేహాద్యా అజడా ఇవ । స్థాణుర్నిత్యః సదానందః శుద్ధో జ్ఞానమయోఽమలః । ఆత్మాహం సర్వభూతానాం విభుః సాక్షీ నసంశయః॥

తా. నేను (కర్తగాను) అనగా ఏ కార్యమును చేయువాడను గాను, నేను (భోక్తగాను) అనగా దేనిని అనుభవించువాడను గాను, దేహేంద్రియంబులు అనెడి ప్రకృతికంటెను వేఱైనవాడను, స్కాంతశిలను సమీపించిన యెడల చలనము లేనట్టి సూది ఎట్లు చలించునో, అట్లు దేహేంద్రియంబులు జడపదార్థములుగా నుండినను, కేవల జ్ఞానస్వరూపుడనగు నా సత్తామాత్రముచేత నా సన్నిధానము నాశ్రయించి జ్ఞానవంతములుగా దోచుచు, ఆ యా యింద్రియంబులు దాని దాని కార్యమును చేయుచున్నది. నేను (స్థాణువు) అనగా చలనము లేనివాడను, అచల స్వరూపుడను, నిత్యుడను, సదానందుండను, కేవల జ్ఞానమాత్ర స్వరూపుండను, స్థూలదేహ సంబంధమగు దశవిధమలములు లేనివాడను, సూక్ష్మదేహ సంబంధమగు రాగద్వేషాది మలములు లేనివాడను, జీవసంబధమగు అహంభావాది పంచమలములు లేనివాడను, నేను ఆత్మస్వరూపుండను! నేను సర్వ భూతములకు విభుండను, సాక్షిమాత్రుండను, ఇందుకు సందేహమే లేదు.

శ్లో॥ బ్రహ్మైవాహం సర్వవేదాంత వేద్యం । నాహం వేద్యం వ్యోమ వాతాది రూపం । రూపం నాహం నామ నాహం నకర్మ । బ్రహ్మైవాహం సచ్చిదానంద రూపమ్॥ 3

తా॥ వేదాంతంబులు అగు సకల ఉపనిషత్తులచే తెలియదగిన పరబ్రహ్మము నేనే. ఆకాశము వాయువు మొదలగు పంచభూతముల రీతిగాను, పంచభూతమయం బగు ప్రపంచంబురీతిగాను దృశ్యవస్తువును నేను గాను, రూపము నేను గాను, నామము నేను గాను, కర్మ నేనుగాను, నేను రూపనామక్రియలు లేనివాడను, నేను సచ్చిదానంద పరబ్రహ్మము.

శ్లో॥ నాహం దేహో జన్మమృత్యూ కుతో మే । నాహంకారః క్షుత్పిపాసా కుతో మే । నాహం చేతః శోకమోహౌ కుతో మే । నాహం కర్తా బంధమోక్షౌ కుతో మే॥ ౪

తా॥ నేను దేహముగాను కాబట్టి దేహసంబంధము అగు జననమరణంబులు నాకు లేవు. అహంకారము నేను గాను గనుక అహంకార సంబంధము అగు ఆకలి దప్పులు నాకు యెక్కడిది. మనస్సు నేనుగాను గనుక మనోవికారము అగు దుఃఖము మోహము నాకు లేవు. నేను కర్తృత్వశూన్యుడను గాన బంధమోక్షములు నాకు లేవు నేనే నిత్యముక్త పరబ్రహ్మము.

శ్రుతి॥ ఇతి మునీ నద్పశ్య వాణ్యువాచ సత్య మితి।మునీ నద్పశ్యవా ణ్యువాచ సత్య మిత్యుపనిషత్॥

తా. శిష్యా! ఇట్లు ధ్యానించుచు సదా ఆత్మానుసంధానమును చేయువాడె బ్రహ్మజ్ఞాని యనియు, జీవన్ముక్తు డనియు, అతడే ప్రారబ్ధము నశించినతోడనే దేహ త్రయము నశించి (విదేహముక్తి) అనగా జనన మరణములులేని విదేహ కైవల్యమును పొంది అఖండ పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపుడగుచున్నాడనియు, పూర్వము అద్భుత[illegible] వాణి మహాఋషులతో పలికెను. ఈ ప్రకారము అద్భుతవాణి మహాఋషులతో చెప్పెను, ఇది సత్యము. ఇది సత్యము. ఇది సర్వసారోపనిషత్తు.

ఓం సహనావవతు సహనౌ భునక్తు। సహ వీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు। మావిద్విషావహై। ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

తా. శిష్యా! సత్యజ్ఞానానంద నిత్యనిర్మల సర్వపరిపూర్ణమగు నారాయణ పరబ్రహ్మము గురుశిష్యులగు మమ్ములను కాపాడును గాక. విషయాసక్తిలేక సదా బ్రహ్మవిచారణయందే కాలము గడుపుచుండ గలయునని ఇచ్ఛకలిగిన మనమీద ఆ పరబ్రహ్మము ప్రేమయుంచును గాక. ఆ పరబ్రహ్మముయొక్క కృపాకటాక్షమువలన తత్త్వవిచారమయిన శ్రవణ మనన నిదిధ్యాసనములను చేముపొందుటకు మాకు వీర్యము కలుగుగాక. స్వయంజ్యోతియగు ఆత్మానుభవము మాకు కలుగునుగాక. మాలోపల ఒకరికొకరికి ద్వేషము మొదలగు దుర్గుణములు లేకపోవుగాక. ఓ పరబ్రహ్మమా! నారాయణా! భగవంతుడా! ఓం శాంతము. ఓం శాంతము. ఓం శాంతము. ఇది యజుర్వేదమునందు చెప్పబడిన సర్వసారోపనిషత్తు సంపూర్ణము.

—(౦)—

## శుక్లయజుర్వేదమునందలి

## నిరాలంబోపనిషత్తు - తాత్పర్య సహిత ప్రారంభము.

—(౦)—

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే। పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా వశిష్యతే॥ ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥

తా. శిష్యా! అక్కడ ఇక్కడ ఎక్కడనున్న అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమగు పరిపూర్ణమే. లోకమున సూర్యుడు చంద్రుడు మొదలయినవి ఏది యేది పరిపూర్ణమని చెప్పబడుచున్నదో, దానికన్నిటికిని ఈ అఖండ పరబ్రహ్మమగు పరిపూర్ణమే శ్రేష్ఠమయినది. లోకములో ఏదియేది పరిపూర్ణ వస్తువులో వానియందంతట ఈ సర్వ పరిపూర్ణ బ్రహ్మమే నిండియున్నది, ఓం శాంతము, శాంతము, శాంతము.

శ్రుతి॥ ఏష మజ్ఞాన జంతూనాం సమస్తారిష్ట శాంతయే। యద్యద్బోద్ధవ్య మఖిలం తదాశంక్య బ్రవీమ్యహమ్॥

తా. అజ్ఞానసహితులగు ఈ పామరజనులకు సకలదుఃఖములు నివృత్తి యగుటకు ముఖ్యముగా ఏది యేది చక్కగా తెలియదగినదో వాటి నన్నిటిని ప్రశ్నోత్తర రూపంబులుగా దెలియ జెప్పుచున్నాను.

శ్రుతి॥ కిం-బ్రహ్మ । క-ఈశ్వరః । కో-జీవః । కా-ప్రకృతిః॥ కః-పరమాత్మా । కో-విష్ణు । కో-రుద్రః । క-ఇంద్రః । క-శమనః । క-సూర్యః । క-శ్చంద్రః । కే-అసురాః । కే-పిశాచః । కే-మనుష్యాః । కాః-స్త్రియం । కే-పశ్వాదయః । కిం స్థావరం । కే-బ్రాహ్మణాదయః । కా-జాతిః । కిం-కర్మ । కి-మకర్మ । కిం-జ్ఞానం । కి-మజ్ఞానం । కిం-సుఖం । కిం-దుఃఖం । క-స్స్వర్గః । కో-నరకః । కో-బంధః । కో-మోక్షః । క-ఉపాస్యః । క-శ్శిష్యః । కో-విద్వాన్ । కో-మూఢః । కి-మాసురం । కిం-తపః । కిం-పరమం పదం । కిం-గ్రాహ్యం । కి-మగ్రాహ్యం । క-స్సన్న్యాసీ । త్యాశంక్యాహ॥

తా. బ్రహ్మ మనగా ఏమి, ఈశ్వరుడనగా ఎవడు, జీవుడనగా ఎవడు, ఏది మూలప్రకృతి యనెడి మాయ, ఏది పరమాత్మ, ఎవడు బ్రహ్మ, విష్ణువనగా ఎవడు, రుద్రుడనగా ఎవడు, ఇంద్రుడు ఎవడు, యముడు ఎవడు, సూర్యుడు ఎవడు, చంద్రుడు ఎవడు, దేవతలు ఎవరు, రాక్షసులు ఎవరు, పిశాచములు ఎవరు, ఎవరు మనుష్యులు, ఎవరు స్త్రీలు, పశువులు పక్షులు మొదలయినవి ఏవి, ఏది స్థావరములు. అనగా వృక్షములు కొండలు మొదలయినవి ఏవి. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనగా ఎవరు, జాతి యనగా ఏమి, కర్మ అనగా నేమి, అకర్మమనగా నేమి, జ్ఞానమనగా ఏమి అజ్ఞానమనగా ఏమి, సుఖమనగా ఏమి. దుఃఖమనగా ఏమి, ఏది స్వర్గము, ఏది నరకము, ఏది బంధము, ఏది మోక్షము, ఉపాస్యుడనగా ఎవడు, శిష్యుడనగా ఎవడు, ఎవడు విద్వాంసుడు. ఎవడు మూఢుడు, అసురమనగా ఏమి, తపస్సనగా ఏమి, ఏది పరమపదము, ఏది గ్రాహ్యము, ఏది అగ్రాహ్యము, ఎవడు సన్న్యాసి అను నీ ప్రశ్నలకు ఉత్తరము చెప్పుచున్నాను.

శ్రుతి॥ కిం బ్రహ్మేతి హోవాచ । మహదహంకార పృథివ్యప్తేజో వాయ్వాకాశాత్మకత్వేన । బృహద్రూపే ణాండకోశేన కర్మజ్ఞానార్థరూపతయా భాసమాన మద్వితీయ మఖిలోపాధి వినిర్ముక్తం । తత్సకల శక్త్యుపబృంహిత మనాద్యనంతరం । శుద్ధం శివం శాంతం నిర్గుణ మిత్యాదివాచ్య మనిర్వాచ్యం చైతన్యం బ్రహ్మ॥

## బ్రహ్మలక్షణము.

తా. ప్రశ్న. బ్రహ్మమనగా నేమి? ఉత్త. మూలప్రకృతి యనెడి మహామాయ వలన గలిగిన ఆకాశాది పంచభూతములందు అంతర్యామిగాను, అట్టి పంచభూతములను అతిక్రమించినదిగాను, సకలమైన ప్రపంచమునకు ఆధారభూతమైనదిగాను, నిష్కామకర్మముచేతను జ్ఞానముచేతను పొందదగినదిగాను, తనకు రెండవది లేక సర్వము తానయినదిగాను, సకల ప్రపంచోపాధులు వాటి శక్తులతో గూడా తనయందు అయింపఁ దగి

వదిగాను, అద్యంతములు లేనిదిగాను, పరిశుద్ధమైనదిగాను, సదా మంగళకరమైన గాను, శాంతమైనదిగాను, శుద్ధనిర్గుణమైనదిగాను, నిరాకారమైనదిగాను, అవాఙ్మనస గోచరమైనదిగాను, శుద్ధచైతన్యమాత్ర స్వరూపమైనదిగాను వుండునట్టి వస్తువే బ్రహ్మ మనబడును.

## ఈశ్వర లక్షణము.

శ్రుతి॥ ఈశ్వర ఇతిచ॥ కిం తల్లక్షణం॥ బ్రహ్మైవ స్వశక్తిం ప్రకృత్యభిధేయ మాశ్రిత్య । లోకాన్ సృష్ట్వా ప్రవిశ్యాంతర్యామి త్వేన । బ్రహ్మాదీనాం బుద్ధీంద్రియ నియంతృ త్వా దీశ్వరః॥

శి. ప్రశ్న. ఈశ్వరుఁడనగా నెవరు. ఉత్త. అట్టి శుద్ధచైతన్యమగు పరబ్రహ్మమే తనయందుఁ గలిగిన యా ప్రకృతి యనెడి మహామాయాశక్తితోడ కూడుకొని సకల లోకములను బ్రహ్మాదులను సృష్టించి, ఆ బ్రహ్మము తాను సర్వపరిపూర్ణమగు వస్తువగుట వలన ఆ బ్రహ్మాదులయందు అంతర్యామిగా ప్రవేశించి బుద్ధీంద్రియాదులను (నియమించుటవలన) అనగా ఆయా యింద్రియములను దాని దాని కార్యములను చేయునట్లుగా ప్రేరేపించుటవలన ఆ పరబ్రహ్మమే ఈశ్వరుఁడనఁబడుచున్నాడు.

## జీవ లక్షణము.

శ్రుతి॥ జీవ ఇతిచ॥ ఈశ్వర ఏవ బ్రహ్మ విష్ణ్వింద్రాదీనాం । నామరూప ద్వారా స్థూలోహ మిత్యధ్యాసవశాత్ జీవః । సోయ మేకోపి దేహారంభక భేదవశా ద్బహుజీవః॥

శి॥ సర్వాంతర్యామియై పరబ్రహ్మమైన ఆ ఈశ్వరుఁడే బ్రహ్మ విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు మొదలగు నామరూపములతోడ నుండుచు, తన స్వస్వరూపమును మఱచినవానివలె భ్రాంతినొంది స్థూలదేహమే తానని భావించు అధ్యాసము వలన, తానే జీవుడనఁ బడుచున్నాడు. ఇట్లు ఒక్కొక్క స్థూలదేహమును తానని భావించుచు, నేనొకఁడను నేనొకఁడను అని అనుకొనుటవలన అనేక జీవులుగా తోచెను. అదెట్లనగా, (శ్రుతి॥ తద్ బ్రహ్మ తాపత్రయాతీతం । షట్కోశ వినిర్ముక్తం। షడూర్మి వర్జితం । పంచకోశాతీతం । షడ్భావ వికారశూన్యం । ఏవ మాది సర్వ విలక్షణం భవతి। తాపత్రయంతు ఆధ్యాత్మికాధి భౌతికాధి దైవికం । కర్తృ కర్మ కార్య జ్ఞాతృజ్ఞాన జ్ఞేయ భోక్తృ భోగ భోగ్యమితి త్రివిధం । త్వఙ్మాంస శోణితాస్థి స్నాయుమజ్జా షట్కోశాః॥ కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్య మితి అరిషడ్వర్గః। అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ యానందమయా ఇతి పంచకోశాః॥ ప్రియాత్వ జనన వర్ధన పరిణామ క్షయ నాశాః షడ్భావాః । అశనాయా పిపాసా శోక మోహ జరా మరణా నీతి షడూర్మయః । కులగోత్ర జాతి వర్ణాశ్రమ రూపాణి షడ్భ్రమాః । ఏతద్యోగేన పరమపురుషో జీవో భవతి।) అనెడి ముద్గలోపనిషత్తు వాక్యరీతిగా, శుద్ధచైతన్య

స్వరూపమగు ఆ నిర్గుణపరబ్రహ్మము తాపత్రయములు లేనిది, షట్కోశములు లేనిది, షడూర్ములు లేనిది, పంచకోశములు కానిది, షడ్భావవికారములు లేనిది, సకల తత్త్వములకును విలక్షణమైనది, కేవలం జ్ఞానమాత్ర స్వరూపమైనది. ఆధ్యాత్మిక అధిభౌతిక అధిదైవికములు మూడున్ను, తాపత్రయ మనబడును కర్తృకర్మక్రియలు మూడున్ను జ్ఞాతృజ్ఞాన జ్ఞేయములు మూడున్ను భోక్తృ భోగ భోగ్యములు మూడున్ను త్రిపుటి యనఁబడును. తోలు మాంసము రక్తము యెముకలు నరములు మజ్జ ఈ యారున్న షట్కోశము అనబడును. కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యములు ఆరున్ను అరిషడ్వర్గము అనఁబడును. అన్నమయ ప్రాణమయ మనోమయ జ్ఞానమయ ఆనందమయ కోశములు అయిదున్ను పంచకోశము లనఁబడును. తల్లి గర్భంబున శిశురూపంబుగా తోచుట, తల్లి గర్భంబునందుండి భూమిమీద పుట్టుట, పెరుగుట, ముసలి తనమును పొందుట, నానాటికి చిక్కిపోవుట, రూపమే లేక బొత్తిగా నశించిపోవుట అను నీ యారున్న షడ్భావవికారము అనఁబడును. ఆకలి, దాహము, శోకము, మోహము, ముసలితనము, మరణము ఈ యారున్న షడూర్ము లనబడును. కులము, గోత్రము, జాతి, వర్ణము, ఆశ్రమము, రూపము, ఈ యారున్న షడ్భ్రమలు అనబడును. ఇవి మొదలయిన వానితోడ నామరూపక్రియలు లేని పరబ్రహ్మమగు ఆత్మ సంబంధించుటవలన, తాను జీవస్వరూపుడయ్యెను. (శ్రుతి॥ స్థూలసూక్ష్మాది దేహానామాత్మన్యారోప ఏవచ॥) అనునట్లుగా స్థూలసూక్ష్మ కారణ దేహములయొక్క ఆరోపమువలన పరబ్రహ్మమగు ఆత్మకు జీవరూపము కలిగెను ఎట్లనగా, ఒక టెంకాయ చెట్టు వ్యష్టి యనఁబడును. అనేక టెంకాయ చెట్ల సమూహము సమష్టి యనఁబడును. అట్లు ఒక దేహము వ్యష్టియనియు, అనేక దేహముల సమూహము సమష్టియనియు చెప్పబడును.

## జీ వ త్ర య ల క్ష ణ ము.

వ్యష్టి దేహత్రయ ఆరోపమువలన ఆత్మకు జీవత్వము కలిగెను. ఎట్లనగా, (శ్రుతి॥ ఈశాజ్ఞయా విరాజో వ్యష్టిదేహం ప్రవిశ్య। బుద్ధి మధిష్ఠాయ విశ్వత్వ మగమత్॥ విజ్ఞానాత్మా చిదాభాసో విశ్వో వ్యావహారికో జాగ్రత్స్థూల దేహాభిమానీ। కర్మభూ రితిచ విశ్వస్య నామభవతి ) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, పరబ్రహ్మమగు ఆత్మ, వ్యష్టియగు ఒక స్థూలదేహమును నేనని అభిమానించుటవలన తానే విశ్వుఁడనెడి జీవస్వరూపి యగుచున్నాడు. విశ్వుఁడే వ్యావహారికుడనియు చిదాభాసుఁడనియు చెప్పఁబడుచున్నాడు. వ్యష్టి స్థూలదేహాభిమానియగు ఆత్మ, స్థూలదేహము నేనని అభిమానించి అంతఃకరణ వృత్తితోఁ గూడుకొని అహం మమ మనుచు, జాగ్రదావస్థయందు దారా పుత్ర గృహ క్షేత్ర ధనధాన్యాది సకల పదార్థములను నాది నాది అని అభిమానించుటవలన ఆ ఆత్మయే విశ్వుఁడని చెప్పఁబడుచున్నాడు. మఱియు అట్లు విశ్వుఁడని చెప్పఁబడినట్టి ఆత్మయే స్థూలశరీరముద్వారా సకల కార్యముల చేయుచున్నాడు గాన అతనే

వ్యావ

వ్యావహారికుఁడని చెప్పఁబడుచున్నాడు. మఱియు నట్లు విశ్వుఁ డనబడినట్టి ఆ యాత్మ యే అంతఃకరణమునందు ప్రతిబింబించుటవలన చిదాభాస జీవుఁ డనఁబడుచున్నాడు. మఱియు (శ్రుతి॥ ఈశాజ్ఞయా మాయాత్మా వ్యష్టి సూక్ష్మశరీరం ప్రవిశ్య। మన అధిష్ఠాయ తైజసత్వ మగమత్॥ తైజసః ప్రాతిభాసిక స్వప్నకలిత ఇతి। తైజసస్య నామ భవతి॥) అనెడి పైంగలోపనిషత్తు రీతిగా, పరబ్రహ్మమగు ఆత్మయే వ్యష్టియగు ఒక సూక్ష్మశరీరమును నేనని అభిమానించుటవలన తైజసుఁడను జీవస్వరూపి యగుచున్నాడు. ఆ తైజసుఁడే ప్రాతిభాసికుఁ డనియు స్వప్నకలితుఁ డనియు చెప్పఁబడుచున్నాడు. వ్యష్టి సూక్ష్మశరీరాభిమానియగు ఆత్మ, స్వప్నావస్థయందు తేజోరూపంబగు మనస్సుతోఁ గూడుకొన్న వాఁడగుటవలన తైజసుఁడని చెప్పఁబడుచున్నాడు. స్వప్నావస్థయందు తైజసుఁడు బ్రాహ్మణ చండాలాది నానావిధ రూపములుగా తనకుఁ దానే తోఁచుచున్నాడు గాన, ఆ తైజసుఁడే ప్రాతిభాసికుఁ డనఁబడుచున్నాడు. మఱియు ఆ తైజస్వరూపమును జెందిన ఆత్మయే అజ్ఞానకార్యమగు నిద్రాశక్తితోఁ గూడియుండుటవలన స్వప్నకలితుఁ డనఁబడుచున్నాడు. మఱియు (శ్రుతి॥ ఈశాజ్ఞయా మాయోపాధి రవ్యక్త సమన్వితో। వ్యష్టి కారణశరీరం ప్రవిశ్య। ప్రాజ్ఞత్వ మగమత్। ప్రాజ్ఞః అవిచ్ఛిన్న పారమార్థిక సుషుప్త్యభిమానీతి ప్రాజ్ఞస్య నామభవతి॥ అనెడి పైంగలోపనిషత్తు రీతిగా పరబ్రహ్మమగు ఆత్మయే వ్యష్టియగు ఒక కారణశరీరమును నేనని అభిమానించుటవలన ప్రాజ్ఞుఁడనెడి జీవస్వరూపి యగుచున్నాడు. ఆ ప్రాజ్ఞుఁడే అవచ్ఛిన్నుఁ డనియు పారమార్థికుఁడనియు చెప్పఁబడుచున్నాడు. వ్యష్టి కారణశరీరాభిమాని యగు ఆత్మ, అజ్ఞానాంధకారమగు నిద్రావస్థయందు దేహేంద్రియాంతఃకరణాదులు ఏదియు తోఁపకున్నను, తాను మాత్రము అచ్చట జ్ఞానప్రకాశుఁడై తోఁచుచున్నాడు గాన ప్రాజ్ఞుఁడని చెప్పఁబడుచున్నాడు. (1) అట్టి ప్రాజ్ఞస్వరూపియగు ఆత్మయే అవస్థాత్రయమునందున్న అనుస్యూతుఁడై యుండుటవలనఁ బారమార్థికుఁ డనబడుచున్నాడు. (2) దేహేంద్రియాంతఃకరణాదులు ఒక అవస్థలో తోఁచుచు, మఱియొక అవస్థలో తోఁచక పోవను, అట్లు గాక ప్రాజ్ఞస్వరూపియగు ఆత్మ అవస్థాత్రయము నందున్న నాశము లేక తోఁచుచుండుటవలన, ఆ ప్రాజ్ఞస్వరూపియగు ఆత్మయే అవిచ్ఛిన్ను డనబడుచున్నాడు. శిష్యా! ఇక మీఁద సమష్టి శరీరాభిమానమువలన పరబ్రహ్మమగు ఆత్మకు గలిగిన ఈశ్వర

## సమష్టి శరీరత్రయ స్వరూపియగు ఈశ్వరలక్షణము.

స్వరూపములను చెప్పెదను వినుమని యిట్లనిరి. శిష్యా! పరబ్రహ్మమగు ఆత్మ సమష్టియగు అనేక స్థూలదేహములను నేనని అభిమానించుటవలన విరాట్స్వరూపి యనఁబడును. ఆ విరాట్టే వైశ్వానరుండనియును వైరాజుఁడనియును చెప్పబడును. ఎట్లనఁగా (1) పరబ్రహ్మమగు ఆత్మసమష్టియగు అనేక స్థూలదేహములను నేనని యభిమానించి జాగ్రదావస్థను పొంది దేవమానవ పశుపక్ష్యాది నానావిధ శరీ

ములతో నానావిధ రూపములుగా ప్రకాశించుచున్నాడు గాన విరాట్టని చెప్పబడును. (2) అట్టి విరాట్టుస్వరూపియగు ఆత్మయే సకల నరులయొక్క శరీరములందు వ్యాపించి యుండుటవలన వైశ్వానరుఁ డనఁబడుచున్నాడు. (3) ఆ విరాట్టుస్వరూపియగు ఆత్మ యే నానావిధ రూపనామములు గలవాఁడుగా ప్రకాశించుచున్నాడు గాన వైరాజుఁ డనబడుచున్నాడు. శిష్యా! మఱియు పరబ్రహ్మమగు ఆత్మ సమష్టియగు అనేక సూక్ష్మ శరీరములను జేనని యభిమానించుట వలన హిరణ్యగర్భస్వరూపి యగుచున్నాడు. ఆ హిరణ్యగర్భుఁడే సూత్రాత్మ అనియును, ప్రాణుఁడనియును చెప్పఁబడు చున్నాడు. ఎట్లనగా, (1 పరబ్రహ్మమగు ఆత్మ సమష్టియగు అనేక సూక్ష్మశరీరములను జేనని యభి మానించి స్వప్నావస్థయందు జ్ఞానశక్తితో గూడుకొని యుండుటవలన హిరణ్యగర్భుఁ డనబడుచున్నాడు. (2) ఆ హిరణ్యగర్భ స్వరూపియగు ఆత్మయే ముత్యాలహారము నందు వ్యాపించియుండు సూత్రమువలె ప్రపంచమునందు సర్వత్ర వ్యాపించి యుండుట వలన సూత్రాత్మ యనఁబడును. (3) మఱియు ఆ హిరణ్యగర్భుఁడే క్రియాశక్తితో గూడుకొని యుండుటవలన ప్రాణుఁ డనబడుచున్నాడు. శిష్యా! మఱియు పరబ్రహ్మ మగు ఆత్మసమష్టియగు అనేక కారణ శరీరములను జేనని యభిమానించుటవలన ఈశ్వర స్వరూపి యగుచున్నాడు. ఆ ఈశ్వరుఁడే అంతర్యామి యనియు, అవ్యాకృతుడనియు చెప్పబడుచున్నాడు. ఎట్లనగా, (1) పరబ్రహ్మమగు ఆత్మసమష్టియగు అనేక కారణ శరీరములను జేనని యభిమానించి నిద్రావస్థయందు సకల జీవులయొక్క అంతఃకరణము లను, వాని సంబంధములగు వాసనలను, తనయందు లయింపఁజేసుకొని, మఱల యథా రీతిగా జాగ్రత్స్వప్నములనున్ను ఆ జాగ్రత్స్వప్నములందలి సకల ప్రపంచములనున్ను తనశక్తిచే సృష్టింప జేయుచున్నాడు గాన ఈశ్వరుఁడని చెప్పఁబడు చున్నాఁడు. (2) అట్టి ఈశ్వరరూపియగు ఆత్మయే ఆకాశాది పంచభూతములందున్న సకల జీవుల యొక్క శరీరముల లోపల బుద్ధియందున్ను వ్యాపించి ఆయా తత్త్వమును దాని దాని కార్యమును చేయునట్లుగా సకలమును ప్రేరేపించుచున్నాడు గాన అంతర్యామి యనబడుచున్నాడు. (3) మఱియు నిద్రావస్థయందు ఆ ఈశ్వరరూపియగు ఆత్మయే నామరూప రహితుఁడుగా నున్నాడు గాన అవ్యాకృతుఁ డనబడు చున్నాడు.

ఓంకార రహస్యార్థము.

శిష్యా! ఇక మీద ఓంకార స్వరూప రహస్యార్థంబను విశదముగా నీకుఁ జెప్పు చున్నాను, శ్రద్ధగలవాడవై వినుమని యిట్లనియె. (శ్రుతి॥ ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ।) అనెడి బ్రహ్మవిద్యోపనిషత్తు రీతిగా, ఓంకారమే ఏకాక్షర మనియు, ప్రణవ మనియు, పరబ్రహ్మ మనియు చెప్పబడును. శ్రుతి అకార ఉకారౌ మకార శ్చేతి। త్రయో వర్ణాః త్రయో వేదాః త్రయో లోకా త్రయో గుణాః। త్రయోఽక్షరాణి త్రయ స్స్వరా ఏవప్రణవః ప్రకాశతే అకారో జాగ్రతే నేత్రే వర్తతే సర్వజం తుషు॥ ఉకారః కంఠతస్స్వప్నే। మకారో హృదిసుప్తితః॥ విరాడ్విశ్వ స్థూలశ్చాకారః॥

హిరణ్యగర్భ స్తైజసశ్చాత్మశ్చ ఉకారః। కారణావ్యాకృత ప్రాజ్ఞశ్చ మకారః॥
అకారో రాజసో రక్తో బ్రహ్మా చేతన ఉచ్యతే। ఉకారస్సాత్త్వికః శుక్లో విష్ణు రిత్యభి
ధీయతే।మకార స్తామసః కృష్ణో రుద్రశ్చేతి తథోచ్యతే) అనెడి యోగచూడామణి
ఉపనిషత్తురీతి గాను, మఱియు (శ్రుతి॥ జాగరితే బ్రహ్మా। స్వప్నే విష్ణుః। సుషుప్తౌ
రుద్ర। స్తురీయ మక్షరమ్) అనెడి బ్రహ్మోపనిషత్తురీతి గాను, శిష్యా! అకారము,
ఉకారము, మకారము, అర్ధమాత్ర, ఇవి నాలుగున్ను గూడి ఓంకార ప్రణవ మగు
చున్నది. (1) అకారమునకు అర్థము.—జాగ్రదవస్థ, వ్యష్టిస్థూలశరీరము వ్యష్టిస్థూలశరీ
రాభిమానియగు విశ్వుడు, మఱియు సమష్టిస్థూలశరీరము, సమష్టిస్థూలశరీరాభిమానియగు
విరాట్టు, ఇవియన్నియుంగూడి అకారమనబడును. (2) ఉకారమునకు అర్థము.- స్వప్నా
వస్థ, వ్యష్టిసూక్ష్మ శరీరము, వ్యష్టిసూక్ష్మశరీరాభిమానియగు తైజసుడు, మఱియు, సమష్టి
సూక్ష్మశరీరము, సమష్టిసూక్ష్మ శరీరాభిమాని యగు హిరణ్యగర్భుడు, ఇవి యన్నియుం
గూడిఉకార మనబడును. (3) మకారమునకు అర్థము.-నిద్రావస్థ, వ్యష్టికారణశరీరము,
వ్యష్టికారణశరీరాభిమాని యగు ప్రాజ్ఞుడు, మఱియు సమష్టికారణశరీరము, సమష్టి
కారణశరీరాభిమాని యగు అవ్యాకృతుడు, ఇవి యన్నియుం జేరి మకార మనబడును.
(4) అర్ధమాత్రకు అర్థము.—తుర్యావస్థ, వ్యష్టిదేహత్రయసాక్షిగా నుండు ప్రత్య
గాత్మయున్ను మఱియు సమష్టి దేహత్రయ సాక్షిగానుండు పరమాత్మయు, ఇవియన్నియుం
జేరి అర్ధమాత్ర అనబడును. మఱియు ఓంకారమునందలి అకార, ఉకార, మకార
ములు మూడున్ను ఋగ్యజుస్సామము లనెడి మూడువేదము లనియు స్వర్గమర్త్య
పాతాళము లనెడి మూడు లోకములనియు, మూడుస్వరము అని చెప్పబడును. మఱియు
(1) అకారమును రాజసగుణము, ఎఱుపువర్ణము, బ్రహ్మదేవు డనియు, (2) ఉకారమును
సాత్త్వికగుణము, తెల్లనివర్ణము, విష్ణుదేవు డనియును, మఱియు (3) మకారమును
తామసగుణము, నల్లనివర్ణము, రుద్రు డనియును చెప్పబడును. (శ్రుతి॥ ఓంకార
ప్రభవా వేదా। ఓంకార ప్రభవాః స్వరాః। ఓంకార ప్రభవం సర్వం। త్రైలోక్యం
సచరాచరమ్ ౧) (హ్రస్వోదహతి పాపాని। దీర్ఘం సంపత్ప్రదోఽవ్యయః। అర్ధ
మాత్రా సమాయుక్తః। ప్రణవో మోక్షదాయకః) అనెడి ధ్యానబిందూపనిషత్తు
రీతిగా, శిష్యా! ఈ చరాచరజగత్తు సర్వమున్ను ఓంకార ప్రణవమునందుండి పుట్టెను
గాన, ఈ జగత్తు సర్వమున్ను ఓంకార పరబ్రహ్మస్వరూపముగానే యున్నది సుమా!
అట్టి ఓంకారమును ధ్యానించువారికి దానియందలి హ్రస్వము సకల పాపములను
నాశముజేయును దీర్ఘము సకలైశ్వర్యములను ఇచ్చును. మఱియు ఆ ఓంకార ప్రణవము
నందలి అర్ధమాత్ర జననమరణరహిత నిజమోక్షమును ఇచ్చును. (శ్లో॥ సకృదుచ్చారణ
మాత్రేణ ఊర్ధ్వ మున్నామయతీతి ఓంకారః। ప్రణామయతి ఇత్యేతస్మాత్ ప్రణవః॥)
అనునట్లు, ఏది తన్ను ధ్యానించువారిని పరమాత్మయందు జేర్చుచున్నదో, అదే ఓంకార
ప్రణవ మనబడును కాబట్టి, (శ్రుతి॥ ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య

ముచ్యతే। అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్॥) అనెడి ధ్యానబిందూప
నిషత్తురీతిగా, ఓంకారమే ధనస్సు, జీవుడే బాణము, లక్ష్యమే పరబ్రహ్మమనబడును
గాన, ఒక వేటగాడు ఒకానొక లక్ష్యమును గురిపెట్టిలాచి బాణమును విడిచిన
యెడల, ఆ బాణము గురితప్పక ఆ లక్ష్యమునందే చేరి ఆలక్ష్యములో పొడుచుకొని
అంటుకొని యుండునట్లు, బ్రహ్మజ్ఞానియున్న ఓంకారమనెడి ధనస్సునందు జీవు
డనెడి బాణమును సంధించి పరబ్రహ్మమనెడి లక్ష్యమును గురిపెట్టి ప్రయోగించిన
యెడల ఈ జీవుడనెడి బాణమున్ను ఆలక్ష్యమనెడి పరబ్రహ్మమునుచేరి దానియందు
లయించి తద్రూపమగును సుమా! (శ్రుతి॥ తైలధార మివాచ్ఛిన్నం దీర్ఘ ఘంటా
నినాదవత్। ఉపాస్యం ప్రణవస్యాగ్రం యస్తం వేద స వేదవిత్॥) అనెడి ధ్యాన
బిందూపనిషత్తురీతిగా, శిష్యా! అవిచ్ఛిన్నమైన తైలధారరీతిగాను, ఘంటానాదము
రీతిగాను ఎడతెగక సదా ప్రణవముయొక్క (అగ్రమును) అనగా ప్రణవమునందలి
నాలుగవభాగమగు అర్థమాత్రయే స్వరూపముగా గల (ప్రత్యగాత్మను) పరబ్రహ్మముని
తెలిసి ఎవడు అట్టి ప్రత్యగాత్మస్వరూపమగు పరబ్రహ్మము నేనని సదా ఆత్మాను
సంధానము చేయుచున్నాడో, అతడే నాలుగువేదములను తెలిసిన బ్రాహ్మణు
డనబడును గాని, నూలుపోగుల జంధ్యమును మెడలో ధరించుటవల్లను, అర్థము తెలియక
వేదములను చదువుటవల్లను, వేదవేత్తయగు బ్రాహ్మణుడు గాజాలడు సుమా!

## ప్రకృతి లక్షణము.

శ్రుతి॥ ప్రకృతి రితిచ॥ బ్రహ్మణ స్సకాశా న్నానావిచిత్ర జగన్నిర్మాణ
సామర్థ్యైక బుద్ధిరూప బ్రహ్మశక్తిరేవ ప్రకృతిః॥

తా॥ శిష్యా! (శ్రుతి॥ ఏక మేవా ద్వితీయం బ్రహ్మ। తస్మిన్ మరు శుక్తికా
స్థాణు స్ఫటికాదౌ। జల రౌప్య పురుష రేఖాదివల్లోహిత శుక్ల కృష్ణ గుణమయీ।
గుణసామ్యా నిర్వాచ్యా మూలప్రకృతి రాసీత్॥) అనెడి పైంగలోపనిషత్తురీతిగా,
శుక్తియందు తోచిన రజతమురీతిగాను, ఎండమావులందు తోచిన జలమురీతిగాను,
స్థాణువునందు తోచిన పురుషునిరీతిగాను, స్ఫటికమునందు తోచిన రేఖలరీతిగాను,
అఖండ సచ్చిదానంద పరబ్రహ్మమునందు తనకుతానే తోచినట్టి బుద్ధిరూపమైన మహా
మాయాశక్తియే ప్రకృతి యనబడును. అది అచేతనమైనది. జడపదార్థమైనది. అట్లు
జడపదార్థముగా నుండినను పరబ్రహ్మముయొక్క సన్నిధానమునందుండుటవలన, అపర
బ్రహ్మమురీతిగా జ్ఞానస్వరూపమైనదిగా చేతన పదార్థముగా తోచుచుండును. ఆ
ప్రకృతి నానావిచిత్రములగు రూపనామములుగల ఈ జగత్తును సృష్టించుటయందు
సామర్థ్యము గలిగినది. ఆ ప్రకృతి సత్త్వరజస్తమము లనెడి మూడుగుణములు గలిగినది
ఆ ప్రకృతియే ఈ చరాచరాత్మకమగు మహాజగత్తును సృష్టించెను. (ప్రకర్షేణ క్రియతే

తన్ను జాతిభేదము లేదు. జాతి యనునది లోకవ్యవహార కల్పితమేగాని, సత్యముగా లేదు సుమా.

## కర్మలక్షణము.

శ్రుతి। కర్మేతిచ॥ క్రియమాణేంద్రియైః। కర్మాణ్యహం కరోమీత ధ్యాత్మనిష్ఠ తయాకృతం కర్మైవ కర్మ॥

తా॥ ప్రశ్న. కర్మ అనగా నేమి? ఉత్త. కర్మ అనగా ఒకానొక కార్యము కాబట్టి వినుట చూచుట మాట్లాడుట మొదలగు ఒక్కొక్క కార్యమున్న కర్మ అనబడును. అట్టికర్మ, సాధారణకర్మ, పాపకర్మ, సత్కర్మ, నివృత్తికర్మ అని నాలుగు విధములు. అందు సాధారణకర్మ యెట్టిదనగా, దశేంద్రియంబులు చేయు కార్యములు. ఎట్లనగా శ్రోత్రేంద్రియము, దానికి విషయమగు శబ్దమును వినుచుండును. త్వగింద్రియము, దానికి విషయంబగు స్పర్శమును స్పృశించుచుండును. నేత్రేంద్రియము దానికి విషయంబగు రూపంబును చూచుచుండును. జిహ్వేంద్రియము దానికి విషయంబగు రసములను రుచి చూచుచుండును. ఘ్రాణేంద్రియము, దానికి విషయంబగు గంధమును వాసన చూచుచుండును. వాక్కు, మాట్లాడుచుండును. పాణి, ఇచ్చుట పుచ్చుకొనుట మొదలగు కార్యములు చేయుచుండును. పాదము, నడచి పోవుచు వచ్చుచుండును. గుహ్యము, మూత్రమును విడుచుచుండును. మఱియు శుక్లమును విడుచుచు ఆనందించుచుండును. గుదము, మలవిసర్జనము చేయుచుండును. అవిద్యాభ్రాంతివలన ఆత్మ, దశేంద్రియంబులే తనస్వరూపమనియు, దశేంద్రియంబులచే చేయబడిన కార్యములను నేను చేయుచున్నాననియు, భావించుచుండును. అట్లు భావించిన ఆత్మచే చేయబడిన ఇంద్రియ కార్యములన్నియు దేహకర్మయనియు, సాధారణకర్మయనియు చెప్పబడును. అయితే (శ్లో॥ ఇంద్రియాణాం ప్రసంగేషు దోషమృచ్ఛత్య సంశయమ్। సన్నియమ్యతు తాన్యేవ తత సిద్ధిం నియచ్ఛతి॥) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, ఇంద్రియంబులు దాని దాని కార్యములను చేయుచుండుటవలన అనగా శబ్దాది విషయంబులందు వ్యాపించుటవలన దోషము సిద్ధించును. అట్లు ఇంద్రియములను విషయములందు పోనీయక అడంచిన యెడల, మోక్షాది సకల సిద్ధులున్ను గలుగును. ఎట్లనగా, ఇంద్రియంబులు శబ్దాది విషయంబులందు వ్యాపింపగా, పురుషునికి ఆ విషయంబులందు (ఆశ) అనగా పట్టు గలుగును. అట్లు ఆశ కలుగుటవలన (కామము) అనగా ఇచ్ఛ గలుగును. అట్లు కామము గలుగుటవలన (క్రోధము) అనగా కోపము గలుగును. అట్లు కోపము గలుగుటవలన (మోహము) అనగా కార్యాకార్యములందు వివేకము లేకపోవుట సిద్ధించును. అట్లు మోహము గలుగుటవలన (స్మరణ) అనగా ఇంద్రియములను జయింపవలయు ననెడి జ్ఞప్తి మఱచిపోవును, అట్లు స్మరణ తప్పుటవలన (బుద్ధి) అనగా ఆత్మజ్ఞానమును పొందుటకు ప్రయత్నించు వివేకము భంగమగును. అట్లు బుద్ధి చెడుటవలన

పురుషుడు సంసారసాగరంబునందు మునిగిపోవును. కాబట్టి (శ్లో॥ ఇంద్రియాణాంతు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్ । తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేఃపాదా దివోదకమ్॥) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, ఇంద్రియంబులలోపల ఏదయిన నొక ఇంద్రియము స్వాధీనము కానియెడల, జ్ఞానము ఓటికుండలోని జలమువలె కొంచెము కొంచెముగా తగ్గిపోవును. కాబట్టి (శ్లో॥ వశే కృత్వేంద్రియ గ్రామం సంయమ్యచ మనస్తథా। సర్వాన్ సంసాధయేదర్థాన్ అక్షిణ్వన్ యోగత స్తనుమ్॥) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, ఇంద్రియములు విషయంబులందు వ్యాపింపకుండునట్లు మెల్లమెల్లగా నానాట వశపఱచుకొని తనశరీరమును కష్టపెట్టక జ్ఞాననిష్ఠను సాధింపవలయును. అయితే (శ్లో॥ న తథైతాని శక్యంతే సన్నియంతు మసేవయా। విషయేషు ప్రజుష్టాని యథా జ్ఞానేన నిత్యశః॥) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, విషయములందు తగిలియుండు ఇంద్రియములను ఆ విషయములందుండి త్రిప్పుటకు ఎట్టివారికిని అసాధ్యము. అయితే జ్ఞానానుష్ఠానము చేత మనస్సును అడంచినయెడల అనగా మనస్సు నిరాశగా నున్నయెడల, ఇంద్రియంబులు విషయాసక్తిని విడిచిపెట్టి వానియందు వ్యాపింపకుండును గాని, బలాత్కారముగా ఇంద్రియంబులను విషయంబులందుండి తొలగించుటవలన ఆ ఇంద్రియములు అణగజాలవు. అనగా మరల యథారీతిగా ఆ యింద్రియములు దానిదాని కార్యములను చేయుచుండును. అనగా శబ్దాది విషయంబులందు వ్యాపించుచుండును. కాబట్టి మనస్సును అణచక ఇంద్రియంబులను బలాత్కారముగా జయించుటకు ప్రయత్నించువాడు మూఢుడనబడును. మఱియు ఇంద్రియములను దానిదాని కార్యములను చేయకుండునట్లు బలాత్కారముగా అడ్డగించినయెడల శరీరము నిలువజాలదు. కాబట్టి (శ్రుతి శ్రుత్వా స్పృష్ట్వాచ భుక్త్వాచ దృష్ట్వా జ్ఞాత్వా శుభాశుభమ్। నహృష్యతి గ్లాయతివా యశ్శాంత ఇతి కథ్యతే॥) అనెడి మహోపనిషద్వాక్య రీతిగాను, మఱియు (శ్లో॥ శ్రుత్వా స్పృష్ట్వా దృష్ట్వాచ భుక్త్వా ఘ్రాత్వాచ యోనరః। నహృష్యతి గాయతివా సవిజ్ఞేయో జితేంద్రియః॥) అనెడి మనుస్మృతి వాక్యరీతిగాను, శ్రోత్రము శబ్దమును వినుచున్నను, త్వక్కు స్పర్శములను స్పృశించుచున్నను, నేత్రము రూపమును చూచుచున్నను, జిహ్వ రసమును రుచి చూచుచున్నను, ఘ్రాణము గంధమును వాసనచూచుచున్నను, వాక్కు మాట్లాడుచున్నను, పాణి ఇచ్చుచు పుచ్చుకొనుచున్నను, పాదము నడచుచున్నను, గుహ్యము శుక్లమును మూత్రమును విడుచుచున్నను, గుదము మలవిసర్జనము చేయుచున్నను, ఆయా యింద్రియములు దానిదాని కార్యములు చేయుచున్నవి గాని, ఆత్మస్వరూపుడగు నేను (అకర్తను) అనగా ఏ కార్యమున్ను చేయుటలేదు, (అభోక్తను, అనగా విషయంబులవలన గలుగు సుఖదుఃఖంబులు నాకులేవు, అని భావించుచు విషయంబులవలన గలుగు సుఖంబునకు సంతోషింపక, అట్టి సుఖంబులను ఆశింపక, మరియు దుఃఖంబునకు వ్యసనపడక, ఆ సుఖదుఃఖంబులందు తగులువడక, ఆత్మస్వరూపుడగు నేన్సదా దేహేంద్రియముల

షని యని ధ్యానించుటయు, తన్మయముగా నుండినయెడల, మనస్సు స్వస్వరూపము ను అయుండి, ఇంద్రియంబులు విషయంబులందు వ్యాపింపక తమకు తామే అణగి వశములగును గాన, అట్టి బ్రహ్మానుష్ఠానముచే ఇంద్రియములను జయించిన వాడే జితేంద్రియుడగును గాని, బలాత్కారముగా ఇంద్రియములను జయించువాడు, అనగా ఇంద్రియములు చేయు కార్యములను చేయనియ్యక అడ్డగించు వాడు జితేంద్రియుడు గాజాలడు. అట్లు బలాత్కారముగ అడ్డగించుటవలన, ఆ ఇంద్రియములున్ను దాని కార్యమును చేయుట మాని అణగజాలవు; మఱియు అట్లు అడ్డగించుట వలన దేహమున్ను నిలువజాలదు సుమా! శరీరకర్మలు గాక, మరియు పాపకర్మలు పుణ్యకర్మలని రెండు విధముల కర్మలు గలవు. జీవహింస చేయుట దొంగలించుట అసత్యమాడుట దూషించుట కొట్టుట బాధించుట మోసపుచ్చుట మొదలయిన కార్యములు చెడ్డ కార్యములుగా నెంచుటవలన, వేదవిరుద్ధములగు పాపకర్మ అనఁబడును. అట్టి పాపకర్మములు చేయుట వలన మరణించిన వెనుక నరకలోకమును జేరి దుఃఖములనుభవించి, మరల (శ్లో॥ శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః। వాచికైః పక్షిమృగతాం మానసైరంత్యజాతితామ్॥) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, శిష్యా! అహంకరించి దేహముచే చేయబడిన పాపకర్మలకు గాను భూలోకంబునందు పర్వత వృక్ష లతాది స్థావరజన్మంబులు కలుగును. అహంకరించి వాక్కుచే చేయబడిన పాపకర్మలకుగాను మృగపక్షి జన్మంబులు గలుగును. అహంకరించి మనస్సుచే చేయబడిన పాపకర్మలకుగాను మనుష్యులలోపల అధమజాతులయిన చండాలాది జన్మంబులు గలుగును గాన, ఎన్నటిని వేదవిరుద్ధములయిన పాపకర్మలు స్వప్నేపి చేయరాదు, చేయవలయునని మనస్సున తలంపరాదు సుమా! శిష్య-ప్రశ్న. స్వామీ! తాము చెప్పినట్లు ఇకమీద పాపకర్మలు చేయజాలను గాని, ఇదివరకు చేసిన పాపకర్మలు నశించుటెట్లనగా గురుడిట్లనియె. (శ్లో॥ కృత్వా పాపం హి సంతప్య తస్మాత్పాపాత్ ప్రముచ్యతే। నైవం కుర్యాత్ పునరితి నివృత్త్యా పూయతే తు సః) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, శిష్యా! పాపము చేసిన వెనుక అయ్యో! భగవంతుడా! నేను తెలియక చేసితిని, నా తప్పును మన్నింపుము స్వామీ! అని పశ్చాత్తాపపడి దుఃఖించి ఈశ్వరుని ప్రార్థింపగా ఆ పాపకర్మములు నశించును. మరల ఇకమీద ఇటి పాపకార్యములు చేయుటలేదని సత్యముగా చేయక విడిచిపెట్టగా దోషము లేనివాడగుచున్నాడు సుమా!

## అకర్మలక్షణము.

(శ్రుతిః అకర్మేతిచ॥ కర్తృత్వ భోక్తృత్వాద్యహంకారతయా బంధరూపం। జన్మాది కారణం నిత్య నైమిత్తిక యాగ వ్రత తపో దానాదిషు ఫలాభిసంధానం యత్తదకర్మ॥

తా. ప్రశ్న. అకర్మ యనగా నేమి? ఉత్త. స్నాన శౌచ సంధ్యావందన ప్రాణాయామము గాయత్రీధ్యాన శ్రాద్ధతర్పణాది నిత్యనైమిత్తిక కర్మలున్ను యాగ వ్రత

తపోదానాది కామ్యకర్మలున్ను, అకర్మ యనబడును. ఎట్లనగా, వేదోక్తము లయిన నిత్యనైమిత్తిక కామ్యకర్మలను ప్రతిమనుష్యుడున్ను ఫలాపేక్షతో చేయుటవలన తత్ఫ లంబు లనుభవించుటకుగాను పునర్జన్మంబు గలుగును. కాబట్టి అట్లు ఫలాపేక్షతో గూడినటువంటి నిత్యనైమిత్తిక కామ్యకర్మలు వేదోక్తములయిన పుణ్యకర్మలుగా నుండి నప్పటికిన్ని, అవి పునర్జన్మ కారణము లగుచు, జీవునికి బంధరూపము లగుటవల్లను మోక్షసాధనము గానందువల్లను అవి అకర్మ యనబడును. (అకర్మయనగా) ఫలాపేక్ష తో కూడినటువంటి నిత్యనైమిత్తిక కామ్యకర్మలు వేదోక్తములయిన పుణ్యకర్మలుగా నుండినప్పటికిన్ని, వానిని మోక్షాపేక్ష గలవారు చేయరాదని అభిప్రాయము. ఎట్లన గా, (శ్లో॥ శుభాభ్యుదయంచైవ నైశ్శ్రేయసిక మేవచ। ప్రవృత్తించ నివృత్తించ ద్వివి ధం కర్మవైదికమ్॥) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, వేదోక్తములగు కర్మములు ప్రవృత్తి కర్మయనియు నివృత్తి కర్మయనియు రెండువిధములు స్వర్గాది పదవులను జేరి అచ్చట దేవభోగములను అనుభవించుటకు కారణములయినవి ప్రవృత్తికర్మ లనఁబడును. జననమరణ సాగరంబునుదాటి ముక్తి పొందుటకు కారణములయినవి నివృత్తికర్మ అన బడును. (శ్లో॥ ఇహాంచాముత్రవా కామ్యం ప్రవృత్తి కర్మకీర్త్యతే। నిష్కామం జ్ఞాన పూర్వంతు నివృత్తి ముపదిశ్యతే) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, ధనధాన్య దారా పుత్రాది అష్టయిశ్వర్యమును అష్టభోగములు మొదలగు భూలోక సుఖములనున్ను, స్వర్గ లోకమునందలి దేవతాభోగములనున్ను కోరి చేయునట్టి నిత్యనైమిత్తిక తపోవ్రత యాగ దానాది పుణ్యకర్మలు కామ్యకర్మ లగుటవలన ప్రవృత్తికర్మ లనబడును. భూలోక సుఖంబులను గోరక (నిష్కామముగా) అనగా సంసారాపేక్షలేక చేయు (జ్ఞాననిష్ఠ) అనఁగా బ్రహ్మనిష్ఠ నివృత్తికర్మ యనఁబడును. (శ్లో॥ ప్రవృత్తింకర్మ సంసేవ్య దేవానా మేతి సామ్యతాం। నివృత్తిం సేవ్యమానస్తు భూతానత్యేతి పంచవై॥) అనెడి మను స్మృతి వాక్యరీతిగా, కామ్యకర్మములయిన ప్రవృత్తికర్మలను చేయువాడు మరణించిన వెనుక స్వర్గలోకమును జేరి దేవతలతో సమానుడగుచు దేవభోగములను అనుభవించి, పుణ్యము క్షీణించినతోడనే, మరల భూలోకమునందు తన పూర్వపుణ్య కర్మానుసార ముగా చక్రవర్తిగానైనను, లేక గొప్ప ధనవంతుడుగానైనను పుట్టును. నిష్కాముడై జ్ఞాననిష్ఠుడగు నివృత్తి కర్మను చేసినవాడు మరణించిన వెనుక జననమరణ సాగరమును దాటి శరీరరహితమగు విదేహముక్తిని పొందును. (శ్లో॥ యథా పంకేన పంకాంభః

కామ్యకర్మానుష్ఠానమువలన జన్మరహితము గాజాలదు.

సురయావా సురాకృతః। భూతహత్యాం తథైవైకాం నయజ్ఞైర్ మార్ష్టు మర్హతి॥) అనునట్లు, బురదను బురదనీళ్ళతో కడుగుకొనుటవలన బురద వదలనట్లున్ను, కల్లుకుం డను కల్లుపోసి కడుగుటవలన కల్లుకంపు పోవనట్లున్ను, కర్మముచేత గలిగిన జన్మము మరల కామ్యకర్మలయిన ప్రవృత్తి కర్మానుష్ఠానమువలన రహితము గాజాలదు, (శ్లో

శ్రోక్తా న్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః । ఆత్మజ్ఞానే శమేచ స్యాద్వేదాభ్యా సేచ యత్నవాన్॥) అనెడి మనుస్మృతిరీతిగా, జన్మహేతువులయిన జపతప వ్రత యాగ యజ్ఞాదులనైనను పరిత్యజించి జ్ఞాననిష్ఠ ఇంద్రియ నిగ్రహము వేదాంత విచారణ ఇవి ముఖ్యముగా సదా అభ్యసింపవలయును. (శ్లో॥ ఏతద్ధి జన్మసాఫల్యం బ్రాహ్మణస్య విశే

## బ్రాహ్మణలక్షణము.

షతః । ప్రాప్యైతత్ కృతకృత్యోహి భవతి నాన్యథా ) అనెడి మనుస్మృతి రీతిగా పై చెప్పబడిన జ్ఞాననిష్ఠ, ఇంద్రియనిగ్రహము. వేదాంతవిచారణ అనెడి మూడున్ను అభ్యాసము చేయనివాడు బ్రాహ్మణుడుగా జన్మించి యుండినను బ్రాహ్మణుడు గాజాలడు. (శ్రుతి॥ అనంతకర్మ శౌచంచ జపో యజ్ఞ స్తథైవచ । తీర్థయాత్రాభిగమనం యావత్తత్త్వం న విందతి॥) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, స్నాన శౌచ జప తప దానయాగ తీర్థయాత్రాదులు ప్రవృత్తి రూపములైన కామ్యకర్మ లగుటవలన వానివలన జనన మరణములు కలుగుచుండును గాని ముక్తి కలుగజాలదు. జ్ఞాననిష్ఠ తెలియని వారలే ప్రవృత్తిరూపంబగు కామ్యకర్మానుష్ఠానము చేయుచుందురు. (శ్రుతి॥ జీవస్య తత్త్వజిజ్ఞాసా నార్థో యశ్చేహ కర్మభిః । అథాతో బ్రహ్మజిజ్ఞాసా ) అనెడి శ్రుతివాక్య రీతిగాను, మఱియు (శ్లో॥ నివృత్తిం కర్మ సేవేత ప్రవృత్తిం మత్పరం త్యజేత్ । జిజ్ఞాసాయాం ప్రవృత్తోపి నాద్రియేత్కర్మ చోదనామ్) అనెడి ప్రమాణవాక్య రీతిగాను, జ్ఞానులు మోక్ష హేతువులై జ్ఞానసంబంధములైన, బ్రహ్మనిష్ఠ, వేదాంతశ్రవణమననాది నివృత్తి కర్మలనే చేయుచుందురు.

## జ్ఞానమే నిజమైన శిఖాయజ్ఞోపవీతములు.

(శ్రుతి॥ జ్ఞానశిఖినో జ్ఞాననిష్ఠాః జ్ఞానయజ్ఞోపవీతినః । జ్ఞానమేవ పరం తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే।) అనెడి బ్రహ్మోపనిషత్తురీతిగాను, మఱియు (శ్రుతి శాంత సుచల మద్వయానందచిద్ఘన ఏవాస్మి । తదేవమమ పరంధామ । తదేవశిఖా తదేవోపవీతంచ॥) అనెడి పరమహంసోపనిషత్తు రీతిగాను, జ్ఞానులకు జ్ఞానమే పరమపదముగాను, శిఖాయజ్ఞోపవీతములుగాను అగుచున్నది దాని, వారికి శిరస్సున జుట్టు పెట్టు

## జ్ఞానసంధ్యావందనము.

గానుటయు నాలుపోగుల జంధ్యమున్ను శిఖాయజ్ఞోపవీతములు గాజాలవు. (శ్రుతి॥ పరమాత్మాత్మనో రేకత్వ జ్ఞానేన తయోర్భేద ఏవ విభగ్న । స్సా సంధ్యా॥) అనెడి పరమహంసోపనిషత్తురీతిగ, జ్ఞానులకు శివజీవుల ఇద్దరిని ఒక్కటిగా సంధింపజేయు

## జ్ఞానగాయత్రి.

టయే, అనగా జీవబ్రహ్మైక్యమగు జ్ఞాననిష్ఠయే సంధ్యావందనముగా నున్నది. (శ్రుతి॥ [illegible]త్యాస్వం ప్రత్యగాత్మానం బుద్ధి తద్వ[illegible] సాక్షిణమ్ । సోహమిత్యేవ తద్వృత్త్యా

స్వాన్యత్రాత్మ మతిం త్యజేత్॥) అనెడి అధ్యాత్మోపనిషత్తురీతిగా, ఆత్మయే పరబ్రహ్మ మని బోధించు (సోహంభావ) ధ్యానమే జ్ఞానులకు జ్ఞానగాయత్రిగా నున్నది. అట్టి

జ్ఞానమే మహాపుణ్యతీర్థము.

జ్ఞానగాయత్రియే, అజపాగాయత్రి యనబడును. (స్వస్వరూప విజ్ఞానాత్ జాధికం తీర్థ ముచ్యతే। తరతి శోక మాత్మవిత్ జ్ఞానేన తస్మాత్ జ్ఞానమేవ పరంతీర్థం॥) అనునట్లు, విజ్ఞానము లభించుటవలన జననమరణ సాగరమును దాటి మోక్షమనెడి గట్టును చేరు చున్నాడో, అట్టి జ్ఞానమే తీర్థమనబడును గాని, గంగాదితీర్థములు జ్ఞానులకు తీర్థములు

జ్ఞానప్రాణాయామము.

గాజాలవు. (శ్లో॥ నిరోధ స్సర్వవృత్తీనాం ప్రాణాయామ స్స ఉచ్యతే। నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్య స్సమీరితః। బ్రహ్మైవాస్మీతి యావృత్తిః పూరకో వాయు రుచ్యతే। తత స్తద్వృత్తి నైశ్చల్యం కుంభకం ప్రాణసంయమః। అయంచాపి ప్రబు ద్ధానామజ్ఞానం ఘ్రాణపీడనమ్॥) అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, సకల మనోవృత్తు లను బంధించుటే జ్ఞానప్రాణాయామ మనబడును. దేహాది ప్రపంచము నేను గాదని అ దేహాదిప్రపంచవాసనలను విడిచిపెట్టుటే జ్ఞానరేచక మనబడును. ఆత్మస్వరూపుడను నేనే బ్రహ్మమని నిశ్చలముగా ధ్యానించుచుండుటే జ్ఞానపూరక మనబడును. అట్లు నేనే బ్రహ్మ మనెడి ధ్యానమును సహితము విడిచిపెట్టి, సకల సంకల్పములు నశించి, కేవలజ్ఞప్తిమాత్రముగా నుండు తూష్ణీంభావస్థితియే జ్ఞానకుంభక మనబడును. అట్టి జ్ఞానకుంభకమే నిర్వికల్పసమాధి యనియు నిర్వాసనామౌననిష్ఠ యనియు, బ్రహ్మనిష్ఠ యనియు, స్వానుభూతి యనియు, జ్ఞాననిష్ఠ, జ్ఞానసాక్షాత్కారమనియు, తుర్యసమాధి యనియు, స్వానుభవ మనియు, ఆత్మానుభవ మనియు చెప్పబడును. కాబట్టి అట్టి జ్ఞాన రేచక పూరక కుంభకము లనెడి జ్ఞానప్రాణాయామమునే జ్ఞానులు చేయుచుందురు గాని, అజ్ఞానులరీతిగా ముక్కురంధ్రములగుండా వాయువును పైకి ఈడ్చి, దానిని సంచారములేక పట్టి బంధించుట, ముక్కునుపట్టి పీడించుట యిందలగు కర్మప్రాణా

జ్ఞానశుద్ధులు.

యామమును చేయజాలరు. (శ్లో॥ అద్భిః గాత్రాణి శుద్ధ్యంతి మనస్సత్యేన శుద్ధ్యతి విద్యా తపోభ్యాం భూతాత్మా బుద్ధిర్ జ్ఞానేన శుద్ధ్యతి॥) అనెడి మనుస్మృతి వాక్య రీతిగా దేహము జలమువల్లను, మనస్సు సత్యమువల్లను, జీవాత్మ బ్రహ్మనిష్ఠవల్లను నిష్కామ తపస్సువల్లను, బుద్ధి యథార్థజ్ఞానమువల్లను అనగా సదసద్వివేకమువల్లను, పరిశుద్ధమగుచున్నది. లోకంబున అజ్ఞానులు జలమువలన దేహమును శుద్ధముగా చేసు కొందురుగాని, వారికి మనస్సు, జీవాత్మ, బుద్ధి అనునివి శుద్ధములు గాజాలవు. అయితే (శ్రుతి యస్య వాఙ్మనసే శుద్ధే సమ్యగ్గుప్తేచ సర్వదా। స వై సర్వమవాప్నోతి వేదాం తోపగతం ఫలమ్॥) అనెడి నారద పరివ్రాజకోపనిషత్తురీతిగా, జ్ఞానులకు జ్ఞానతీర్థస్నా

ముచే వాక్కు, మనస్సు, బుద్ధి, జీవాత్మ యనెడి నాలుగున్ను పరిశుద్ధములుగా నుండును గాన, వారు లౌకిక మయిన జలస్నానముచే గలుగు దేహశుద్ధిని ముఖ్యముగా తలంప

### జ్ఞానదానమే శ్రేష్ఠము.

రు. మరియు (శ్లో॥ సర్వేషామపిదానానాం బ్రహ్మదానం విశిష్యతే। వార్యన్న గోమహీ వాస స్తిల కాంచన సర్పిషామ్॥) అనెడి మనుస్మృతి వాక్యరీతిగా, జ్ఞానులు వారిని ఆశ్రయించిన శిష్యులకు సదా బ్రహ్మజ్ఞానమును బోధించుచుండుటే జ్ఞానదానము అనబడును. జలదాన, అన్నదాన, గోదాన, భూదాన, వస్త్రదాన, తిలాదాన, స్వర్ణదాన, ఘృతదానములకంటెను జ్ఞానదానము శ్రేష్ఠమైనది గాన, జ్ఞానులు సదా జ్ఞాన

### జ్ఞానయాగము.

దానమునే చేయుచుందురు. మరియు (శ్రుతి॥ యజతే పురుషో యజమానః। బుద్ధిం పత్నీం పరిగృహ్య దీక్షాం సంతోషం। ధీంద్రియాణి యజ్ఞపాత్రాణి కర్మేంద్రియాణ్యుపకరణాని। సర్వే శారీరకేత త్తద్దేవతా ఏవ ర్త్విజ స్తటస్థా ఏవ। యథాదేశం యజమాన మనుయజంతే) అనెడి గర్భోపనిషత్తు రీతిగాను, మరియు (శ్రుతి॥ ఓమిత్యాత్మానమవ్యగ్రో బ్రాహ్మణ్యగ్నౌ జుహోతి తత్। జ్ఞానయజ్ఞ సవిజ్ఞేయ స్సర్వ యజ్ఞోత్తమః॥ జ్ఞానదండా జ్ఞాన శిఖా జ్ఞానయజ్ఞోపవీతినః। శిఖా జ్ఞానమయీ యస్య ఉపవీతంచ తన్మయం। బ్రాహ్మణం సకలం తస్య ఇతి వేదానుశాసనమ్॥) అనెడి శాట్యాయనీయ ఉపనిషత్తురీతిగాను, శిష్యా! దేహమే యాగశాలగా నున్నది. ఇట్టి దేహమనెడి యాగశాలయందు జ్ఞానేంద్రియంబులే యజ్ఞపాత్రగాను, కర్మేంద్రియంబులు ఉపకరణంబులుగాను, సుఖదుఃఖములను సమముగా తలంచుటయనెడి సంతోషమే దీక్షగాను, ఆయాయింద్రియాధి దేవతలే ఋత్విజులు గాను, జీవుడే యజ్ఞముచేయు యజమానుడు గాను, బుద్ధియే యజ్ఞము చేయు యజమానుని భార్యగాను, కోపమే యజ్ఞ పశువుగాను, కామమే ఆజ్యముగాను అగుచున్నది. కాబట్టి జ్ఞాని ఓం అను ప్రణవమంత్రమును ధ్యానించుచు, పరబ్రహ్మమనెడి యోగాగ్నియందు జీవస్వరూపియగు తన్ను వేల్చి హోమముచేసి తన జీవస్వరూపము చెడి, తాను బ్రహ్మస్వరూపి యగుచున్నాడు. అట్టి జ్ఞానయజ్ఞమే సకలయజ్ఞములలోపల శ్రేష్ఠమైనది సుమా! శిష్యా। అట్టి జ్ఞానయజ్ఞము, జ్ఞానదండము, జ్ఞానశిఖ, జ్ఞానయజ్ఞోపవీతము ఎవనికి కలదో, అతడే వేదోక్తమైన బ్రాహ్మణు డనబడును గాని, తక్కినవాడు బ్రాహ్మణుడుగా జన్మించియుండినప్పటికిన్ని బ్రాహ్మణుడు గాజాలడు సుమా! (శ్లో॥ ఇంద్రియద్వార సంగ్రాహ్యై గంధాద్యైరాత్మ దేవతామ్। స్వయం భక్త్యా సమారాధ్య జ్ఞాతుం సోయం మహామఖః॥) అనెడి ప్రమాణరీతిగా ఇంద్రియంబులచే సంగ్రహింపబడిన గంధాదులచే తనయొక్క ఆత్మస్వరూపమును పూజించి, పరబ్రహ్మమగు ఆయాత్మయే తానని తెలిసి సదా తన్మయంబుగా నుండుటే జ్ఞానయాగ మనబడును. కాన అట్టి జ్ఞానయాగమునే సదా జ్ఞానులు

చేయుచుందురు గాని, అజ్ఞులరీతిగా పశువును హింసించి చేయు కర్మయాగమును

## జ్ఞా న ఉ ప వా స ము.

చేయజాలరు. (శ్లో॥ ఉప సమీపే యోవాసో జీవాత్మ పరమాత్మనోః। ఉపవాస స్సవిజ్ఞేయో నతు కాయస్య శోషణమ్॥) అనెడి వరాహోపనిషత్తునందలి వాక్యరీతిగా, జీవాత్మ పరమాత్మలను రెంటిని ఏకముగా చేయు బ్రహ్మనిష్ఠయే ఉపవాస మనబడును సుమా! (శ్రుతి॥ ఆత్మానం చేద్విజానీయాత్ అయమస్మీతి పూరుషః। కిమిచ్ఛన్ కస్యకామాయ శరీర మనుసంజ్వరేత్॥) అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగా, బ్రహ్మమే ఆత్మ, ఆత్మయే బ్రహ్మమని తెలిసినజ్ఞానులకు ఆత్మనిష్ఠయే ఉపవాసముగా నుండును గాని, ఆహారమును విడిచిపెట్టి దేహమును శుష్కింపజేయు లౌకికములైన ఏకాదశి శివరాత్రి అమావాస్య మొదలగు తిథులందలి కర్మ ఉపవాసములు ఉపవాసములు గాజాలవు, కాబట్టి (శ్రుతి॥ జ్ఞానామృత తృప్తయోగినో నకించిత్ కర్తవ్యమస్తి। అస్తిచేన్న సతత్త్వవిద్భవతి॥) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, దేవామృతమును పానము చేసి తృప్తిపొందిన వానికి తక్కిన మధురమైన పదార్థములు ఏదియైనను రుచింపనట్లున్న, వాటిని కోరనట్లున్న, జ్ఞానామృతతృప్తుడైనజ్ఞాని సర్వసంకల్ప రహితుడు గాన, బ్రహ్మరుద్రేంద్రాదుల పదవులందలి సుఖములనున్న, భూలోక భోగములనున్న కోరజాలడు గాన, అట్టి భూలోక దేవలోక భోగంబులకు కారణములైన యజ్ఞ దాన తపో వ్రతాది కామ్యకర్మలైన ప్రవృత్తికర్మలను చేయజాలడు. సదా జ్ఞాననిష్ఠామాత్రుడై యుండును. (శ్రుతి॥ సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని। సమంపశ్యన్ బ్రహ్మపరం యాతి నాన్యేనహేతునా॥) అనెడి కైవల్యోపనిషత్తురీతిగాను, మఱియు (శ్లో॥ సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని। సమంపశ్యన్ ఆత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి॥) అనెడి మనుస్మృతివాక్యరీతిగాను, సకలజీవుల హృదయములందు పరబ్రహ్మ మగు ఆత్మ సాక్షిస్వరూపుడై యున్నాడనియును, మఱియు అట్టి పరబ్రహ్మమగు ఆత్మయందు సముద్రమునందలి తరంగములరీతిగా సకలజీవులు నివసించుచున్న వనియును, కాబట్టి సకలజీవులున్న పరబ్రహ్మస్వరూపమనియును తెలిసి, సర్వత్ర సమదర్శనముఃగలవాడే బ్రహ్మజ్ఞాని యనబడును. అట్టి సర్వత్ర సమదర్శన జ్ఞానమువల్లనే ముక్తిని పొందవచ్చును గాని, మరి దేనివల్లను ముక్తి లభింపజాలదు గాన, అట్టి సమదర్శను డగు జ్ఞాని, ఒకవేళ బంధహేతువులైన తపో యజ్ఞదానాది కామ్యకర్మలను చేసినను, వాటియందలి ఫలాపేక్షలేక నిష్కాముడై బ్రహ్మార్పణముగా జేయును గాన, అతడు కర బద్ధుడు గాజాలడు, బ్రహ్మైక్య మనెడి నిజముక్తిని పొందును. కాబట్టి జ్ఞాని ప్రవృ ర్మలగు కామ్యకర్మలను చేసినను చేయకున్నను అతనికి దోషములేదు, అయితే అ జ్ఞానులు తప్ప, తక్కినవారు యాగయజ్ఞ

## పామరులు అవశ్యము కర్మానుష్ఠానము చేయవలయును.

దానాది సత్కర్మలను అవశ్యము చేయుచుండవలయును. ఎందువల్లననగా (శ్రుతి॥ సత్కర్మ పరిపాకతో బహూనాం జన్మనా మంతే । నృణాం మోక్షేచ్ఛా జాయతే । తదా సద్గురు మాశ్రిత్య చిరకాల సేవయా । బంధా న్మోక్షం కశ్చిత్ ప్రయాస్యతి॥) అనెడి పైంగలోపనిషత్తువాక్యరీతిని, లోకులు అనేక జన్మములందు ఫలాపేక్ష కలవారై యజ్ఞ దాన జపతపాది సత్కర్మలను జేయుచు తత్ఫలంబులను అనుభవించుటకుగాను పుట్టుచు గిట్టుచుందురు. అట్లు అనేక జన్మములందు ఫలాపేక్షతో చేసిన సత్కర్మములవలన ఒక జన్మమునందు (వారు చేయు సత్కర్మములకు తగిన ఫలంబులను ఈశ్వరు డిచ్చుచున్నాడనియు, అట్టి ఈశ్వరుడే సకలకర్తయనియు) అతనియందు నిశ్చలభక్తి గలుగును. (శ్రుతి॥ తమేతం వేదానువచనేన వివిదిషంతి బ్రహ్మచర్యేన తపసా శ్రద్ధయా యజ్ఞేనా నాశకేన॥) అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగా, అట్లు ఈశ్వరునియందు నిశ్చలభక్తి కలుగుటవలన మోక్షాపేక్ష కలవారై జప తప యాగాది సత్కర్మలను ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణముగా జేయుచు ఈశ్వరునియందు అచంచల భక్తి కలిగియుందురు.—(శ్రుతి తండులస్య - యథా - చర్మ - తామ్రస్యనతు - కాలిమా । నశ్యతి - క్రియయా - విప్ర - పురుషస్య - తథా - మలమ్) అనెడి మహోపనిషత్తు వాక్యరీతిగాను; (శ్రుతి॥ కుర్వన్నే వేహ - కర్మాణి - జిజీవిషేత్ - శతం - సమాః । ఏవం త్వయి - నాన్యథేతో స్తి - నకర్మ - లిప్యతే - నరే॥)—అనెడి ఈశావాస్యోపనిషత్తు రీతిగాను, అట్లు మోక్షాపేక్ష గల ముముక్షువులు ఈశ్వరునియందు అచంచల భక్తిగలిగి ఈశ్వరార్పణముగా ప్రవృత్తి మార్గమగు సత్కర్మలను ఫలాపేక్షలేక చేయుచుండుట వలన, (ఈశ్వరానుగ్రహాదేవ - పుంసా - మద్వైత - వాసనా॥)—అనునట్లు, చిత్తశుద్ధియు ఈశ్వరానుగ్రహంబును గలుగుటవలన, జ్ఞానానుష్ఠానమును పొందుటకు ఇచ్ఛగలవారై జ్ఞానాచార్యుని ఆశ్రయించి, తద్వారా జ్ఞానసాక్షాత్కారమును పొంది ముక్తులగుదురు గాన—శ్లో॥ దేహోయం - మానుషో - జంతోః బహుకర్మైక - సాధనమ్ । సదా సత్కర్మ - సేవేత - దుష్కర్మ - సతతం - త్యజేత్॥) అనునట్లు, ఫలాపేక్షలేక చేయు సత్కర్మలు ఈశ్వరప్రీతిగాను, జ్ఞానము పొందుటకు సాధనములుగాను యుండుటవలన జ్ఞానసాక్షాత్కారమును పొందువరకును ఫలాపేక్షలేక సత్కర్మలను ఈశ్వరార్పణముగా చేయుచుండవలయును.—(శ్రుతి॥ అంధం తమః - ప్రవిశంతి - యే - సంభూతి - ముపాసతే । తతో - భూయ - ఇవ - తే - తమో - య - ఉ - సంభూత్యాం - రతాః॥)—అనెడి ఈశావాస్యోపనిషత్తురీతిగా, అట్లు జ్ఞానసాక్షాత్కార పర్యంతము ఫలాపేక్ష లేక ఈశ్వరార్పణముగా సత్కర్మలను చేయనివారు రౌరవాది నరకంబులను పొందుచు జననమరణ సాగరంబున మునిగి మోక్షమనెడి గతి గానక దుఃఖించుచుందురు, ఇది సత్యము సుమా.

## జ్ఞా న ము న గా నె ట్టి ది?

శ్రుతి॥ జ్ఞాన మితిచ॥ దేహేంద్రియ - నిగ్రహ - సద్గురూపాసన - శ్రవణ- మన నిదిధ్యాసనై - ర్య ద్దృగ్దృశ్య-స్వరూపం- సర్వాంతరస్థం - సర్వసమం- ఘటపటాది పదార్థమివా ఽవికారం వికారేషు- చైతన్యం వినా- కించిన్నాస్తీతి- సాక్షాత్కా రాను భవః- జ్ఞానమ్॥

తాత్పర్యము, జ్ఞానమనగా దేహాభిమానమును విడిచి ఇంద్రియములను జయించి మోక్షాపేక్ష గలవాడై సద్గురువు నాశ్రయించి వారివద్ద వేదాంత శ్రవణ మనన నిదిధ్యాసన ములను జేయుటవలన, కేవల నిర్వికార చైతన్యమే పరబ్రహ్మ మనియు, అట్టి పరబ్రహ్మ మగు చైతన్యమే (దృక్కు-గాను) అనగా; జ్ఞానస్వరూపమగు ఆత్మగాను, మఱియు (దృశ్యముగాను) అనగా జడపదార్థములయిన దేహేంద్రియాది జగత్తుగాను వున్నదని యును; మఱియు—(శ్రుతి॥ ఏకోదేవ - స్సర్వభూతేషు - గూఢః )— అనెడి గోపాల తాపిన్యుపనిషత్తు రీతిగా, అట్టి పరబ్రహ్మమగు చైతన్యమే సకల భూతములందు వ్యా పించి యున్నదనియును; మఱియు--(శ్రుతి॥ ఏక స్తథా - సర్వ భూతాంతరాత్మా - రూపం - రూపం - ప్రతిరూపో- బభూవ )— అనెడి కఠోపనిషద్వాక్యరీతిగా, అట్టి సకల భూతములందును వ్యాపించియుండు చైతన్యము సర్వమునందు సమముగా నున్న దనియు; మఱియు, (శ్రుతి॥ యథా-తరంగ-కల్లోలై ర్జలమేవం- స్ఫుర త్యలం। ఘటనా మ్నా- యథా పృథ్వీ పటనామ్నాహి- తం తవః జగన్నామ్నా- చిదాభాతి- సర్వం బ్రహ్మైవ కేవలమ్ ) అనెడి యోగశిఖోపనిషత్తు రీతిగా, సముద్రజలమే అలలు నురుగ ఉప్పు మొదలయినవిగా అయినట్లున్ను, మట్టియే నానావిధ రూపనామములలో కుం డలు చట్లుగా నయినట్లున్ను, నూలే నానావిధవస్త్రములుగా నయినట్లున్ను, పరబ్ర మగు చైతన్యమే నానావిధ రూపనామములు గల జగత్తుగా తోచుచున్నది గాన జగత్తు సర్వమున్ను పరబ్రహ్మమే అనియు, అట్టి పరబ్రహ్మమున కంటెను అన్యముగ అణుమాత్రమయినను లేదనియు, అట్టి పరబ్రహ్మమగు చైతన్యమే నే ననియును తెలిసి మఱియు, —(శ్రుతి॥ నలేద స్తి- నయ త్రాహం- నతద స్తి- నతన్మయమ్। కి మన్యదభి వాంఛామి- సర్వం- సచ్చిన్మయం- తతమ్ )— అనెడి మహోపనిషత్తు రీతిగా, అట్టి చైతన్యస్వరూపు డయిన నేను లేనిచోటు ఏగిన్ని లేదు, నా స్వరూపము కానిది ఏ యును లేదు, కాబట్టి సర్వప్రపంచమును నాస్వరూపముగానే యున్నది గనుక నే కోరదగినది ఏమియును లేదని, సర్వసంకల్ప శూన్యుడై సదా కేవల చైతన్య మా త్రముగా నుండు అనుభవమే జ్ఞానమనబడును.

## అ జ్ఞా న ము న గా నె ట్టి ది?

శ్రుతి॥ అజ్ఞానమితిచ॥ రజ్జు - సర్పభ్రాంతి - రివా ద్వితీయే - సర్వాను స్యూ

సర్వమయే బ్రహ్మణి । దేవ - తిర్య - జ్నర - స్థావర - స్త్రీ పురుష - వర్ణాశ్రమ - బంధమోక్షోపాధి నా - నాత్మభేద - కల్పితం - జ్ఞాన - మజ్ఞానమ్॥

తాత్ప॥ అజ్ఞాన మనగా నేది? ఉత్తరము.— పరబ్రహ్మము (అద్వితీయ మైనది) అనగా తనకు రెండవ వస్తువు మఱియొకటి లేనిది తనకు రెండవ వస్తువు వున్నయెడల సజాతీయ విజాతీయాది భేదములు గలుగును, ఎట్లనగా ఒకవస్తువునకు తనకు సమానమైన మఱియొక వస్తువు వుండుటవలన సజాతీయ భేదము గలుగును. తనకు ఎక్కువైన, లేక తక్కువైన వస్తువున్నయెడల విజాతీయ భేదము గలుగును. తనకు శిరస్సు కాళ్ళు చేతులు మొదలగు అంగములు, రూపనామములు, ఆది మధ్యాంతములు గలిగి యుండిన యెడల స్వగత భేదము గలుగును. అయితే నామరూప క్రియాశూన్యమై, తనకు రెండవ వస్తువు లేక, ఏకముగా నుండునదే పరబ్రహ్మముగాన, అట్టి పరబ్రహ్మము సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేనిది. సర్వపరిపూర్ణ మైనది సర్వమయ మైనది. త్రాటిని జూచి సర్ప మని భ్రమించుట రజ్జుసర్పభ్రాంతి యనబడును. అట్టి రజ్జుసర్ప భ్రాంతిరీతిగా సజాతీయ విజాతీయ స్వగతభేదములు లేని, అనగా రూపనామక్రియలు లేని బ్రహ్మమునందు అవిద్యాభ్రాంతి వలన గలిగినటువంటి దేవ మానవ మృగ పక్షి క్రిమి కీటక పర్వత లతా వృక్ష స్త్రీ పురుష జాత్యాచార ఆశ్రమ బంధమోక్షోపాధుల వలన (నానాత్మలు) అనగా అనేక విధములుగా అనేకాత్మలు గలవనెడి భేదభావనతో గూడియుండు జ్ఞానమే అజ్ఞాన మనబడును.

### సుఖదుఃఖములనగా నెట్టిది?

శ్రుతి॥ సుఖమితిచ॥ సచ్చిదానందానుభవ - స్వరూపం - జ్ఞాత్వా - ఽనంద రూపా - యస్థితి - స్సైవ - సుఖం॥ దుఃఖమితి॥ అసత్సంసార - విషయ - సంకల్ప- ఏవ - దుఃఖమ్॥

తా॥ సుఖమనగా నెట్టిది? దుఃఖమనగా ఎట్టిదనగా, బ్రహ్మానుభవ మిట్టిదని తెలిసి, అట్టి బ్రహ్మానుభవనిష్ఠ యందుండుటే సుఖమనబడును అసద్రూపమగు సంసార విషయ మైన సంకల్పమే దుఃఖమనబడును. ఎట్లనగా, తనకిష్టమగు పదార్థములు ప్రాప్తించుటవలన గలుగు సంతోషమే సుఖ మనబడును అట్లు తనకిష్టమగు పదార్థములు ప్రాప్తించకుండుటవల్లను, మఱియు తనకు అనిష్టమగు పదార్థములు ప్రాప్తించుట వల్లను గలుగు వ్యసనము దుఃఖమనబడును.— (శ్లో॥ సుఖస్యానంతరం - దుఃఖం - దుఃఖస్యానంతరం - సుఖం । చక్రవత్ - పరివర్తంతే దుఃఖానిచ - సుఖానిచ॥) అనునట్లు సుఖదుఃఖములు కర్మానుసారముగా కొన్నాళ్ళ వఱకు సుఖము గలుగుచు తర్వాత లేకపోవును; అట్లు సుఖము పోయిన వెనుక కొన్నాళ్ళవరకు దుఃఖము గలుగుచు తర్వాత లేకపోవును. అట్లు దుఃఖము లేకపోయిన వెనుక మరల సుఖము నైది దుఃఖము గలుగును. ఇట్లు విషయములవలన గలుగు సుఖదుఃఖములు ఒకటి వెంబడి ఒకటి వచ్చుచు

పోవుచు చక్రమువలె చుట్టిచుట్టి తిరుగు చుండును కాబట్టి విషయముల వలన గలుగు సుఖదుఃఖములను ఉత్పత్తి నాశములు గలుగు చుండును. అంతే, (శ్రుతి దుఃఖం సర్వమను స్మృత్య - కామభోగా - నివర్తయేత్ । అజం - సర్వ - మనుస్మృత్య - జాతం - నైవతు - పశ్యతి॥)— అనెడి గౌడపాదాచార్య వాక్యరీతిగా ప్రపంచమే దుఃఖరూపముగా నున్నదని విచారించి కామభోగములనుండి చిత్తమును త్రిప్పవలయును. అయితే సర్వప్రపంచమును బ్రహ్మరూపముగా భావించినయెడల ప్రపంచము గనబడదు, దుఃఖమున్ను కనబడదు.— (శ్లో॥ సుఖమాత్యంతికం - యత్ - తద్బుద్ధి గ్రాహ్య - మతీంద్రియమ్॥) అనునట్లు ఇంద్రియములచే యెఱుగబడిన సుఖము విషయసుఖ మన బడును. అట్టి విషయసుఖము మాయాసంబంధ మైనది గాన నశించిపోవును. మఱియు అట్టి విషయసుఖము మొదట సుఖముగా తోచినను కడకు దుఃఖరూపముగా నగును. అయితే ఇంద్రియములచే తెలియంబడనిదియు, శుద్ధసాత్త్విక బుద్ధిచే తెలియ దగినదియు యెన్నటికి నాశము లేనిదియును అగు సుఖమే బ్రహ్మానుభవసుఖ మన బడును.— (శ్రుతి యత్తత్ - సంవేద్యత్ - కించిత్ - తత్రాస్థా - పరివర్జనమ్ । అనాస్థైవహి - నిర్వాణం - దుఃఖమాస్థా - పరిగ్రహః॥) అనెడి మహోపనిషత్తు రీతిగా, దృశ్యవస్తువులందలి ఆశను విడిచిపెట్టుటే నిర్వాణసుఖ మనబడును. దృశ్య వస్తువులందు ఆశక్తి గలిగియుండుటే దుఃఖమనంబడును. కాబట్టి (శ్రుతి॥ ఆస్థామాత్ర - మనంతానాం - దుఃఖానా - మాకరం - విదుః । అనాస్థామాత్ర - మభితః - సుఖానా - మాలయంవిదుః॥) అనెడి మహోపనిషత్తు రీతిగా, ఆశయే దుఃఖమునకు కారణముగాను నిరాశయే సుఖమునకు కారణముగాను అగు చున్నది. (శ్రుతి॥ సంకల్పనం హి - సంకల్ప - స్స్వయమేవ - ప్రజాయతే । వర్ధతే - స్వయమేవాశు - దుఃఖాయ నసుఖాయ - యత్॥)— అనెడి మహోపనిషత్తు రీతిగా (సంకల్పము) అనగా తలంపులు, తనకు తానే పుట్టుచు తనకు తానే నానాటికి పెరుగుచుండును గాని కొంచమైనను నశింప జాలదు. కాబట్టి అట్టి (సంకల్పమే) అనగా తలంపులే దుఃఖరూపమగు చున్నది. (సంకల్పక్షయమే) అనగా తలంపులు నశించి పోవుటే సుఖరూప మగుచున్నది. కాబట్టి (శ్రుతి॥ నరసాయన - పానేన - నలక్ష్మ్యాలింగి తేనచ । నతథా - సుఖమాప్నోతి - సమేనాంతర్యథా జనః) అనెడి మహోపనిషద్వాక్య రీతిగా, అమృతపాన రసాయన పానములవల్లను, ధనమును సంపాదించుట వల్లను గలుగు సుఖములకంటెను చిత్తవిశ్రాంతివలన గలుగు సుఖము శ్రేష్ఠ మగుచున్నది. చిత్తవిశ్రాంతి వలన గలుగు సుఖము అమృతపానాదులవల్లను, ధనము సంపాదించుట వల్లను గలుగ జాలదు. (శ్లో॥ జాగ్రత్యా - మంతరాత్మా - విషయసుఖ కృతేనేక - యత్నాంశ్చ - కుర్వన్ । శ్రామ్యత్సర్వేంద్రియౌఘో - ఽధిగతమపి - సుఖం - విస్మరన్యాతి - నిద్రామ్ । విశ్రామో హ్యాత్మరూపే త్వతితర - సులభం - తేనచాతీంద్రియం - హి - సౌఖ్యం - సర్వోత్తమం స్యాత్ - పరిణతి - విరసా - దింద్రియోత్థాత్ -

(ఖ్యాచ్య॥)— అనెడి అధ్యాత్మ మీమాంస వాక్యరీతిగా, జాగ్రదవస్థ యందు పుష్పము పువ్వము చందనము స్త్రీలు వస్త్రములు ధనము సంగీతము మొదలగు విషయ సంబంధముల వలన కలుగు తుచ్ఛసుఖము నిమిత్తము అనేక ప్రయత్నములు చేయుచూ అట్టి అలసట చెందునట్టి ఇంద్రియ వ్యాపారముల వలన కలుగు విషయసుఖమును మఱచి, అసలట తీర్చుకొనుటకు గాను నిద్రించు చున్నాఁడు. అయితే బ్రహ్మానుభవము వలన కలుగు సుఖము ఇంద్రియ సంబంధము లేనిది గాన, అది అలసటను కలుగజేయ జాలదు. కాబట్టి తుదకు దుఃఖమును కలుగజేయునట్టి ఇంద్రియసుఖములకంటెను బ్రహ్మానుభవ సుఖమే మిక్కిలి శ్రేష్ఠమయినది సుమా.

## స్వర్గ మనగా నెట్టిది?

శ్రుతి॥ స్వర్గ - ఇతిచ॥ సత్సంసర్గః - స్వర్గః॥ నరక - ఇతిచ॥ అసత్సంసార - విషయ - జనన — సత్సంసర్గ ఏవ - నరకః॥

తా॥ స్వర్గమనగా నేమి? నరకమనగా నెట్టిది? అనగా సదానంద్రూప మగు పరబ్రహ్మమునందు జీవుఁడు ఐక్యమునుగోరి తద్రూపము గానుండు సకలైక్యసమాధియే స్వర్గ మనబడును. దేహేంద్రియాది ప్రపంచవిషయములందు మనస్సు కలిగి యుండుటే నరక మనబడును.

## బంధమోక్షము లనగా నేమి?

శ్రుతి॥ బద్ధ - ఇతిచ॥ అనాద్యవిద్య - వాసనయా - జాతో౽హ మిత్యాది - సంకల్పో - బంధః। పితృమాతృ - సహోదరదారాపత్య - గృహారామ - క్షేత్రాది - మమతా - సంసారావరణ - సంకల్పో - బంధః॥ కర్తృత్వాద్యహంకార - సంకల్పో - బంధః॥ అణిమాద్యష్టైశ్వర్యాశా - సిద్ధ - సంకల్పో - బంధః। దేవమనుష్యా - ద్యుపాసనా - కామ సంకల్పో - బంధః। యమాద్యష్టాంగ - యోగాభ్యాసాది - సంకల్పో - బంధః। వర్ణాశ్రమధర్మ - కర్మ - సంకల్పో - బంధః। ఆజ్ఞా - భయ - సంశయాత్మగుణ - సంకల్పో - బంధః। యజ్ఞవ్రత తపోదాన - విధివిధాన - జ్ఞాన - సంకల్పో - బంధః। కేవల - మోక్షాపేక్షా - సంకల్పో - బంధః। సంకల్పమాత్ర - సంభవో - బంధః॥ మోక్ష - ఇతిచ॥ నిత్యానిత్య - వస్తువిచారా — దనిత్యసంసార - సుఖదుఃఖ విషయ - సమస్త - క్షేత్ర మమతాది సమస్త - బంధ - సంకల్ప - క్షయో - మోక్షః॥

తా॥ బంధమనగా ఏది? అనగా, నేను అనాదిగా నుండునట్టి (అవిద్య) అనగా అజ్ఞానవాసనతో గూడుకొని పుట్టియున్నాను అనెడి సంకల్పమే బంధము. తల్లి తండ్రి సహోదరులు భార్యా బిడ్డలు గృహము తోటలు పంటభూములు మొదలైనవి ఇదినాది ఇదినాది అనెడి మమకారము కలిగి యుండుటే బంధము. నేను కర్తను నేను భోక్తను అనెడి సంకల్పమే బంధము. అణిమాది అష్టసిద్ధులను పొందవలయును అనెడి

సంకల్పమే బంధము, దేవతలను మనుష్యులను ఉపాసింప వలయునను నెడి సంకల్పమే బంధము. యమ నియమ ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధు లనెడి అష్టాంగ యోగాభ్యాసము చేయవలయు ననెడి సంకల్పమే బంధము. వర్ణాశ్రమములకు తగిన కర్మానుష్ఠానము చేయవలయు ననెడి సంకల్పమే బంధము ఆజ్ఞ భయము సంశయములు గలవా డనెడి సంకల్పమే బంధము, యజ్ఞములను వ్రతములను తపస్సును దానములను (యథావిధిని) అనగా శాస్త్రోక్తముగా చేయవలయు ననెడి సంకల్పమే బంధము, మోక్షాపేక్ష అనెడి సంకల్పమే బంధము. ఎట్లనగా —(శ్రుతిః బంధాస్థా - మథః - మోక్షస్థా - సుఖదుఃఖ - దశా మపి। త్యక్త్వా - సదసదాస్థాం త్వం - తిష్ఠాక్షుబ్ధ - మహాబ్ధివత్॥)— అనెడి మహోపనిషత్తురీతిగా, బంధ మోక్షములు రెండున్ను మనోధర్మములు గాన వాటినిన్ని సాంసారికమైనట్టి సుఖదుఃఖానుభవముల నున్ను విడిచి, అనగా బ్రహ్మస్వరూపుడనగు నాకు బంధమోక్షములు లేవు అని బంధ మోక్షభ్రాంతిలేనివాడై, నిస్తరంగ సముద్రమువలె సదా సంకల్ప శూన్యుడై స్వస్వరూప మాత్రముగా నుండవలయును గాన మోక్షాపేక్ష యనెడి సంకల్పమున్ను బంధమన బడును. సంకల్పమువల్లనే బంధముసిద్ధించును. అయితే మోక్షమనగా ఏది యనగా? నిత్యానిత్య వస్తువివేకము చేయుటవలన బ్రహ్మము నిత్యమనియు, శరీరాది ప్రపంచము సర్వము అనిత్య మనియును, దుఃఖస్వరూప మైనదనియును తెలిసి స్రక్చందన వనితాది సకలవిషయములను, ఇది నాది ఇది నాది యనెడి యభిమానమును విడిచి ఏదియును కోరక సకల సంకల్పములను నాశముచేసి, తాను నిర్వాసనాత్ముడన మనెడి బ్రహ్మనిష్ఠ యందుండుటే మోక్షమనబడును. ఇందుకు దృష్టాంతముగా చెప్పబడియుండు శ్రుతి వాక్యము లేమనగా.—(శ్రుతి దృశ్యం - నాస్తీతి - బోధేన - మనసో - దృశ్యమా ర్జనమ్। సంపన్నంచేత్ - తదుత్పన్నా - పరా - నిర్వాణ - నిర్వృతిః) అనెడి మహోపనిషద్వాక్యరీతిగా; దృశ్యప్రపంచము యెండమావులరీతిగా అసత్యమైనదియని ప్రపంచవిషయములందు ఆసక్తిలేక సదా నిరాశగా నుండుటే మోక్ష మనబడును. మఱియు—(శ్రుతి॥ అశేషేణ - పరిత్యాగో - వాసనానాం - య-ఉత్తమః। మోక్ష - ఇత్యుచ్యతే - సద్భి - స్సఏవ - విమలక్రమః — అనెడి మహోపనిషత్తురీతిగా లోక వాసన, శాస్త్రవాసన, దేహవాసన లనెడి వాసనాత్రయమును విడిచిపెట్టుటయే మోక్ష మనబడును.—(శ్రుతి దృశ్య—మాశ్రయ - సీదంచేత్ - తత్ - సచిత్తోసి-బంధవాన్। దృశ్యం - సంత్యజసీదంచేత్ - తదచిత్తోసి - మోక్షవాన్)— అనెడి మహోప నిషత్తురీతిగా, దృశ్యప్రపంచవిషయములను ఆశ్రయించినయెడల మనస్సు బలియముగా వృద్ధిపొందుచుండును, అట్లు మనస్సు వృద్ధిపొందుటవలన బద్ధుడగుచున్నా ననియును, దృశ్యప్రపంచముమీది ఆశను విడిచి పెట్టినయెడల మనస్సు తనకు తానే నశించును, అట్లు మనస్సు నశించుటవలన ముక్తుడగుచున్నా ననియును చెప్పబడియున్నది. కాబట్టి—(శ్రుతిః యత్తు - చంచలతా - హీనం - తన్మనో౽మృత - ముచ్యతే -

...దేవద - తప - శ్శాస్త్రసిద్ధాంతే - మోక్ష - ఉచ్యతే॥)—అనెడి మహోపనిషత్తు రీతిగా, మనస్సు చంచలములేక పరబ్రహ్మమునందు లయించి తద్రూపముగా నుండుటే మోక్షమనియును, తప స్సనియును సకలశాస్త్రములందును చెప్పబడియున్నది. (శ్రుతి। స్వసంకల్పవశాత్ - బద్ధో - నిస్సంకల్పా - ద్విముచ్యతే॥—అనెడి మహోపనిషత్తు రీతిగా, సంకల్పమువల్ల నే బంధము గలుగును, సంకల్పక్షయమువల్ల నే మోక్షముసిద్ధించును. (శ్రుతి। ఇచ్ఛామాత్ర - మవిద్యేయం - తన్నాశో - మోక్ష - ఉచ్యతే।) అనెడి మహోపనిషత్తురీతిగా, విషయము లందు ఇచ్ఛగలిగియుండుటే అజ్ఞాన మనబడును. అట్టి అజ్ఞానము నశించుటే మోక్షమనబడును.—(శ్రుతి॥ బాహ్యార్థ - వాసనోద్భూతా - తృష్ణా - బద్ధేతి - కథ్యతే। సర్వార్థ - వాసనోన్ముక్తా - తృష్ణా-ముక్తేతి - భణ్యతే॥)- అనెడి మహోపనిషత్తురీతిగా, ప్రపంచవిషయములగు చందనము, స్త్రీలు, పుష్పములు, ధనము, మొదలగువాటియందు ఆసగలిగియుండుటే బంధమనబడును. సకలవిషయము లందును నిరాశగలుగుటే మోక్షమనబడును. (శ్రుతి॥ భోగేచ్ఛా - మాత్రకో - బంధ। స్తత్త్యాగో - మోక్ష ఉచ్యతే॥) అనెడి మహోపనిషత్తురీతిగా, సంసారభోగములను కోరుటయే బంధము, అట్టి భోగములను విడిచిపెట్టుటె మోక్షము, (శ్రుతి॥ ప్రజ్ఞానమేవ - తద్ - బ్రహ్మ - సత్యప్రజ్ఞాన - లక్షణమ్। ఏవంబ్రహ్మ - పరిజ్ఞానాదేవ - మర్త్యోఽమృతో-భవేత్॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, బ్రహ్మమే ఆత్మయనియు, ఆత్మయే బ్రహ్మమనియు తెలిసి విషయములందు ఆశను విడిచి ఆత్మానుసంధానము చేయుటవల్ల నే మోక్షము సిద్ధించును. తక్కిన జపతపయాగవ్రతదానాదులవల్ల మోక్షము కలుగజాలదు.— (శ్రుతి॥ స్వరూపావ - స్థితిర్ముక్తి - స్తద్-భ్రంశోఽహం త్వవేదనమ్॥)- అనెడి మహోపనిషత్తురీతిగా, దేహేంద్రియములకు సాక్షిగానుండు ఆత్మయే పరబ్రహ్మమనియు, అట్టి పరబ్రహ్మమగు ఆత్మస్వరూపమే తా ననియు తెలిసి, సదా ఆత్మనిష్ఠ చేయుచు తద్రూపముగా నుండుటే మోక్ష మనబడును. శరీరము నేననెడి అహంకారమే బంధ మనబడును.—(శ్రుతి॥ సర్వంచాప్యహ - మేవేతి - నిశ్చయో - యోమహానతే। తమాదాయ - విషాదాయ - నభూయో - నాయతే మతిః॥) అనెడి మహోపనిషత్తు రీతిగా, నేనే పరబ్రహ్మమనియు, నాకంటెను అన్యముగా ప్రపంచలేదనియు, సర్వ ప్రపంచమున్ను నేనేఅనియు, నేను కోరదగినది ఏదియు లేదనియు, సర్వసంకల్ప సన్యము గావించి, సదాస్వ స్వరూపానుభవమునం దుండుటే మోక్షమనబడును.

## జీవన్ముక్తి విదేహముక్తి లక్షణము.

శిష్యా! ఇక జీవన్ముక్తి విదేహముక్తి యిట్టిదని తెలియజెప్పుచున్నాను, వినుము యిట్లనియె.—(1) జీవన్ముక్తియనగా (శ్రుతి॥ పురుషస్య-కర్తృత్వ - భోక్తృత్వ- సుఖదుఃఖాదిలక్షణః - చిత్తధర్మః - క్లేశరూపత్వాద్బంధో-భవతి। తన్నిరోధనం - జీవన్ముక్తిః॥) అనెడి ముక్తికోపనిషత్తురీతిగా, శిష్యా! (కర్తృత్వము) అనగా నేను

సకల కార్యములు చేయుచున్నానను అభిమానము. (భోక్తృత్వము) అనగా సకల కర్మ ఫలములను నేను అనుభవించుచున్నానను అభిమానము. ఇష్టవస్తువులు లభించుటవలన కలుగు సంతోషము సుఖమనబడును. ఇష్టవస్తువులను ఎడబాయుటవలన కలుగు సంతాపము దుఃఖ మనబడును. శిష్యా! చిత్తవృత్తియే ఈకర్తృత్వ భోక్తృత్వ సుఖ దుఃఖములకు ఆధారమగుటవలన ఇట్టి చిత్తవృత్తి జీవునకు (బంధము) అనగా ఉరివంటి దిగా నున్నది సుమా! (ముక్తి) అనగా విడిచిపెట్టుట అని యర్థము. (జీవన్ముక్తి) అనగా కర్తృత్వ భోక్తృత్వ సుఖదుఃఖములే స్వరూపముగా గల (చిత్తవృత్తిని) అనగా అభిమానమునున్ను, వాసనాశ్రయమునున్ను, తాను జీవుడనెడి భ్రాంతినిన్ని ఈ మూటిని విడిచిపెట్టి తాను కేవల సాక్షిమాత్ర బ్రహ్మస్వరూపుడయి యుండుచు, లోకులకు తాను సంసారిగా నుండునట్లు కనబడుచుండుట జీవన్ముక్తి యనబడును.

(2) విదేహముక్తియనగా—(శ్రుతి॥ జీవన్ముక్తపదం - త్యక్త్వా - స్వదేహే - కాలసాత్కృతే । విశత్యదేహ - ముక్తత్వం - పవనోఽస్పందతామివ॥)—అనెడి మహోపనిషత్తురీతిగాను, మఱియు (శ్రుతి॥ ఉపాధి - వినిర్ముక్త - ఘటాకాశవత్ । ప్రారబ్ధక్షయాత్ విదేహముక్తిః॥)—అనెడి ముక్తికోపనిషత్తురీతిగాను, మఱియు (శ్రుతి॥ వాయు - రనిలమ - మమృత - మథేదం - భస్మాంతం - శరీరమ్)—అనెడి ఈశావాస్యోపనిషత్తురీతిగాను, శిష్యా! ఘటము నశించినతోడనే ఘటాకాశము మహాకాశమునందు ఐక్యమగుచు ఏకమయినట్లు, ప్రారబ్ధకర్మము నశించినతోడనే దానితోగూడా స్థూల సూక్ష్మ కారణ దేహము లనెడి ఉపాధిత్రయము నశించి, జీవన్ముక్తుడగు జ్ఞానియొక్క జీవాత్మ, సర్వపరిపూర్ణ మగు పరబ్రహ్మమునందు ఐక్యమగుచు, ఏకమై జననమరణరహితమై నిలుచుటే విదేహముక్తి యనియు, విదేహకైవల్యమనియు, నిజమోక్ష మనియు చెప్పబడును.

## గురు డనగా నెవడు?

శ్రుతి॥ ఉపాస్య - ఇతిచ॥ సర్వశరీరస్థ - చైతన్యబ్రహ్మ ప్రాపకో - గురు రుపాస్యః॥

తా॥ (ఉపాస్యము) అనగా ఉపాసింపదగినది యేదియనగా? (శ్రుతి॥ నిత్యానందం - పరమసుఖదం - కేవలం - జ్ఞానమూర్తిం । విశ్వాతీతం - గగనసదృశం - తత్త్వమస్యాది - లక్ష్యమ్ । ఏకం - నిత్యం - విమల మచలం - సర్వధీ । సాక్షిభూతం । భావాతీతం - త్రిగుణరహితం - సద్గురుం - తం - నమామి॥)—అనెడి శుకరహస్యోపనిషత్తురీతిగా, పిపీలికాది బ్రహ్మదేవుడు పర్యంతము సకలజీవ జంతువుల హృదయములయందు సర్వసాక్షిగా వ్యాపించియుండు పరబ్రహ్మమగు శుద్ధచైతన్యమే పరమాత్మయనబడును, అట్టి పరమాత్మయే గురు డనబడును. అట్టి గురుబ్రహ్మమునే ధ్యాసించుచుండవలయును గాన ఆ గురుబ్రహ్మమే ఉపాస్య మనబడును.

## శిష్యు డనగా నెవడు?

శ్రుతి॥ శిష్య - ఇతిచ॥ విద్యాధ్వస్త - ప్రపంచావగాహిత - జ్ఞానా వశిష్ట - బ్రహ్మైవ - శిష్యః॥

తా॥ శిష్యుడనగా ఎవడు? ఒక్కొక్క జీవజంతువుయొక్క హృదయమునందు సాక్షిగా వ్యాపించియుండు (పారమార్థిక జీవుడే) అనగా, కేవల జ్ఞానమాత్రస్వరూపియగు ప్రత్యగాత్మ యనెడి బ్రహ్మమే శిష్యుడనబడును.

## జ్ఞానియే విద్వాంసు డనబడును.

శ్రుతి। విద్వానితిచ॥ సర్వాంతరస్థ- స్వసంవిద్రూప- విద్విద్వాన్।

తా॥ విద్వాంసు డనగా ఎవడు? ఆత్మస్వరూపమును తెలిసినవాడే విద్వాంసు డనబడును.—(శ్రుతి॥ అపివర్ష -సహస్రాయు- శ్శాస్త్రాంతం-నాధిగచ్ఛతి। విజ్ఞేయోక్షర తన్మాత్రో- జీవితం- చాపి- చంచలమ్। విహాయ - శాస్త్రజాలాని - యత్సత్యం- తదుపాస్యతామ్) అనెడి పైంగలోపనిషత్తురీతిగా, లోకమునందు సముద్రమురీతిగా అనేక శాస్త్రములు అపారముగా నున్నవి. లోకమునందు ఒక్కొక్క మనుష్యుడున్ను వేయి సంవత్సరముల వఱకు జీవించియుండుచు శాస్త్రములను చదువుచుండినను, అప్పటికిన్ని శాస్త్రసంపూర్తి గాజాలదుగాన, శాస్త్రవాసనను విడిచిపెట్టి మన జీవితకాలము స్వల్పముగాను, మఱియు తామరాకునందలి జలబిందువులవలె చంచలమైనదిగా నుండుటవల్లను అధ్యాత్మవిచారణ చేయుచు, సదా ఆత్మానుసంధానము చేయువాడే విద్వాంసుడు అనబడును గాని, అమరకాండత్రయము, పంచమహా కావ్యములు, వ్యాకరణశాస్త్రము, ఛందస్సు, జ్యోతిషము, వైద్యశాస్త్రము మొదలగు శాస్త్రములు చదివినవాడు విద్వాంసుడు గాజాలడు. ఆత్మజ్ఞానియే విద్వాంసుడనబడును. ఆత్మజ్ఞానిలక్షణము యెట్టిదనగా:—(శ్రుతి॥ తమేవ-భుక్తవిరసం- వ్యాపారౌఘం-పునఃపునః। దివసేదివసే- కుర్వన్-ప్రాజ్ఞః- కస్మా-న్న- లజ్జతే)—అనెడి మహోపనిషత్తు రీతిగా, బ్రహ్మానుభవప్రాప్తివలన విరసముగానుండు సంసార సంబంధమగు వ్యాపారములను ప్రతిదినమున్ను మళ్ళి మళ్ళి చేయుటకు సిగ్గుపడునట్టివాడే జ్ఞాని యనబడును.—(శ్రుతి॥ నిర్మందరమివాంభోధిః- సతిష్ఠతి యథా-స్థితః) అనెడు మహోపనిషత్తు రీతిగా, చలనము లేనట్టి నిస్తరంగ సముద్రమువలె సకలతలంపులు నశించి అచంచలముగా ఆత్మానుభవమందుండు వాడే జ్ఞాని యనబడును. (శ్రుతి॥ బద్ధముక్తో- మహీపాలో - గ్రాసమాత్రేణ తుష్యతి। పరైరబద్ధో - నాక్రాంతో - నరాష్ట్రం - బహుమన్యతే।) అనెడి మహోపనిషత్తు రీతిగా, శత్రువులచే జయింపబడి కారాగృహమునం దుంచబడిన రాజు, ఆ చెఱసాల యందుండి విడువబడిన యెడల అతడు ఆకలికి దొరకిన ఆహారములో తృప్తిపొంది సంతోషించును. అయితే శత్రువులచే జయింపబడనట్టి రాజు, అనగా పట్టాభిషిక్తుడై రాజ్యమేలుచుండు రాజు, తనకు [illegible] రాజ్యము దొరకినను చాలునని తృప్తి

పొంది సంతోషింపడు. అట్లు ప్రపంచము అసత్యమని తెలిసి ఆశను విడిచిన జ్ఞాని దైవా
ధీనముగా తనకు ఏది దొరికినప్పటికిన్ని దానితో తృప్తిపొంది సంతోషించును. విశే
ప్రపంచమును సత్యమని నమ్మియుండు అజ్ఞాని, తనకు యెంత సంపద గలిగియున్నను
తృప్తిపొందక పేరాశ గలవాడయి విషయభోగములందు విరక్తి పొందక సదా విషయ
భోగములనే కోరుచుండును. (శ్రుతి॥ అనాగతానాం- భోగానా-మవాంఛన- మకృత్రి
మమ్ । ఆగతానాంచ సంభోగ-ఇతి-పండిత-లక్షణమ్) అనెడి మహోపనిషత్తు రీతిగా
తనకు లభించని భోగములను కోరక, దైవాధీనముగా తనకు లభించిన భోగములను అను
భవించు చుండువాడే పండితుడనియూ, జ్ఞానియనియూ చెప్పబడును. (శ్రుతి॥ నత్యజంతి
నవాంఛంతి- వ్యవహారం- జగద్గతమ్ । సర్వమేవాను - వర్తంతే - పారావార - విదో -
జనాః॥) అనెడి మహోపనిషత్తు రీతిగా, ప్రారబ్ధకర్మానుసారముగా సంభవించిన దుఃఖ
ములను విడిచిపెట్టక, సుఖంబులను ఆశించక, సదా సమభావన గలిగి ఆత్మానుసంధా
నము చేయువాడే జ్ఞాని యనబడును. (శ్రుతి॥ మనసో - నిగృహీతస్య - లీలా- భోగోల్ప
కోపి-యః । తమేవాలబ్ధ - విస్తారం- క్లిష్టత్వాత్ - బహుమన్యతే॥)— అనెడి మహోప
నిషత్తు రీతిగా, మనోజయము గలిగి విషయ సుఖములందు విరక్తుడయిన జ్ఞాని ప్రాప్తాను
సారముగా విషయభోగములు కొంచెముగా లభించినను దానిని కొండంత గొప్పగా
తలంచును.—(శ్రుతి॥ అసంకితాపి - సంప్రాప్తా - గ్రామయాత్రా - యథాధ్వగైః ।
ప్రేక్ష్యతే - తత్వదేవ - జ్ఞైర్భోగశ్రీ - రవలోక్యతే)—అనెడి మహోపనిషత్తు రీతిని
ఒక బాటసారి తన గ్రామమునకు పోవలయుననెడి సంకల్పము లేకనే గ్రామయాత్ర
చేయుచు నడిచి పోవుచుండునట్లు, బ్రహ్మజ్ఞానులు సకల భోగసంపదలందు దృష్టి
యుంచకనే వాటిని అనుభవించు చుందురు.—(శ్రుతి॥ అయంబంధు - రయం నేతి -
గణనా - లఘుచేతసామ్ । ఉదార - చరితానాంతు - వసుధైవ - కుటుంబకమ్॥) అనెడి
మహోపనిషత్తు రీతిగా, వీడు బంధువు, వీడు బంధువుగాడు అనెడి భేదభావన గల
వాడే అజ్ఞాని లోకమునందలి సకల జనులను జ్ఞాని తన బంధువులుగ జూచును.—
(శ్రుతి॥ స-బాహ్యాభ్యంతరే - దేహే - హ్యథ - ఊర్ధ్వంచ - దిక్షుచ । ఇత - ఆత్మా-
తతో హ్యాత్మా - నాస్త్యనాత్మ- మయం - జగత్ ।)—అనెడి మహోపనిషత్తు రీతిగా
ఈ జగత్తులోపల వెలుపల దేహమునందు క్రింద మీద నలుదిక్కు లందున్ను, ఇక్కడ
అక్కడ ఎక్కడను పరబ్రహ్మమగు ఆత్మయే పరిపూర్ణముగా నిండి వ్యాపించియున్నది
గాని, ఆత్మమయముగాని జగత్తు కొంచెమయినను లేదని సర్వజగత్తును బ్రహ్మమయ
ముగా జూచువాడే జ్ఞాని యనబడును. — (శ్రుతి॥ ప్రాప్తకర్మ - పరోనిత్యం - శత్రు
మిత్ర - సమానదృక్ । ఈహితానీహితై - ర్ముక్తో - నశోచతి - న కాంక్షతి॥)—
అనెడి మహోపనిషత్తు రీతిగా, సదా వర్ణాశ్రమమునకు దగిన సత్కార్యములను జేయుచు
రాగద్వేషములు లేనివాడై శత్రువును స్నేహితుని సమముగా జూచుచు, ప్రియాప్రియ
ములు లేనివాడై లేనివస్తువులను కోరక, నష్టమయినదానికి దుఃఖించక, సదా బ్రహ్మ

నంద స్వరూపుడై యుండువాడే జ్ఞాని యనబడును.—(శ్రుతి॥ అవిశేషేణ - సర్వంతు యఃపశ్యతి - చిదన్వయాత్ । సఏవ - సాక్షాద్ - విజ్ఞానీ- స శ్శివ- స్సహరి ర్విధిః॥)- అనెడి మహోపనిషత్తు రీతిగా, ఈ ప్రపంచము సర్వమున్ను బ్రహ్మస్వరూపమని అభేదజ్ఞానము గలిగినవాడే జ్ఞానియనబడును. అజ్ఞానియే శివుడు. అతడే విష్ణువు. అతడే బ్రహ్మ యనబడును సుమా?—(శ్రుతి॥ లక్ష్యాలక్ష్య- గతిం- త్యక్త్వా-యస్తిష్ఠేత్ - కేవ లాత్మనా । శివ- ఏవ స్వయం- సాక్షాదయం- బ్రహ్మ విదుత్తమః॥)—అనెడి మహోప నిషత్తు రీతిగా, (లక్ష్యాలక్ష్యములను) అనగా మానసిక సంబంధమగు సమాధి విక్షేపము లను లేనివాడై సదా (స్వస్వరూపముగా) అనగా కేవల జ్ఞప్తిమాత్ర స్వరూపుడుగా, స్థితప్రజ్ఞుడుగా నుండువాడే జ్ఞాని యనబడును అతడే సాక్షాత్తు పరమశివుడు—(శ్రుతి॥ నాహం-నచాన్యదస్తీహ- బ్రహ్మైవాస్మి-నిరామయమ్ । ఇత్థం-సదసతోర్మధ్యే-యః పశ్యతి॥-స పశ్యతి॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, దేహేంద్రియాదులు నేను గాను, అహంకారము నేనుగాను, బ్రహ్మము వినా యిక్కడ ఏమియు లేదు, ఆత్మస్వరూపుడ నగు నేనే పరబ్రహ్మము అని యిట్లు నిశ్చయము గలిగి (సదసత్తులమధ్య అనగా కార్య కారణములకు మధ్యను వుండువాడే తన్ను తానెఱిగిన బ్రహ్మజ్ఞాని యనబడును.—(శ్రుతి॥ శ్రుత్వా-స్పృష్ట్వాచ- భుక్త్వాచ- దృష్ట్వా-జ్ఞాత్వా- శుభాశుభమ్ । నహృష్యతి- గ్లాయతి-యస్స-శాంత-ఇతి-కథ్యతే॥)—అనెడి మహోపనిషత్తు రీతిగా, ఎవడు శుభ మైన విషయములను అశుభమయిన విషయములను వినియు స్పృశించియు అనుభవించియు చూచియు తెలిసియు, సంతోషించక దుఃఖించక వుండునో వాడే శాంతుడు, జ్ఞాని అనబడును.-(శ్రుతి॥ తుషారకర- బింబాచ్ఛం-మనోయస్య-నిరాకులమ్। మరణోత్సవయుద్ధే షు స శాంత - ఇతి-కథ్యతే ) అనెడి మహోపనిషత్తురీతిగా, మరణమువందును పెండ్లి మొదలగు సంతోషమైన కార్యములందును, యుద్ధము మొదలగు దానియందును, ఎవనికి మనస్సు సుఖదుఃఖములను జెందక పూర్ణచంద్రబింబమువలె నిర్మలముగా

## శాంతునిలక్షణము.

నుండునో అతడే జ్ఞానియనియు, శాంతు డనియు చెప్పబడును.—(శ్రుతి॥ తపస్విషు - బహుజ్ఞేషు - యాజకేషు - నృపేషుచ । బలవత్సు - గుణాఢ్యేషు - శమవానేవ - రాజతే ) అనెడి మహోపనిషత్తురీతిగా, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు చేయు వారికంటెను, నాలుగు వేదములు ఆరుశాస్త్రములు పదునెనిమిది పురాణములు తెలిసిన వారికంటెను, అశ్వమేధ రాజసూయాది యజ్ఞములను చేయువారికంటెను, రాజనీతి తెలిసి రాజ్యమేలుచుండు చక్రవర్తులకంటెను, దేహబలము శాస్త్రబలము బుద్ధిబలము గలవారికంటెను, సద్గుణములు గల గుణవంతులకంటెను (శాంతుడే) అనగా సుఖదుః ఖములందు సమభావన గలిగి సదా బ్రహ్మానంద సాగరమున మునిగి యుండు జ్ఞానియే

## నిత్యతృప్తుని లక్షణము.

గొప్ప.—(శ్రుతి॥ సంతోషామృత - పానేన - యే శాంతా - స్తృప్తిమాగతాః। ఆత్మారామా - మహాత్మాన - స్తే మహోపద - మాగతాః॥)—అనెడి మహోపనిషత్తు రీతిగా, బ్రహ్మనిష్ఠను చేయుచు బ్రహ్మానంద అమృతపానముచేసి (తృప్తులైనవార) అనగా మనస్సును సంకల్పశూన్యముగా చేయువారే మహాత్ము లనియు, జీవబ్రహ్మైక్య

## నిత్యసంతుష్టుని లక్షణము.

పదవిని సాక్షాత్కారముగా పొందినవారనియు, జ్ఞానులనియు చెప్పబడును.—(శ్రుతి॥ అప్రాప్తంహి - పరిత్యజ్య - సంప్రాప్తే - సమతాం - గతః। అదృష్ట - ఖేదాఖేదో - యస్స - తుష్ట ఇతి - కథ్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, తనకు లభించని వస్తువులందు దుఃఖమును, లభించిన వస్తువునందు సంతోషమును లేనివాడై సదా సమదర్శనము గలిగి ఆత్మానుసంధానము చేయువాడే నిత్యసంతుష్టు డనియు, జ్ఞానియనియు చెప్పబడును. (శ్రుతి॥ నాభినందత్య - సంప్రాప్తం - ప్రాప్తం - భుక్త్వా - యథేప్సితమ్। యస్స - సౌమ్య - సమాచారః - సంతుష్ట - ఇతి కథ్యతే॥) అనెడి మహోపనిషత్తురీతిగా, తనకు దొరకని వస్తువులకుగాను దుఃఖించక, తనకు ప్రాప్తానుసారముగా దొరికినవస్తువులను అనుభవించుచు సదా ఆత్మధ్యానమును చేయువాడే జ్ఞాని (శ్రుతి॥ నేహంతే - ప్రకృతాదన్యత్ - రమంతే - శిష్టవర్త్మని। ఆకృత్యైవ - విరాజంతే - మైత్రాది - గుణవృత్తిభిః॥) అనెడి మహోపనిషత్తురీతిగా, అప్పటప్పటికి శరీరపోషణకుగాను కావలసిన ఆహారాదులను తప్ప మఱి దేనియు కోరక, సన్మార్గమునందు సంచరించుచు సదా మైత్రి, జీవదయ, సంతుష్టి, నిరాశ మొదలగు సద్గుణములు గలిగి స్వరూపానుసంధానము చేయువారలే జ్ఞాను లనబడుదురు.

## మూఢు డెవడు.

శ్రుతి॥ మూఢ - ఇతిచ॥ దేహ - వర్ణాశ్రమ - కర్తృత్వ - భోక్తృత్వా - ద్యహంకార - భావనారూఢో - మూఢః॥

తా॥ మూఢు డనగా ఎవ డనగా? దేహేంద్రియములే నేననియు, నాకు జాతి ఆచారము ఆశ్రమములు గల దనియు, కర్తృత్వ భోక్తృత్వ అహంకారము గలవాడై సకల కర్మములు చేయుచుండువాడే మూఢుడు. మఱియు (శ్లో॥ సంత్యజ్య- హృద్గుహేశానం- దేవమన్యం- ప్రయాంతి- యే। తే- రత్న-మభివాంఛంతి- త్యక్త్వా-హస్తస్థ-కౌస్తుభం॥) అనెడి మహోపనిషత్తు రీతిగా, తనశరీరమునందు వసించుచుండు ఆత్మారాముని తెలిసికొనలేక, దేవుడు ఎక్కడనో వున్నాడని దేశదేశములను తిరుగుచు వెదకుచుండువాడు, చేతనున్న దేవరత్నమైనట్టి జీవరత్నమగు కౌస్తుభమణినివిడిచిపెట్టి తక్కినరత్నములనుకోరి వెదకుచుండు మూఢునితో సమానుడగుచున్నాడు. (శ్రుతి॥ భేదదృష్టి-రవిద్యేయం-సర్వదా-తాం-విసర్జయేత్। మునేన సాద్యతే-తద్ధి-పదమత్రయ-ముచ్యతే॥)

అనెడి మహోపనిషత్తురీతిగా, జీవుడు వేఱు దేవుడు వేఱు అని భేదముగా నెంచుటే అవిద్యయనియు, అజ్ఞానమనియు చెప్పబడును. కాబట్టి అట్లు జీవుడు వేఱు దేవుడు వేఱు అని తలంచువాడే మూఢుడు. (శ్రుతి॥ అనాత్మన్యాత్మ- భావేన- కిమజ్ఞ- ఇతరో జిషి॥)— అనెడి మహోపనిషత్తురీతిగా, దేహేంద్రియసాక్షిగా నుండు ఆత్మయే తానని తెలియక దేహేంద్రియంబులే తానని భావించువాడే మూఢుడు. (శ్రుతి ప్రాయత్త - మేకాంత హితం-స్వేప్సితత్యాగ- వేదనమ్ । యస్య- దుష్కరతాం- యాతం-ధిక్-తం- పురుషకీటకమ్॥) అనెడి మహోపనిషత్తు రీతిగా, ప్రపంచంబున ప్రచ్ఛందన వనితాది విషయంబులందు ఆశలేక, సదా బ్రహ్మానుసంధానము చేయువాడే జ్ఞాని, అట్లుగాక సదా విషయవాంఛ గలవాడు యెంతగొప్పవాడయినను అల్పమయిన ఒక పురుగులో సమానమయినవాడు, వాడే మూఢుడు. (శ్రుతి తరవోపి-హి-జీవంతి-జీవంతి-మృగపక్షిణః । సజీవతి మనోయస్య- మననే-నోపజీవతి ) అనెడి మహోపనిషత్తు రీతిగా, స్వరూపానుసంధానమిట్టిదని తెలియ నేరనివాడు, చెట్లు మృగములు పక్షులు మొదలగువానితో సమానుడే గాని, మనుష్యుడుగా పుట్టియుండియు మనుష్యుడు గాజాలడు. (శ్రుతి। ప్రాప్యం సంప్రాప్యతే-ఏన- భూయో-యేన-నశోచ్యతే । పరాయా-సర్వ్రతే- స్థానం- యత్రజీవితముచ్యతే) అనెడి మహోపనిషత్తు రీతిగా, మోక్షాపేక్ష గలిగి దానికితగినట్టి ఉపాయమును తెలిసి సాధించనివాని జన్మము వృధాజన్మముగన అట్టివాడే మూఢుడు. (శ్రుతి॥ జాతాస్త ఏవ-జగతి-జంతవ-స్సాను-జీవితాః । యేపునర్నే హా-జాయంతే- శేషా-జరత-గర్దభాః॥) అనెడి మహోపనిషత్తు రీతిని ఆత్మజ్ఞానులే మహనీయులు. తక్కిన వారు చాకలివాని పనికిగూడ ఉపయోగించని ముసలిగాడిదలతో సమానులు. (శ్రుతి॥ భారో ఽవివేకిన-శ్శాస్త్రం-భారో-జ్ఞానంచ-రాగిణః । అశాంతస్య-మనో భారో ఽనాత్మవిదో-వపుః ) అనెడి మహోపనిషత్తు రీతిగా, అవివేకికి శాస్త్రము భారముగా నుండును. విషయాసక్తి గలవానికి జ్ఞానము భారముగా నుండును. శాంతము లేనివానికి మనస్సు భారముగా నుండును. ఆత్మజ్ఞానము లేనివానికి శరీరము భారముగా నుండును గాన, ఈ నలుగురున్ను మూఢులు.

## ఆ సు ర ల క్ష ణ ము.

శ్రుతి॥ ఆసుర-ఇతిచ॥ బ్రహ్మవిష్ణ్వీశా- నేంద్రాదీనా-మైశ్వర్య-కామనయా-నిరశన- జపాగ్నిహోత్రాదిషు- అంతరాత్మానం - సంతాపయ- న్నాచరంత - మత్యుగ్ర-రాగద్వేష- హింసా-డంభా ద్యపోషితమ్- తప ఆసురమ్॥

తా. ఆసుర సంబంధమయిన తపస్సు ఎట్టిదనగా॥ డంభము అహంకారము జీవహింస అసూయ కోపము మొదలగు దుర్గుణములు గలిగి ప్రపంచభోగ వస్తువులందు మిక్కిలి ఆశ గలిగి బ్రహ్మ విష్ణు మహేశ్వర దేవేంద్రాదులు అయిశ్వర్యములను గోరి వారివలన వరములను పొంది సకలభోగములను అనుభవింప వలయునని కోరికతో

వారిగుఱించి ఉపవాసము లుండుచు అన్నపానాదులను విడిచిపెట్టి శరీరమును కష్టపెట్టి జీవాత్మను పీడించి ఘోరమయిన తపస్సులను చేయుటయే అసుర సంబంధమయిన తపస్సనబడును. అట్టి ఆసురతపస్సువలన జననమరణములు గలుగును. (శ్రుతి॥ ఆత్మానంచే ద్విజానీయా-దయమస్మీతి-పూరుషః। కిమిచ్ఛన్ కస్య కామాయ-శరీర-మనుసంజ్వరేత్.) అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగా, సర్వమున్ను పరబ్రహ్మ మనియును, అట్టి బ్రహ్మమే ఆత్మ యనియును, అట్టి ఆత్మస్వరూపుడగు తానే సర్వమనియును, కాబట్టి తన కన్య మేమియు లేదనియును తెలిసి సంకల్పరహితుడై సదా ఆత్మానుసంధానము చేయుచుండునట్టి జ్ఞాని, తనకు ఏకోరికలున్ను లేదు గాన, ఆత్మనిష్ఠను తప్ప బ్రహ్మరుద్రేంద్రాది దేవతలను ఉపాసింపజాలడు, వారి ఐశ్వర్యములనున్ను కోరజాలడు, వారి వరప్రసాదములను గోరి అన్నపానాదులను విడిచి దేహమును కష్టపెట్టి జీవాత్మను పీడించి ఉగ్రమైన తపస్సులను చేయజాలడు

## జ్ఞా న త ప స్సు ల క్ష ణ ము

శ్రుతి॥ - ఇతిచ॥ బ్రహ్మసత్యం - జగన్మిథ్యేత్యపరోక్ష -। జ్ఞానాగ్నినా -బ్రహ్మదైశ్వర్యాశా - సిద్ధ - సంకల్పబీజ - సంతాపరూపం - తపః॥

. తా॥ నిజమైన తపస్సు ఏది యనగా॥ పరబ్రహ్మము సత్యమైనదనియును, జగత్తు అసత్యమైనదనియును, బ్రహ్మమే ఆత్మ యనియును తెలిసి అపరోక్షజ్ఞానము గలిగి సదా ఆత్మానుభవనిష్ఠ యందుండుచు, బ్రహ్మరుద్రేంద్రాది దేవతల పదవులను ఐశ్వర్యములను పొందవలయునని కోరుచుండు ఆశ యనెడి విత్తనము జ్ఞానాగ్నియందు భస్మము గావించుటే నిజమైన తపస్సనబడును మఱియు, (శ్రుతి॥ అహింసాతు - తపో యజ్ఞో - వాఙ్మనః కాయ - కర్మభిః) అనెడి సాట్యాయనియోపనిషత్తురీతిగా మనోవాక్కాయము లనెడి త్రికరణశుద్ధిగా జీవకారుణ్యము గలిగి స్వప్నేపి జీవహింస చేయ

## త్రి వి ధ జ్ఞా న త ప స్సు లు.

కుండుటే తపస్సనియు, యజ్ఞమనియు చెప్పబడును. మఱియు, (1) శ్లో॥ దేవ-ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం - శౌచమార్జవమ్। బ్రహ్మచర్య - మహింసాచ-శారీరం-తప - ఉచ్యతే॥) అనెడి శ్రీభగవద్గీతావాక్యరీతిగా, శిష్యా! హరిహరాది దేవతలను, వేదాంత వేత్తలయిన బ్రాహ్మణులను, సద్గురువును, బ్రహ్మజ్ఞానులను పూజించుటయున్ను, గంగా గోదావరీ కృష్ణా తుంగభద్ర కావేరి మొదలగు పుణ్యనదీస్నానమును మనఃపూర్వకముగా చేయుటయున్ను, సదాచారమున్ను బ్రహ్మచర్యమున్ను (అహింసా వ్రతమున్ను అనగా జీవహింస చేయకుండుటయున్ను ఇవి యన్నియు శరీరసంబంధముగు తపస్సు అనబడును. (2) శ్లో॥ అనుద్వేగ-కరంవాక్యం - సత్యం - ప్రియహితంచ-యత్। స్వాధ్యాయా - భ్యసనం చైవ - వాఙ్మయం - తప - ఉచ్యతే॥) అనెడి శ్రీభగవద్గీతా వాక్యరీతిగా, శిష్యా! ఇతరులను దూషింపకుండుట, సత్యమాడుట, ప్రియమును హితమును అగునట్లుగా మాట్లాడుట, వేద వేదాంత శాస్త్రములను జదువుట

నదియున్నియు వాక్సంబంధమైన తపస్సనబడును, (3) శ్లో॥ మనః ప్రసాద - స్సౌమ్యత్వం - మౌన - మాత్మ - వినిగ్రహః । భావసం శుద్ధి - రిత్యేతత్ - తపో - మానస - ముచ్యతే॥) అనెడి శ్రీభగవద్గీతా వాక్యరీతిగ, (మనోనిర్మలత్వము) అనగా కామక్రోధాదులు లేకుండుట, (సౌమ్యత్వము) అనగా ఇతరులయొక్క మేలు కోరుచుండుట, (మౌనము) అనగా మనస్సుచే వాక్కును కట్టుట, (ఆత్మవినిగ్రహము) అనగా మనోవృత్తిని ధ్యానింపవలసిన విషయమునందు నిలుపుట, (భావశుద్ధి) అనగా పరబ్రహ్మమగు ఆత్మస్వరూపమును ధ్యానించుచు దానికంటెను అన్యములైన దేహేంద్రియాది ప్రపంచవిషయములను చింతింపకుండుట ఇవి యన్నియు మనోసంబంధమగు తపస్సనబడును. ఇట్టి త్రివిధ జ్ఞానతపస్సులను చేయువాడే జ్ఞాని యనబడును గాని, (శ్లో॥ అశాస్త్ర - విహితం - ఘోరం - తప్యంతే - యే - తపోధనాః । దంభాహంకార - సంయుక్తాః - కామరాగ - బలాన్వితాః కర్శయంత-శ్శరీరస్థం-భూతగ్రామ-మచేతసః । మాం చైవాంత - శ్శరీరస్థం - తాన్ - విద్ధ్యాసుర - నిశ్చయాన్॥) అనెడి శ్రీభగవద్గీతా వాక్యరీతిగా, వనవాసము చేయుచు, పంచాగ్ని మధ్యంబునఁ గూర్చుండుచు, ఎండకు వానకు చలికి ఓర్చుచు, అన్నపానాదులను వర్జించి దంభాహంకారములు కామక్రోధ ఈర్ష్యాసూయలు గలవాడై జీవుని దుఃఖపెట్టి దేహము శుష్కించునట్లుగా పీడించి, ఒంటికాలితో నిలుచుకొని వరములను కోరి దేవతలను ఉపాసించుచు, కామ్యతపస్సు చేయువాడు జ్ఞాని గాజాలడు, వాని తపస్సున్ను తపస్సు గాజాలదుసుమా? అట్టి కామ్యకర్మమగు ఉగ్రతపస్సువలన మోక్షమున్ను గలుగజాలదు సుమా?

### పరమపదమనగా ఎట్టిది?

శ్రుతి॥ పరమపద మితిచ॥ ప్రాణేంద్రియా- ద్యంతఃకరణ- గుణాదేః- పరతరం । సచ్చిదానందమయ- సర్వసాక్షికం । నిత్యముక్త- బ్రహ్మస్థానం పరమపదమ్॥

తా॥ పరమపద మనగా ఏది? ప్రాణము దశేంద్రియంబులు అంతఃకరణము సత్త్వాదిగుణములు మొదలగు వానికంటెను శ్రేష్ఠముగానున్న, సచ్చిదానంద స్వరూపముగానున్న, సర్వసాక్షిగానున్న ఉండునట్టి స్వస్వరూపమును ఆశ్రయించి యుండు నిత్యముక్త బ్రహ్మస్థానమే పరమపద మనబడును. ఇందుకు ప్రమాణము ఏమనఁగా.— (శ్రుతి॥ చేతసో- యదకర్తృత్వం- తత్సమాధాన- మీరితమ్ । తదేవ- కేవలీభావం- సా- శుభా-నిర్వృతిః- పరా॥) అనెడి మహోపనిషత్తు రీతిగా, కర్తృత్వ భోక్తృత్వ రూపమయిన మలినవాసన మనస్సునకు లేక, మనస్సు బ్రహ్మమందు లయించి బ్రహ్మాకారముగా నుండుటే సమాధి యనియు, కైవల్యమనియు, పరమపదమనియు చెప్పబడును, మఱియు, శ్లో॥ కేలీనాం- ఆనందానాం - సమూహః- కైలం । శేతే - ఆస్యతే- స్థీయతే- ఇతి- కైలాసః॥ అసు- ఉపవేశనే - ఇతి - ధాతుః ) అనునట్లు, (కేలి) అనగా ఆనందము, దానిగుంపు కైలము అనబడును. (కైలాసము) అనగా అఖండానంద పరిపూర్ణ

మయిక బ్రహ్మనిష్ఠాస్థానము; (శ్లో॥ కుంఠం - నాశం - వైకుంఠం - అవినాశస్థానమ్॥ అనునట్లు, (కుంఠమనగా) నశించునది, అనగా అజ్ఞానము, వైకుంఠము) అనగా నాశము లేనిది, అనగా జ్ఞానము; కాబట్టి జ్ఞానానుభవస్థితియే వైకుంఠ మనబడును. మరియు, (సత్యం-సదితి-కథ్యతే। సదేవ- సౌమ్య-ఇద మగ్ర- ఆసీత్॥ సద్ - బ్రహ్మ) అనునట్లు, సత్యమనగా, కాలత్రయమునందు నాశములేని పరబ్రహ్మము, అట్టి పరబ్రహ్మ మగు ఆత్మానుభవస్థానమే సత్యలోక మనబడును. (శ్రుతి॥ నీలతోయద- మధ్యస్థావిద్యుల్లేఖేవ-భాస్వర। నీవార-శూకవ త్తన్వీ-పీతాభా-స్యాదణూపమా। తస్యాః-శిఖాయాః- మధ్యే-పరమాత్మా-వ్యవస్థితః। స-బ్రహ్మ- స-శివ-స-హరి- సేంద్ర- సోఽక్షరః- పరమ స్స్వరాట్॥) అనెడి తైత్తిరీయోపనిషత్తు రీతిగా, నీలతోయదమధ్య మందుండు విద్యుల్లేఖ యనెడి అగ్నిశిఖామధ్యంబున పరమాత్మ వ్యాపించి యున్నాడు. ఆ పరమాత్మయే బ్రహ్మ విష్ణువు శివుడు ఇంద్రుడు మొదలయిన రూపములుగా నున్నాడు గాన. అట్టి పరమాత్మ స్థానమగు విద్యుల్లేఖ యగ్నిశిఖయే సత్యలోకము, కైలాసము, వైకుంఠము, పరమపదము, కైవల్యము, స్వర్గలోకము అనబడును.

## గ్రాహ్య మెట్టిది?

(శ్రుతి॥ గ్రాహ్యమితిచ॥ దేశ కాల వస్తు - పరిచ్ఛేద - రాహిత్య - చిన్మాత్ర - స్వరూపం - గ్రాహ్యమ్॥

తా॥ (గ్రాహ్యము) అనగా తెలుసుకోదగినది ఏది యనగా? దేశ కాలవస్తువు లనెడి త్రివిధ పరిచ్ఛేదములు లేనిదే? అనగా ఒకదేశమునం దున్నది ఒక దేశమునందు లేదనియును, ఒక కాలమునందున్నది ఒక కాలమునందు లేదనియును, ఒక వస్తువునం దున్నది ఒక వస్తువునందు లేదనియును చెప్పబడక సర్వదేశ సర్వకాల సర్వవస్తువు లందును సంపూర్ణముగ వ్యాపించి సర్వము తానై సర్వాధిష్ఠానమై జ్ఞానస్వరూపమై ఆత్మస్వరూపమై సర్వసాక్షిగా నుండు పరబ్రహ్మ మగు చైతన్యమును అవశ్యముగా తెలుసుకొని, సదా దానిని ధ్యానించుచు తత్స్వరూపముగా నుండవలసినది. ఇదియే (గ్రాహ్యము) అనగా తెలుసుకోదగినది—(శ్రుతి॥ శరీర - మస్థి - మాంసం - చ - త్యక్త్వా - రక్తాద్య శోభనమ్। భూతముక్తావళీ - తంతుం - చిన్మాత్ర - మవలోకయేత్॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, ఎముకలు మాంసము రక్తము మొదలగు సప్త ధాతుమయముగా శరీరమే నే ననెడి అభిమానమును విడిచిపెట్టి ముత్యాలహారమునందు వ్యాపించియుండు దారమువలె సర్వభూతములందును సాక్షిమాత్రముగా వ్యాపించి యుండు జ్ఞానస్వరూపమును తెలుసుకొని, అదియే నే నని తన్మయముగా నుండవలసి నది.—(శ్రుతి॥ అనాత్మతాం - పరిత్యజ్య - నిర్వికారో - జగత్ - స్థితౌ। ఏకనిష్ఠ తయాంతస్థ - స్సంవిన్మాత్ర - పరో భవ॥)—అనెడి మహోపనిషత్తురీతిని, దేహేంద్రియాదులు అనాత్మయనియు వాటియందలి అభిమానమును విడిచి, ఆ దేహేంద్రియాదు

...సాక్షిగానుండు యెఱుగుచుండు జ్ఞానస్వరూపమే ఆత్మ యని తెలిసి తన్మయముగా

## త్రివిధ ఆకాశములు.

...ంచును—(శ్రుతి॥ చిత్తాకాశం - చిదాకాశ - మాకాశం చ తృతీయకమ్ । ద్వాభ్యాం - శూన్యతరం - విద్ధి - చిదాకాశం - మహామునే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, చిత్తాకాశము, భూతాకాశము ఈ రెంటిని విడిచిపెట్టి, ఈ రెంటిని యేది యెఱుగుచున్నదో, ఆ తెలివియే జ్ఞానాకాశ మనియును ఆత్మయనియును బ్రహ్మ మనియును చెప్పబడును గాన, అట్టి శుద్ధ తెలివిని తెలుసుకొని అది తానై యుండవలె

## చిదాకాశ మనగా ఏది?

...యును—(శ్రుతి॥ దేశాద్దేశాంతర - ప్రాప్తౌ - సన్నిధౌ - మధ్యమేవ - యత్ । నిమేషేణ - చిదాకాశం - తద్విద్ధి - మునిపుంగవ॥) అనెడి మహోపనిషత్తురీతిగా, చిత్తము ఒక నిముషములోపల ఒక చోటునుండి మఱియొక చోటునకు వ్యాపించు చుండును, అట్లు ఒక చోటునుండి మఱియొక చోటునకు చిత్తము వ్యాపించుచుండగా, మధ్య విజ్ఞానము మధ్యస్థముగా నుండునో, ఆ జ్ఞానమే చిదాకాశ మనబడును, కాబట్టి మనోవృత్తులయొక్క ఉదయోదయములకు మధ్య సాక్షిగానుండు జ్ఞానమే చిదాకాశ మనబడును గాన, అది నీవని తెలిసి తద్రూపముగా నుండుము.—(శ్రుతి॥ తస్మిన్ - నిరస్త - నిశ్శేష - సంకల్పస్థితి - మేషి చేత్ । సర్వాత్మకం - పదం - శాంతం-తదా- ప్రాప్నోష్యసంశయః॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, అట్టి చిదాకాశమునందు సకల సంకల్పములు-అయించి తన్మయంబుగా నుంటివేని, సర్వాధిష్ఠానమై పరమశాంత ముగా నుండు బ్రహ్మస్వరూపుడవు కాగలవు.—(శ్రుతి॥ దృశ్యాసంభవ - బోధోహి- జ్ఞానం - జ్ఞేయం - చిదాత్మకమ్ । తదేవ - కేవలీభావం - తతోన్య త్సకలం-మృషా॥) అనెడి మహోపనిషత్తురీతిగా, దృశ్యము లన్నియు అసత్య మని యెఱుగుటే విచార జ్ఞాన మనబడును. చిద్రూపమగు వస్తువు బ్రహ్మ మనియు జ్ఞేయ మనియు చెప్పబడును. అట్టి చిద్వస్తువు తా నని సదాతన్మయంబుగా నుండుటే కైవల్య మనబడును. అట్టి ఏకభావనిష్ఠ తప్ప తక్కినవన్నియు అసత్యములే సుమా!—(శ్రుతి॥ యదాహ్యే వైష - ఏతస్మిన్ - అల్పమప్యంతరం - నరః । విజానాతి - తదా - తస్య - భయం స్యాత్ - నాత్రసంశయః॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, ఆత్మయే పరబ్రహ్మము. ఆత్మకంటెను పరబ్రహ్మము వేఱుగా నున్నదని తలంచువారు జననమరణ సాగరము

## నిర్వికల్ప సమాధి లక్షణము.

నందు మునిగి దుఃఖించుచుందురు।—(శ్రుతి॥ అర్థా - దర్థాంతరం - చిత్తే - యాతి - మధ్యేతు - యాస్థితిః । సాధ్వస్త - మనసాకారా - స్వరూపస్థితి - రుచ్యతే॥)—

ఆనెడి మహోపనిషత్తురీతిగా, మనస్సు ఒక విషయమునందుండి మఱియొక విషయమున
నకు పోవునప్పుడు, ఆ మధ్యయందుండు చిత్తచలనములేని స్థితియే నిర్వికల్పసమాధి

స్వస్వరూప రహస్య బోధ.

యనియు, స్వరూపస్థితి యనియు చెప్పబడును గాన తద్రూపముగా నుండుము.—
(శ్రుతి॥ సంబంధే - ద్రష్టృ - దృశ్యానాం - మధ్యే - దృష్టిర్హి - యద్వపుః।
ద్రష్టృ - దర్శన - దృశ్యాది - వర్జితం - తదిదం - పదమ్॥)—అనెడి మహోప
నిషత్తురీతిగా, ద్రష్టృ దృశ్యములకు సంబంధము గలుగుచుండగా, నడుమ ఏ తెలివి
ప్రకాశించుచున్నదో, ఆ తెలివియే ద్రష్టృదర్శన దృశ్యరహిత మగు పరబ్రహ్మ మన
బడును—(శ్రుతి॥ దేశాద్దేశ గతం - చిత్తే - మధ్యే - యచ్చేతసో - వపుః।అజాత్యసం
విన్మననం - తన్మయో - భవ - సర్వదా॥)అనెడి మహోపనిషత్తురీతిగా, చిత్తము ఒక
సంకల్పమునుండి మఱియొక సంకల్పమును గూర్చి పోవుచుండునప్పుడు నడుమ
ఏజ్ఞానము ప్రకాశించుచున్నదో, ఆ జ్ఞానమే రూపనామక్రియలులేని పరబ్రహ్మ మన
బడును గాన, ఆ జ్ఞానమే నీ నిజస్వరూప మని తెలిసి తన్మయముగా నుండుము.—
(శ్రుతి॥ చిత్తం - దూరే పరిత్యజ్య యోసి - సోసి - స్థిరో భవ॥) అనెడి మహోప
నిషత్తురీతిగా, సంకల్పవికల్పరూపముగా నుండు మనస్సును దూరముగా విడిచిపెట్టి
శేషించిన జ్ఞానమే నీస్వరూపముగాన, చంచలము లేక స్థిరముగా తన్మయముగా
నుండుము—(శ్రుతి॥ హేయాదేయ - దృశౌ - త్యక్త్వా - శేషస్థ - స్సుస్థిరో -
భవ॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, (హేయములందును) అనగా విడిచిపెట్టవలసిన
వానియందున్ను, (ఆదేయములందును) అనగా గ్రహించవలసిన దానియందున్న దృష్టి
లేనివాడవై, ఆ హేయాదేయములకుమీద శేషించిన జ్ఞానమునందు చలనము
లేకుండుము. (శ్రుతి॥ నాహం - నేద మితి - ధ్యాయన్నిత్య - త్వ మచలాచలః।
ఆత్మనో - జగత శ్చాంతర్ - ద్రష్టృదృశ్య - దశాంతరే। దర్శనాఖ్యం - స్వమా
త్మానం - సర్వదా - భావయన్ - భవ॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, ఈ
దేహేంద్రియాహంకారములు నేను కాను, ఈ జగత్తు మిథ్యాస్వరూప మైనది అని
నిశ్చయముగా రెఱిగి ఈ దేహేంద్రియ జగత్తులను ఏది సాక్షిమాత్రముగా నుండుచు
రెఱుగుచున్నదో ఆ సాక్షియే నీ స్వరూపమని తెలిసి, సదా ఆ సాక్షినే ధ్యానించుచు
తన్మయుండుగా నుండుము.—(శ్రుతి॥ అవలంబ్య - నిరాలంబం - మధ్యేమధ్యే-స్థిరో -
భవ॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, దేహేంద్రియాది - జగత్తునకు సాక్షిగానుండు
వస్తువే ఆత్మ యనియు, బ్రహ్మ మనియు చెప్పబడును. అట్టి సాక్షిస్వరూపమగు ఆత్మ
సమస్తమునకు ఆధారమైనది, అట్టి ఆత్మకు ఆధార మేదియు లేదు గాన అది నిరాధార
మైనది, అట్టి ఆత్మయే నీవని తెలిసి దృఢనిశ్చయము గలిగి సదా దానిని ధ్యానించుచు
తన్మయుండుగా నుండుము.—(శ్రుతి॥ ద్రష్టృదర్శన - దృశ్యానాం - మధ్యే - యద్ద
ర్శనం - స్మృతమ్ । నాతఃపరతరం - కించి - న్నిశ్చయో - స్త్యపరో - మునే॥)—

అనెడి మహోపనిషత్తురీతిగా (ద్రష్ట - దర్శన - దృశ్యములు) అనగా చూచువాడు, చూపు, చూపునకు కనబడిన దృశ్యప్రపంచము, ఈ మూడున్ను త్రిపుటి యనబడును. అట్టి త్రిపుటికి మధ్యంబున సాక్షిగా ఏ తెలివి వెలుగు చున్నదో, ఆ తెలివియే ఆత్మ యనియును, బ్రహ్మ మనియును చెప్పబడును. అట్టి తెలివియే తానని తెలిసి సదా తన్మయంబుగా నుండుటకంటెను, వేఱే ఏమి శాస్త్రార్థసారము లేదు గాన, సదా ఆ తెలివియే తానని సదా తన్మయంబుగా నుండవలయును.

## అగ్రాహ్య మెట్టిది?

శ్రుతి॥ అగ్రాహ్యమితిచ॥ స్వస్వరూప - వ్యతిరిక్త - మాయామయ - బుద్ధీంద్రియాది - గోచర - జగత్ - సత్యత్వ - చింతన - మగ్రాహ్యమ్॥

తా॥ (అగ్రాహ్యము) అనగా విడిచిపెట్టవలసినది ఏదియనగా? ఆత్మస్వరూపమునకంటెను వేఱైనట్టి మాయామయము లైన బుద్ధీంద్రియాదులున్ను, ఆ బుద్ధీంద్రియాదులకు కనుబడుచుండు ప్రపంచమున్ను సత్యమనెడి భ్రాంతిని విడిచిపెట్టవలసినది.

## జగత్తు మిథ్యాస్వరూప మైనది.

ఇందుకు ప్రమాణములు ఏమనగా.—(శ్రుతి॥ యదిదం - దృశ్యతే - సర్వం - జగత్ - స్థావర - జంగమమ్। తత్ - సుషుప్తావివ - స్వప్నః - కల్పాంతే - ప్రవినశ్యతి॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, చరాచరరూపంబగు ఈ జగత్తు సర్వమున్ను స్వప్న ప్రపంచమువలె అసత్యమైనదై, మహాప్రళయమునందు లయించిపోవును.—(శ్రుతి॥ శేషేయ - మింద్రజాల - క్రీడాగతిః - ప్రవితన్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, ఈజగత్తు ఇంద్రజాలమువలె అసత్యమైనది.—(శ్రుతి॥ విరించి - రూపాన్మనసః - కల్పితత్వా - జగత్ - స్థితేః। తావత్ - స్థితిరియం - ప్రోక్తా - తన్నాశే - నాశ మాప్నుయాత్॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, మనస్సే బ్రహ్మదేవు డనబడును. అట్లు బ్రహ్మదేవుడుగా నుండు మనస్సుచేతనే ఈ ప్రపంచము కల్పింపబడు చున్నది గాన, మనస్సు నశించినతోడనే తత్క్షణమే ప్రపంచమున్ను నశించిపోవును.—(శ్రుతి॥ నజాయతే - నమ్రియతే - క్వచిత్ - కించిత్కదాచన। పరమార్థేన - విప్రేంద్ర - మిథ్యా - సర్వంతు - దృశ్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, ఈ జగత్తు ఇంద్రజాల విద్యవలన దోచిన పట్టణమువలె మిథ్యాస్వరూప మైనది గాన ఇది పుట్టను లేదు, చావను లేదు, ఈ జగత్తు ఉన్నదనుట భ్రాంతిమాత్రమే.—(శ్రుతి॥ గంధర్వ-నగర ప్రాయైర్ - భూషితే - భూషితే - తథా। అవిద్యాంశే - సుతాదౌ-వా-కః క్రమ - స్సుఖదుఃఖయోః॥) అనెడి మహోపనిషత్తురీతిగా, గంధర్వనగరమునందు తోచిన సుఖదుఃఖములు రెట్లు మిథ్యాభూతములో, అట్లు పుత్త్రదార దిరూప మగు సంసార మున్ను దానియందలి సుఖదుఃఖములున్ను మిథ్యాభూతములే.—(శ్రుతి॥ ధనదారేషు - వృద్ధేషు - దుఃఖయుక్తం - నతుష్టతా। వృద్ధాయాం - మోహమాయాయాం - కస్స

మాశ్వాసనా - నిహా॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, దారాపుత్త్రిధనాదులు వృద్ధిపొందేకొలదిని క్రమక్రమముగా దుఃఖము వృద్ధిపొందును గాని సెమ్మది యెన్నటికిని గలుగజాలదు.—(శ్రుతి॥ రైయైరేవ - జాయతే రాజగోమూర్ఖస్యాధికతాం - గతైః। తైరేవ - భాగైః - ప్రాజ్ఞస్య విరాగ - ఉపజాయతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, అజ్ఞానులకు ప్రక్చందన వనితా తాంబూలాదులు మేలైనవని వాటియందు మిగుల ప్రియము గలుగు చుండును అయితే ఆ ప్రక్చందనవనితాదులు మిథ్యాభూతములైన వనియును, అవి బంధహేతువు లనియును, వాటియందు జ్ఞానికి వమనాన్నమునందువలె అసూయయును అప్రీతియును గలుగును. కాబట్టి—(శ్రుతి॥ కోశమాశా - భుజంగానాం - సంసారాడంబరం - త్యజ। అసదేత దితి - జ్ఞాత్వా - మాతృభావం - నివేశయ)—అనెడి మహోపనిషత్తురీతిగా, ఆశ యనెడి సర్వమునకు నివాసస్థానముగా నుండు సంసారము అసత్యమైనదనియును తెలిసి దానియందలి భ్రాంతిని విడిచిపెట్టి, ఈ దారాపుత్త్రి ధన దేహేంద్రియాది సమస్తజగత్తునకు నేను సాక్షిని అని సదా తద్రూపముగా నుండవలయును.—(శ్రుతి॥ ద్వితీయ - కారణాభావా - దనుత్పన్న - మిదంజగత్॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, పరబ్రహ్మము తనకు రెండవ వస్తువు లేక తానొక్కటియే వెలుగుచున్నది గానజగత్తనుపదార్థము లేనేలేదు.—(శ్రుతి తిష్ఠత - గచ్ఛత - స్వపత - జాగ్రత - నివసత - ఉత్పతత - పతత। అసదేవేద - మిత్యంతర్ - నిశ్చిత్యాస్థాం - పరిత్యజ॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, నిలుచుచు నడుచుచు నిద్రించుచు మేల్కొనుచు నివసించుచు యెగురుచు పడుచు సకల వ్యవహారములు చేయుచునన్న ఈ జగత్తు అసత్యమని నిశ్చయించుకొని, దారాపుత్త్రిధనాదులు ఇంకా విశేషముగా సంపాదించుకోవలయునెనెడి ఆశను విడిచిపెట్టి దైవాధీనముగా లభించినదానితో సంతుష్టినొంది, సదా సాక్షిస్వరూప మగు ఆత్మను ధ్యానించుచుండవలయును.—

## సన్న్యాసి అనగా ఎవడు?

శ్రుతి॥ సన్న్యాస ఇతిచ॥ సర్వధర్మాన - పరిత్యజ్య - నిర్మమో నిరహంకారో - భూత్వా। బ్రహ్మేశం - శరణ - ముపగమ్య - తత్త్వమసి - సర్వం - ఖల్విదం బ్రహ్మ - నేహనానాస్తి - కించనే త్యాది। మహావాక్యార్థానుభవ - జ్ఞానాత్। బ్రహ్మైవాహ - మస్మీతి - నిశ్చిత్య। నిర్వికల్ప - సమాధినా - స్వతంత్రో - యతిశ్చరతి - స స్సన్న్యాసీ - సముక్త - స్సపూజ్య - స్సయోగీ - స పరమహంస - స్సోవధూత - స్సబ్రాహ్మణ - ఇతిచ।

తా॥ సన్న్యాసి యనగా ఎవడనగా సర్వధర్మములను వదలి, నేను నాది యనెడి అహంకార మమకారములను నాశముచేసి, పరబ్రహ్మమునందు భక్తిగలిగి, సమస్తము బ్రహ్మస్వరూపమే, ఇక్కడ అనేకమనునది కొంచెముకూడలేదు, ఉండేది బ్రహ్మమొక్కటే, దానికి రెండవపదార్థము లేనేలేదు, అట్టిపరబ్రహ్మమే ఆత్మస్వరూ

రముగా నున్నదనెడు మహావాక్యార్థానుభవ జ్ఞానమువలన ఆత్మస్వరూపుడగు నేను బ్రహ్మముకంటెను వేఱుగాదు, నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేనని దృఢనిశ్చయము కలిగి, సకల సంకల్పశూన్యుడై, సకలదృశ్యములను మఱచి కేవలజ్ఞప్తిమాత్రుడై నిర్వికల్పసమాధినిష్ఠయందు స్వతంత్రముగ సంచరించువాడే సన్న్యాసి యనియు, ముక్తుడనియు, పూజార్హుడనియు, యోగియనియు, పరమహంసు డనియు, అవధూతయనియు, బ్రాహ్మణుడనియు చెప్పబడును, ఇందుకు ప్రమాణములు ఎవియనగా.— (శ్రుతి॥ సర్వసంకల్ప - సన్న్యాస శ్చేతసాయః - పరిగ్రహః॥) — అనెడి మహోపనిషత్తురీతిగా, సకలసంకల్పములను నాశము చేయుటయే సన్న్యాసము అనబడును గాన, ఎల్లవారున్ను అట్టి సన్న్యాసమునే పొందవలయును. (శ్రుతి॥ దీర్ఘంవాపి - మనోరాజ్యం - సంసారం - దుఃఖసాగరమ్॥) — అనెడి వరాహోపనిషత్తురీతిగాను, మఱియు (శ్రుతి॥ చిత్తమేవహి - సంసార - స్తత్ - ప్రయత్నేన - శోధయేత్॥) అనెడి మైత్రేయోపనిషత్తురీతిగాను, మనస్సే మహాదుఃఖమైన సంసార మనబడును. అట్టి మనోనాశమే సన్న్యాసమనబడును.—(శ్రుతి॥ జీవాత్మనో-రైక్యం-సన్న్యాసః-పరికీర్తితః॥) — అనెడి మైత్రేయోపనిషత్తురీతిగా, జీవబ్రహ్మైక్యనిష్ఠను పొందుటే సన్న్యాసమనబడును — (శ్రుతి॥ త్యాగః - ప్రపంచరూపస్య సచ్చిదాత్మావ - లోకనాత్ । త్యాగోహి - మహతాం - పూజ్య - స్సద్యోమోక్ష - ప్రదాయకః॥) — అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, అఖండసచ్చిదానంద పరబ్రహ్మమునందు మనస్సు లయించి నామరూపములతోఁ గూడిన దేహేంద్రియాది ప్రపంచమునున్ను ప్రపంచసంబంధమగు సంకల్పమునున్ను మఱచుటే సన్న్యాసమనియు, త్యాగమనియు చెప్పబడును గాని, భార్యాపుత్త్రులతోఁ గూడియుండుట సంసారమనియు, వారిని విడిచిపెట్టి పోవుటే సన్న్యాసమనియు తలచుట పిచ్చితనము (శ్లో॥ వాగ్దండోథ - మనోదండః - కాయదండ - స[illegible]చ - యస్యైతే - నిహితా - బుద్ధౌ - త్రిదండీతి - స ఉచ్యతే॥ — అనెడి మనుస్మృతిరీతిగా, మనోవాక్కాయము లనెడి త్రికరణములను దండించి పరిశుద్ధములుగా జేసి, సర్వజీవులందును కామక్రోధములు లేనివాడే త్రిదండ సన్న్యాసి యనబడును గాని, మూడుకఱ్ఱలను ఒకటిగా జేర్చి చేతపట్టుకొని తిరుగుటవలన

## గృహస్థాశ్రమమే శ్రేష్ఠము.

త్రిదండ సన్న్యాసి గాజాలడు.—(శ్రుతి॥ సర్వేషా మపి - చైతేషాం - వేదస్మృతి - విధానతః । గృహస్థ - ఉచ్యతే - శ్రేష్ఠః - సత్రీనేతాన్ - బిభర్తిహి॥) — అనెడి మనుస్మృతిరీతిగా, బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్న్యాస మనెడి నాలుగు ఆశ్రమములలోపల (గార్హస్థ్యమే) అనగా భార్యతోడగూడి సంసారిగా నుండుటే శ్రేష్ఠము. తక్కిన మూడాశ్రమములవారిని, అనగా బ్రహ్మచారిని, వానప్రస్థుని, సన్న్యాసిని ఈ ముగ్గురినిన్ని (గృహస్థుడే) అనగా సంసారియే అన్నపానాదులనిచ్చి కాపాడుచున్నాడు గాన సంసారియే శ్రేష్ఠుడు.—(శ్లో॥ యథా - నదీనదా

స్సర్వే - సాగరే - యాంతి - సంస్థితిమ్ । తథైవాశ్రమిణః - సర్వే - గృహస్థే - యాంతి - సంస్థితిమ్॥)—అనెడి మనుస్మృతిరీతిగా, సకల నదీనదములు సాగరమునందే చేరునట్లు, బ్రహ్మచారులున్ను వానప్రస్థులున్ను సన్న్యాసులున్ను సంసారిని ఆశ్రయించియే జీవించుచుందురు గాన, సంసారియే అందరిలోపల శ్రేష్ఠుడు. కాబట్టి—(శ్లో॥ ధృష్టస్తేజ - క్షమాస్తేయం - శౌచ - మింద్రియనిగ్రహః । ధీర్విద్యా - సత్యమక్రోధో - దశకం - ధర్మలక్షణమ్॥) శ్లో॥ దశలక్షణాని - ధర్మస్య - యే - విప్రా - స్సమధీయతే । అధీత్య - చానువర్తంతే - తే యాంతి - పరమం - గతిమ్॥)—అనెడి మనుస్మృతివాక్యరీతిగా, సంతోషము, అపకారము చేసినవారికి ప్రతి అపకారము చేయకుండుట, మనోనిగ్రహము, దొంగతనము లేకుండుట, సదాచారము, ఇంద్రియనిగ్రహము, వేదాంతశాస్త్రజ్ఞానము, (ఆత్మజ్ఞానము) అనగా బ్రహ్మాత్మ అభేద ఐక్యజ్ఞానము, సత్యమాడుట, కోపము లేకుండుట అను నీపదిధర్మములున్ను గలిగినవాడే మోక్షమును పొందును. తక్కినవారు పొందజాలరు గాన, సంసారికి ఈ పదిధర్మములున్ను గలిగియుండినయెడల, సత్యముగా అతడే మనస్సన్న్యాసమును పొందిన మహాత్ముడనబడును.—(శ్రుతి॥ మోక్షద్వారే - ద్వారపాలా శ్చత్వారః - పరికీర్తితాః । శమో - విచార - స్సంతోష - చతుర్థ - స్సాధుసంగమః । ఏకంవా - సర్వయత్నేన - సర్వముత్సృజ్య - సంశ్రయేత్ । ఏకస్మిన్ - వశగే - యాంతి - చత్వారోపి - వశంగతాః॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, మోక్షద్వారమందు నలుగురు ద్వారపాలకు లున్నారు వారు యెవరనగా, శాంతి, ఆద్మానాత్మ వివేకము, ప్రాప్తాప్రాప్తములందు సమదృష్టిగా తృప్తినొందుట, బ్రహ్మజ్ఞానుల సాంగత్యము అను నీనాలుగు సాధనములే మోక్షద్వారమునందుండు ద్వారపాలకులు గాన, వీరియనుమతి లేనియెడల, ఎంతకష్టపడినను ఎంతటివారికైనను మోక్షము లభింపదు గాన, ఈ నాలుగు సాధనములలో ఏదైయైన నొకసాధనము సాధించి వశపఱచుకొన్నయెడల తక్కిన మూడు సాధనములు వశమగును, తర్వాత మోక్షమును అతిసులభముగా జెందవచ్చును గాన ఈ నాలుగు సాధనములు గల సంసారి గృహస్థుడుగా నున్నను, అతడే మనస్సన్న్యాసమును పొందిన మహానీయుడు గాని, భార్యాపుత్రాదులను విడిచిపెట్టి ఆత్మజ్ఞానము లేక కాషాయవస్త్రమును ధరించి తిరుగువాడు వెఱ్ఱివాడనబడును. ముక్తుడనగా

## జీవన్ముక్తుని లక్షణము.

ఎవడనగా.—(శ్రుతి॥ చిదాత్మాహం - పరాత్మాహం - నిర్గుణోహం - పరాత్పరః । ఆత్మమాత్రేణ - యస్తిష్ఠే - త్సజీవన్ముక్త - ఉచ్యతే॥ దేహత్రయాతిరిక్తోహం - శుద్ధచైతన్య - మస్మ్యహమ్ । బ్రహ్మాహ మితి-యస్యాంత-స్సజీవన్ముక్త - ఉచ్యతే॥)—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, జ్ఞానమాత్రస్వరూపమగు ఆత్మయే నేను, నాకంటె ఎక్కువవస్తువు యేదియు లేదు, నేనే అన్నిటికంటెను శ్రేష్ఠుడు, నేను శుద్ధనిర్గుణుండను

డను. నేను పరాత్పరుడను, నేను ఆత్మస్వరూపుండను, శరీరత్రయమునకు వేఱుగా నున్నాను. నేను శుద్ధచైతన్య స్వరూపుండను నేనే బ్రహ్మము అనెడి దృఢనిశ్చయము గలవాడే జీవన్ముక్తుడు. (శ్రుతి॥ నమోక్షో — నభసఃపృష్ఠే - నపాతాళే - నభూతలే। సర్వాశా - సంక్షయే — చేతఃక్షయో - మోక్ష - ఇతీష్యతే॥)— అనెడి అన్నపూర్ణోపనిషత్తురీతిగా, మోక్షమనేది ఆకాశమునకు మీదుగా లేదు, పాతాళలోకమున లేదు, భూలోకములో లేదు, సకల ఆశలు నశించి, చిత్తమున్ను నశించి, సంకల్పశూన్యముగా నుండుటే మోక్షమనబడును గాన, అట్లు సంకల్పశూన్యమును పొందినవాడే ముక్తుడు. (శ్రుతి॥ అధ్యాత్మ - రతిరశ్రాంతః—పూర్ణపావనమానసః। ప్రాప్తానుత్తమ- విశ్రాంతిర్-నకించిదిహ-వాంఛతి॥ సర్వాధిష్ఠాన - సన్మాత్రే- నిర్వికల్పే- చిదాత్మని। యోజీవతి-గతస్నేహ- స్సజీవన్ముక్త - ఉచ్యతే॥)—అనెడి అన్నపూర్ణోప నిషత్తురీతిగా, సదా అధ్యాత్మనిష్ఠయం దుండుచు మనస్సును పరబ్రహ్మమునందు లయింపజేయుచు, చిత్తవిశ్రాంతి గలిగి సకలభోగములందున్ను కోరికలు లేనివాడై, దారాపుత్త్ర మిత్రాదులందు స్నేహము లేనివాడై నిర్వికల్పమగు బ్రహ్మస్వరూపముగా నుండువాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ దృశ్యం - నాస్తీతి - బోధేన - మనసో దృశ్యమార్జనమ్। సంపన్నంచేత్ - తదుత్పన్నా - పరా - నిర్వాణ - నిర్వృతిః॥) అనెడి మహోపనిషత్తురీతిగా, దృశ్యము లన్నియు అసత్యమని సకల దృశ్యములను మఱచి, స్వస్వరూపమాత్రముగా నుండుటే మోక్షమనబడును గాన, అట్టి స్థితిని పొందినవాడే ముక్తుడు.—(శ్రుతి॥ అశేషేణ-పరిత్యాగో-వాసనాయా-య-ఉత్తమః। మోక్ష- ఇత్యుచ్యతే - స్సఏవ - విమలక్రమః॥)— అనెడి మహోపనిషత్తు రీతిగా, సకల మలిన వాసనలు బొత్తిగా నశించి, చిన్మాత్రముగా నుండుటే మోక్ష మనబడును. అట్టిస్థితిని పొందినవాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ యేశుద్ధవాసనా- భూయో-నజన్మానర్థ-భాగినః। జ్ఞాతజ్ఞేయా - స్త- ఉచ్యంతే జీవన్ముక్తా-మహాధియః॥)—అనెడి మహోపనిషత్తు రీతిగా, డంభము లేకుండుట, కామక్రోధాది దుర్గుణములు లేకుండుట, శమదమాదులు, శ్రవణ మననాదులు, అనునివియే శుద్ధవాసన అనబడును. ఇట్టి శుద్ధవాసన గలిగి పునర్జన్మశూన్యులై సదా అపరోక్షజ్ఞాన సాక్షాత్కారమును చెందినవాడే జీవన్ముక్తుడు (జీవన్ముక్తుడు) అనెడి మాటకు అర్థమేమనగా, ఇతరులకు బద్ధసంసారివలె కనబడుచు లోకవ్యాపారములు చేయుచున్నను, తానుమాత్రము తనయందు దోచిన జీవభ్రాంతి నశించి, సాక్షిమాత్ర పరబ్రహ్మ స్వరూపముగా నుండువాడని అర్థము. —శ్రుతి॥ ఆపత్సు - యథాకాలం- సుఖదుఃఖే-ష్వనారతః। నహృష్యతి- గ్లాయతి-య-స్సజీవన్ముక్త-ఉచ్యతే॥)—అనెడి మహోపనిషత్తు రీతిగా, సంపద గలిగినప్పుడు సంతోషమున్ను ఆపద గలిగినప్పుడు వ్యసనమున్ను యెవడు చెందడో అతడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ హర్షామర్ష-భయ-క్రోధ-కామ-కార్పణ్య-దృష్టిభిః। నపరామృశ్యతే-యోంతః-స్స జీవన్ముక్త ఉచ్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిని, భోగంబులవలన గలుగు సంతోషము, ఓర్వ

శోకము, భయము, కోపము, కామము, కార్పణ్యము మొదలగునవి లేక సదా యెవడు
అంతరాత్మ ధ్యానము గలిగి యుండునో అతడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ అహంకార
మయీం- త్యక్త్వా-వాసనాం-లీలయైవ- యః । తిష్ఠతి- ధ్యేయసంత్యాగీ - సజీవన్ముక్త
ఉచ్యతే॥) అనెడి మహోపనిషత్తు రీతిగా, అహంకార రూపమగు మలినవాసనలను
విడిచిపెట్టి, దేవతా ఉపాసనాదులను విడిచిపెట్టి, సదా ఆత్మనిష్ఠయం దుండువాడే
జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ ఈప్సితా - నీప్సితే - నస్తో - యస్యాంతర్ - వృత్తిదృష్టిషు
సుషుప్తవద్-యశ్చరతి - సజీవన్ముక్త - ఉచ్యతే॥)— అనెడి మహోపనిషత్తు రీతిగా,
ఎవనికి విషయాదులందును ప్రియాప్రియములయందును ఇష్టానిష్టములు లేక, సకల వ్యవ
హారములు చేయుచున్నను, ఎవడు నిద్రించువాని రీతిగా ప్రపంచమును మఱచి చిన్మ
యముగా నుండునో అతడే జీవన్ముక్తుడు.— (శ్రుతి॥ రాగద్వేషౌ - సుఖందుఃఖం -
ధర్మాధర్మౌ - ఫలాఫలే । యః కరో - త్యనపేక్ష్యైవ - సజీవన్ముక్త - ఉచ్యతే॥)—
అనెడి మహోపనిషత్తు రీతిగా, ఎవడు కామక్రోధములను సుఖదుఃఖములను ధర్మా
ధర్మములను లాభనష్టములను అపేక్షింపకయే ప్రారబ్ధానుసారముగా సకల కార్య
ములను చేయుచుండునో, అతడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ మౌనవా - న్నిరహం
భావో - నిర్మానో - ముక్త మత్సరః । యః కరోతి - గతోద్వేగ - స్స జీవన్ముక్త -
ఉచ్యతే॥—అనెడి మహోపనిషత్తురీతిగా, ఎవడు నియమించిన వాక్కు గలవాడై,
అహంకారము లేనివాడై మర్యాదలు కోరనివాడై అసూయలేనివాడై సుఖదుఃఖసంతా
పము లేనివాడై ప్రారబ్ధానుసారముగా సకలకార్యములు చేయుచుండునో వాడే జీవ
న్ముక్తుడు.—(శ్రుతి॥ సర్వత్ర - విగతస్నేహో - యస్సాక్షివ - దవస్థితః । నిరిచ్ఛో -
వర్తతే - కార్యే - సజీవన్ముక్త - ఉచ్యతే॥) అనెడి మహోపనిషత్తురీతిగా, దారా
పుత్రాదులందు ఆశగలవాడుగా లోకులకు తోచుచున్నను, అంతర్యంబున వారియందు
ఆశలేనివాడై, దేహేంద్రియ వ్యాపారములకు తాను సాక్షిని అని భావించుచు, కోరిక
లేకయే స్నాన శౌచ భోజనాది సకలకార్యములు చేయుచుండువాడే జీవన్ముక్తుడు.—
(శ్రుతి॥ ఏనధర్మ - మధర్మంచ - మనోమననమీహితమ్ । సర్వమంతః - పరిత్యక్తం -
సజీవన్ముక్త - ఉచ్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, వేదవిహిత ధర్మాధర్మ
ములతో తనకు లాభములేదని వాటిని స్మరించక, అపేక్షించక, సదా ఆత్మానుసంధా
నము చేయువాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ యావతీ - దృశ్యకలనా - సకలేయం
విలోక్యతే । సా - ఏన - సుష్ఠు - సంత్యక్తా - సజీవన్ముక్తః - ఉచ్యతే॥)— అనెడి
మహోపనిషత్తురీతిగా, ఈ నానా విచిత్ర రూపనామములతో కనబడునట్టి ప్రపంచము
మాయాకల్పన అని, అసత్యమని తెలిసి ప్రపంచమునందలి ఆశను విడిచి సదా ఆత్మ
ధ్యానము చేయుచు తన్మయుంబుగా నుండువాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ కట్వమ్ల
లవణం - తిక్త - మమృష్టం - మృష్ట మేవచ । సమమేవచ - యో భుంక్తే - స్సజీవ
న్ముక్త - ఉచ్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, కారము పులుసు ఉప్పు

మొదలగు షడ్రసోపేత మగు అన్నముగాని, లేక రుచిలేని అన్నముగాని, దైవాధీన ముగా ఏది ప్రాప్తించినను, దానియందలి రుచి అరుచులను విచారించక సమభావనతో భుజించుచు, సదా ఆత్మానుసంధానపరుడై యుండువాడే జీవన్ముక్తుడు— శ్రుతి॥ జరామరణ - మాపచ్చ - రాజ్యం - దారిద్ర్యమేవచ । రమ్యమిత్యేవ - యోభుంక్తే - సజీవన్ముక్త - ఉచ్యతే॥) అనెడి మహోపనిషత్తురీతిగా, శరీరసంబంధములగు ముసలితనము, మరణము, ఆపదలు, రాజ్యము, సంపదలు, దారిద్ర్యము మొదలగునవి సంభవించినను, అవి దేహమునకే గాని ఆత్మకు ఏమియు లేవని, ఏది సంభవించినను, నిర్భయముగా బ్రహ్మానంద స్వరూపముగా నుండువాడే జీవన్ముక్తుడు.-(శ్రుతి॥ ధర్మాధర్మ- సుఖందుఃఖం- తథా- మరణజన్మని । ధియా-ఏవ - సమత్యక్తం - సజీవన్ముక్త - ఉచ్యతే।)—అనెడి మహోపనిషత్తురీతిగా ధర్మాధర్మములున్ను సుఖదుఃఖములున్ను జననమరణములున్ను సకలవ్యవహారములున్ను ఏది సంభవించినను అవియన్నియు శరీరమునకే గాని, శరీరమునకంటెను వేఱుగా నుండు ఆత్మస్వరూపుడ నగు నేను ఏవికారములున్ను లేనివాడను, నిత్యానందుండను, దేహేంద్రియాది జగత్తు సర్వమున్ను అసత్యమైనది, సాక్షిస్వరూపుడనగు నేను సత్యమైనవాడను, నేనే పరబ్రహ్మము అని దృఢనిశ్చయముగలిగి సకల భ్రాంతులున్ను నశించి, సదా ఆత్మానుభవ నిష్ఠయం దుండువాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి। ఉద్వేగానంద - రహిత - స్సమయా - స్వచ్ఛయా - ధియా । నశోచతే - నచోదేతి- స్సజీవన్ముక్త - ఉచ్యతే।)—అనెడి మహోపనిషత్తురీతిగా, నిర్మలమైన బ్రహ్మజ్ఞాన సాక్షాత్కారముచేత సుఖదుఃఖములందు సంతోషవ్యసనములు లేనివాడే జీవన్ముక్తుడు,— (శ్రుతి. సర్వేచ్ఛా - సకలాశ్శంకా - సర్వేహా - స్సర్వనిశ్చయాః । ధియా -ఏన - పరిత్యక్తా - స్సజీవన్ముక్త - ఉచ్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, సకలకోరికలు సకలసందేహములు సర్వప్రపంచవిషయములు సర్వశాస్త్రసిద్ధాంతములను విడిచిపెట్టి లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అనెడి వాసనాత్రయము లేనివాడై, సదా ఆత్మానుసంధానమును చేయుచుండువాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ నకించన - ద్వేష్టి - తథా - నకించిదపి - కాంక్షతి । భుంక్తే - యఃప్రకృతాన్ - భోగాన్ నస జీవన్ముక్త - ఉచ్యతే )—అనెడి మహోపనిషత్తురీతిగా, ఏవస్తువునందును అసూయ లేక, ఏవస్తువును కోరక ప్రారబ్ధానుసారముగా లభించిన దానిని అనుభవించుచు, మోదభేదములులేక సదా జ్ఞానస్వరూపుడై యుండువాడే జీవన్ముక్తుడు— శ్రుతి॥ శాంత - సంసార - కలనః - కలావానపి-నిష్కళః । యస్సచిత్తోపి - నిశ్చిత్తః - స్సజీవన్ముక్త - ఉచ్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, సంసారమునందుండియు సంసారతాపములు లేనివాడును, విద్వాంసుడుగా నుండియు నేను విద్వాంసుడ ననెడి గర్వము లేనివాడును, పరిశుద్ధమైన చిత్తముండియు అది లేనివాడును యెవఁడో అతడే జీవన్ముక్తుడు.—(శ్రుతి యస్సముస్తార్థ - జాలేషు - వ్యవహార్యపి - నిస్పృహః । పరార్థే ష్వివ - పూర్ణాత్మా - సజీవన్ముక్త - ఉచ్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా,

ప్రపంచమునందలి సకలవ్యవహారములు చేయుచున్నను, పరుల కార్యములందు శ్రద్ధ లేనివానివలె తాను చేయు కార్యములందును పట్టులేకయే, సకలకార్యములను చేయుచుండువాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ రమతే - ధీర్యథా - ప్రాప్తే సాధ్వీవాంతః పురాజిరే। సా-జీవన్ముక్తతోదేతి - స్వరూపానంద - దాయినీ)—అనెడి మహోపనిషత్తురీతిగా, పతివ్రతాస్త్రీ పరపురుషవాంఛ లేక సకలమైనవారిని సహోదరులుగా భావించుచు, తనభర్త సంపద గలవాడుగా నుండునప్పుడున్ను దరిద్రుడుగా నుండునప్పుడున్ను తనభర్తయందు ప్రీతిసమముగా గలిగి కలిమిలేములను సమముగా భావించుచు భర్త శుశ్రూషయందే సంతోషించి తృప్తిపొంది యుండునట్లు దైవాధీనముగా సంభవించిన సుఖదుఃఖములను సమముగా నెంచుచు సదా ఆత్మధ్యానపరాయణుడై యుండువాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ యస్య నేచ్ఛా - తథానిచ్ఛా - జ్ఞస్య-కర్మణి-తిష్ఠతః। నతస్య - లిప్యతే - ప్రజ్ఞా - పద్మపత్ర - మివాంబుభిః॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, ఎవడు ఇచ్ఛానిచ్ఛలు లేక సకలకార్యములు చేయుచుండునో, అతడు తామరాకునందలి జలబిందువువలె విషయములవలన గలుగు సుఖదుఃఖముల సంటకయసంగుడుగా నుండును, అతడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ పరిజ్ఞాయోప - భుక్తోహి - భోగో - భవతి - తుష్టయే। విజ్ఞాయ - సేవిత - శ్చోరో - మైత్రీమేతి - నచోరతామ్॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, బుద్ధిమంతుడు తన కార్యార్థము చోరుని దోషగుణములు గలవానినిగా తెలిసి వానితో చెలిమి చేసినను, తాను ఆదొంగకు గలిగిన చోరత్వగుణమును గలిగియుండునట్లు, బ్రహ్మజ్ఞాని విషయములయొక్క దోషగుణములను తెలిసికొని ప్రారబ్ధానుసారముగా అట్టి విషయభోగములను అనుభవించుచున్నను, తాను ఏదోషమును జెందక నిర్దోషియై బ్రహ్మస్వరూపుడై ప్రకాశించుచుండును—(శ్రుతి॥ జాగ్రత్యేవ - సుషుప్తస్థః - కురుకర్మాణి - వై - ద్విజ। అంతస్సర్వ - పరిత్యాగీ - బహిఃకురు - యథాగతమ్;—అనెడి అన్నపూర్ణోపనిషత్తురీతిగా, జాగ్రదవస్థయందు నిద్రితునివలె నుండుచు, సకలకార్యములు చేయుచుండువాడే జీవన్ముక్తుడు, అంతర్యమునందు కామక్రోధాదులు లేనివాడై తాను సాక్షిమాత్రుడని సుఖించుచు, బాహ్యమున లోకులరీతిగా యథావిధి సకలకార్యములు చేయుచుండువాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ నిర్వికల్పాచ - చిన్మాత్రా-వృత్తిః - ప్రజ్ఞేతి కథ్యతే। సా సర్వదా-భవేద్యస్య - సజీవన్ముక్త - ఇష్యతే॥)—అనెడి అధ్యాత్మోపనిషత్తురీతిగా, దేహేంద్రియాది సకలదృశ్యములను మఱచి, సంకల్ప వికల్పము లేక కేవల జ్ఞప్తిమాత్రముగా నుండుస్థితియే ప్రజ్ఞయనబడును. అట్టి ప్రజ్ఞామాత్రముగా సదా యుండువాడే జీవన్ముక్తుడనబడును.-శ్రుతి॥ దేహేంద్రియేష్వహంభావ- ఇదంభావ-స్తదన్యకే। యస్య - నోభవతః - క్వాపి - సజీవన్ముక్త - ఇష్యతే)—అనెడి అధ్యాత్మోపనిషత్తురీతిగా, దేహేంద్రియములే నేననెడి అహంకారమును విడిచిపెట్టి

దేహేంద్రియ విలక్షణముగా నుండు ఆత్మయే తానని భావించు వాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ న ప్రత్యగ్ - బ్రహ్మణోర్భేదం కదాపి - బ్రహ్మసర్గయోః । ప్రజ్ఞయా - యో విజానాతి - స జీవన్ముక్త - ఇష్యతే॥)— అనెడి అధ్యాత్మోపనిషత్తు రీతిగా, ఆత్మకంటే బ్రహ్మము వేఱుగా లేదనియు, ఆత్మయే బ్రహ్మము, బ్రహ్మమే ఆత్మ యనియు తెలిసి, అభేదజ్ఞానము గలవాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ సాధుభిః - పూజ్యమానేస్మిన్ - పీడ్యమానేపి- దుర్జనైః । సమభావో భవేద్యస్య - సజీవన్ముక్త - ఇష్యతే॥)— అనెడి అధ్యాత్మోపనిషత్తు రీతిగా, సజ్జనులు తన్ను పూజించినను, దర్జనులు తన్ను దూషించినను, ఆ రెంటిని సమముగా భావించు వాడే జీవన్ముక్తుడు.— (శ్రుతి॥ రాగద్వేష - భయాదీనా - మనఃరూపం- చరన్నపి। యోంతర్వ్యోమవ- దత్యచ్ఛ-స జీవన్ముక్త - ఉచ్యతే)— అనెడి మహోపనిషత్తు రీతిగా, కామ క్రోధ లోభ మోహాదులు గలిగియుండు వాడుగా నటించుచున్నను, ఎవని మనస్సు బ్రహ్మమయమై నిరాకారమగు ఆకాశము రీతిగా పరిశుద్ధముగా నుండునో వాడే జీవన్ముక్తుడు.—(శ్రుతి॥ యస్మాన్నోద్విజతే - లోకః - లోకాన్నోద్విజతేచ - యః । హర్షామర్ష - భయాన్ముక్త - సజీవన్ముక్త - ఉచ్యతే।)— అనెడి ఉపనిషద్వాక్యరీతిని, ఎవనిజూచి లోకులు భయపడరో, ఎవడు లోకులకు భయపడడో, ఎవడు విషయసంతోషము కోపము భయము లేకుండునో వాడే జీవన్ముక్తుడు. మఱియు

## పూజ్యని లక్షణము

పూజ్యుడు ఎవడనగా.—(శ్రుతి॥ అవిశేషేణ - సర్వంతు - యఃపశ్యతి - చిదన్వయాత్ స ఏవ - సాక్షాద్విజ్ఞానీ - స - శివ - స్సహరి - ర్విధిః।)--అనెడి మహోపనిషత్తు రీతిగా, ఈ ప్రపంచము సర్వమును బ్రహ్మస్వరూపముగా నెవడు భావించుచున్నాడో అతడే బ్రహ్మజ్ఞాని, అతడే శివుడు, అతడే విష్ణువు, అతడే బ్రహ్మదేవుడు అని చెప్పబడి యుండుటవలన, ఎల్లవారికిని (అతడే పూజ్యుడు) అనగా పూజింపదగినవాడు. మఱియు

## యోగి లక్షణము.

యోగి యెవడనగా.—(శ్రుతి॥ మనః - ప్రశమనోపాయో - యోగ - ఇత్యభిధీయతే।) —అనెడి మహోపనిషత్తురీతిగా, మనస్సు విషయంబులందు వ్యాపించక సంకల్ప వికల్పములు లేక, సదా బ్రహ్మమునందు లయించి తద్రూపముగా నుండుటే యోగ మనబడును. అట్టి స్థితిని పొందినవాడే యోగి యనబడును.—(శ్రుతి॥ యమోహి - నియమ స్త్యాగో - మౌనం దేశశ్చ - కాలతః । ఆసనం - మూలబంధంచ - దేహసామ్యంచ - దృక్ స్థితిః । ప్రాణసంయమనంచైవ - ప్రత్యాహారశ్చ ధారణా । ఆత్మధ్యానం - సమాధిశ్చ - ప్రోక్తా న్యంగానివై - క్రమాత్॥)— అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, శిష్యా! యమ నియమ త్యాగ మౌన దేశ కాల ఆసన మూలబంధ దేహసామ్య

దృక్‌స్థితి ప్రాణాయామ ప్రత్యాహార ధారణ ఆత్మధ్యాన సమాధి అను నీ పదునైదున్ను
జ్ఞానయోగాంగము లనబడును. (1) యమను అనగా—(శ్రుతి॥ సర్వం - బ్రహ్మేతి
వై - జ్ఞానాదింద్రియ - గ్రామసంయమః। యమోయమితి - సంప్రోక్తో ఽభ్యస -
నీయో - ముహుర్ముహుః॥)— అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, పృథివ్యాది
పంచభూతములున్ను, దేహేంద్రియాంతఃకరణ ప్రాణాదులున్ను, ఈ చరాచర జగత్తు
సర్వమున్ను పరబ్రహ్మమే గాని, ఆ పరబ్రహ్మమునకు వేఱుగా లేదనియు, కాబట్టి
అట్టి పరబ్రహ్మమే తాననియు సదా భావించుటే యమ మనబడును. (2) నియమ
మనగా—(శ్రుతి॥ సజాతీయ-ప్రవాహశ్చ. విజాతీయ-తిరస్కృతిః। నియమోహి-పరా
నందో-నియమాత్-క్రియతే-బుధైః॥)- అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, వినుచు స్పృ
శించుచు చూచుచు త్రాగుచు మూర్కొనుచు భుజించుచు మాట్లాడుచు నడుచుచు
నిలుచుచు కూర్చుండుచు సకల కార్యములు చేయుచున్నను; వర్ణాశ్రమాచారములకు
దగినట్లుగా ప్రవర్తించుచున్నను, ఆయా ఇంద్రియము దాని దాని కార్యములను జేయు
చున్నది గాని, ఆత్మస్వరూపుడగు నేను ఏ కార్యములను చేయక సాక్షిమాత్రునిగా
నున్నాను. ఆత్మస్వరూపుడగు నేను కులగోత్ర జాతి గుణ రూప నామక్రియలు లేనివా
డను. పరబ్రహ్మస్వరూపుడను అని సదాభావించుటే నియమ మనబడును. (3) త్యాగ
మనగా.— (శ్రుతి॥ త్యాగః ప్రపంచ - రూపస్య - సచ్చిదాత్మావ - లోకనాత్ ।
త్యాగోహి - మహతాం పూజ్య - స్సద్యోమోక్ష - ప్రదాయకః॥)—అనెడి తేజోబిం
దూపనిషత్తు రీతిగా, దేహేంద్రియాది జగత్తు సర్వమున్ను మిథ్య అని యెఱింగి వాటి
యందలి భ్రాంతిని విడిచిపెట్టి సదా ఆత్మానుసంధానము చేయుచుండుటే త్యాగమన
బడును. గాని, బ్రహ్మజ్ఞానము లేక వృథాగా భార్య బిడ్డలు గృహము మొదలయిన
వాటిని విడిచిపెట్టి తిరుగుట త్యాగము గాజాలదు. (4) మౌనమనగా.—(శ్రుతి॥
యస్మాద్వాచో-నివర్తంతే - అప్రాప్య - మనసా సహ । యన్మౌనయోగిభి - ర్గమ్యం
తత్ - భవేత్సర్వదా - బుధైః॥)—అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, అవాఙ్మా
నస గోచరముగు పరబ్రహ్మమే తానని దెలిసి, సదా మాట్లాడక, ఒకవేళ మాట్లాడినను
నా వాగింద్రియమే మాట్లాడుచున్నది గాని సాక్షిస్వరూపుడగు నేను మాట్లాడలేదని
భావించుచు సకల తలంపులు నశించి ఆత్మానుభూతియం దుండుటే తూష్ణీంభావ స్థితి
యనియు, నిర్వాసనా మౌనమనియు చెప్పబడును.— (శ్రుతి వాచో - యస్మాన్నివ
ర్తంతే - తద్వక్తుం కేన - శక్యతే। ప్రపంచో .. యది వక్తవ్య - స్సోఽపి - శబ్ద వివ
ర్జితః। ఇతివా - తత్ - భవే న్మౌనం - సర్వం - సహజ - సంజ్ఞితమ్ । గిరా - మౌ
నంతు - బాలానా మయుక్తం - బ్రహ్మవాదినామ్)—అనెడి తేజోబిందూప నిషత్తు
రీతిగా, శిష్యా! ఏది వాక్కు చేతను మనస్సు చేతను ఇట్టిదట్టిదని చెప్పుటకును భావించుట
కును శక్యము గానిదో, శబ్దరహితమయినదో, ప్రపంచరహితమయినదో, అట్టి పర
బ్రహ్మమే తానని సదా తన్మయంబుగా కేవల జ్ఞప్తిమాత్రముగా నుండు స్థితియే జ్ఞాన

మౌన మనబడును. ఆత్మజ్ఞానము లేక వృథాగా నోటితో మాట్లాడకుండుట బిడ్డల మౌనము కంటెది గాన, జ్ఞానులు అట్టి వృథామౌనమును అభ్యాసము చేయజాలరు. (5) దేశమనగా.—(శ్రుతి: ఆదావంతేచ - మధ్యేచ - జనోయస్మిన్ - నవిద్యతే । యేనేదం - సతతం వ్యాప్తం - సదేశో - విజనస్మృతః॥)—అనెడి తేజోబిందూప నిషత్తు రీతిగా, ఎది ఆదిమధ్యాంతములు లేనిదో, దేనియందు మనస్సు ఇంద్రియములు ప్రాణవాయువు సంచారము మాని అణించి యుండునో, మఱియు దేనియందు రాగద్వేష కామక్రోధాది వృత్తులన్నియు శూన్యమై, దుఃఖము కొంచెమయినను తోచకుండునో ఎది నిరతిశయ సుఖస్వరూపముగా నుండునో, ఎదినిత్యమై నిర్మలమయినదో ఎది అన్నిటి కంటెను శ్రేష్ఠమయినదో ఆ బ్రహ్మమే దేశమనబడును. అట్టి బ్రహ్మ మనెడి ఏకాంత దేశమును పొందిన మహాత్మునకే నిరంతరసుఖంబు గలుగును గాని, సాధారణముగా నిర్జన ప్రదేశము యేకాంతదేశము గాజాలదు. అట్లు నిర్జనప్రదేశమునం దుండుటవలన నిరంతర సుఖమున్ను చిత్తనిశ్చలమున్ను వృత్తిశూన్యమున్ను గలుగజాలదు. (6) కాలమనగా.—(శ్రుతి: కల్పనా - సర్వభూతానాం - బ్రహ్మాదీనాం - నిమేషతః । కాలశబ్దేన - నిర్దిష్టం - హ్యఖండానందమద్వయమ్॥)— అనెడి తేజోబిందూప నిషత్తు రీతిగా, భూత భవిష్యత్తు వర్తమానంబు లనెడి త్రికాలంబులు దేనివలన కల్పింపబడెనో, ఎది త్రికాలంబులందును నాశము లేక వెలుంగుచుండునో, దేనియందు కాల నియమంబులు లేకుండునో, ఎది అనాదియో, ఆ బ్రహ్మమే కాలమనబడును, అట్టి పరబ్రహ్మ మనెడి కాలము తానని తద్రూపముగా నుండు బ్రహ్మజ్ఞాని ప్రపంచసృష్టికి లోబడిన భూత భవిష్యత్తు వర్తమానము లనెడి త్రికాలముల నన్ను మహాప్రళయ కాలము నున్ను మీఱినవాడయి స్వయంప్రకాశు డయి బ్రహ్మస్వరూపు డయి ప్రకాశించు చుండును (7) ఆసన మనగ.—(శ్రుతి: సుఖే నైవ-భవే ద్యస్మి - న్నజస్రం - బ్రహ్మచింతనమ్ । ఆసనం - తద్విజానీయా - దన్యత్సుఖ వినాశనమ్॥ సిద్ధయే - సర్వభూతాది - విశ్వాధిష్ఠాన - మద్వయమ్ । యస్మిన్ - సిద్ధింగతా - స్సిద్ధా - స్తత్ - సిద్ధాసన - ముచ్యతే।)—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, శిష్యా! కాయక్లేశము, అలసట, జాడ్యము, నిద్ర, ఆయాసము మొదలైనవి ఏబ్రహ్మనిష్ఠయందు తోచకుండునో ఆ బ్రహ్మస్వరూపానుభూతియే సుఖాసన మనబడును గాని, అభ్యాసయోగమునందు చెప్పబడిన పద్మాసన కూర్మాసన వీరాసన కపాలాసన సిద్ధాసనాదులు జ్ఞానాసనంబులు గాజాలవు మఱియు, శిష్యా! ఏది సిద్ధమైనదో, లోకులు ఏస్వరూప మైనప్పుడే అణిమాది సకల సిద్ధులున్ను ప్రయత్నము లేక నే సిద్ధించునో అదే పరబ్రహ్మ మనబడును. అదే సిద్ధాసన మనబడును. (8) మూలబంధన మనగా.—(శ్రుతి: యన్మూలం - సర్వలోకానాం - యన్మూలం - చిత్తబంధనమ్ । మూలబంధ-స్సదా సేవ్యో - యోగ్యోసౌ-రాజయోగినామ్ )—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, ఎది ఈ చరాచరజగత్తునకు మూలకారణమైనదియో, ఏది సకలబంధములను నాశనము చేయునో, దేని యెఱిగినవత్స

ణమే మాయాబంధము తనకు తానే నశించినప్పుడో అదియే పరబ్రహ్మ మనియు, మూలబంధ మనియు చెప్పబడును గాన, జ్ఞానయోగీశ్వరులును అట్టి పరబ్రహ్మ మనెడి మూలబంధమునందే యుందురు గాని. అభ్యాసయోగులరీతిగా కష్టములైన యోగశాస్త్ర మునందు చెప్పబడిన మూలబంధ జాలంధ బంధ ఒడ్యాణబంధనంబులను అభ్యాసము చేయజాలరు. —(9) దేహసామ్య మనగా.—(శ్రుతి॥ అంగానాం - సమతాం-విద్యా-త్సమే - బ్రహ్మణి - లీయతే। నోచే న్నైవ - సమానత్వం - ఋజుత్వం - శుష్క-వృక్షవత్॥)—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, శిష్యా! సముద్రమునందు చేరినట్టి నదులు ఆ సముద్రరూప మైనట్లు, చిద్రూపమగు పరబ్రహ్మమునందు సకలేంద్రియ వృత్తులున్ను లయించి సమభావము నొందుటే దేహసామ్య మనబడును. ఎండినటువంటి మోటుమానురీతిగా దేహము కదలక మెదలక నేరుగా నిలిచి యుండునట్లు నిష్ఠవేళ యందు అభ్యాసపఱచుట కర్మయోగులు జేయు దేహసామ్యము అనబడును. (1) దృక్ స్థితి యనగా—(శ్రుతి॥ దృష్టిం - జ్ఞానమయీం కృత్వా-పశ్యేత్ - బ్రహ్మమయం - జగత్ । సా దృష్టిః - పరమోదారా - ననాసాగ్రావ - లోకినీ । ద్రష్టృ - దర్శన - దృశ్యానాం - విరామో - యత్రవా - భవేత్ । దృష్టి - స్తత్రైవ - కర్తవ్యా - ననాసాగ్రద - లోకినీ॥—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, శిష్యా! చూపును జ్ఞానమయ మైనదిగా జేసి, అట్టి జ్ఞానమయ మైన చూపుచేత ఈ చరాచరజగత్తు సర్వమున్ను బ్రహ్మస్వరూపముగా జూడవలయును. అట్టి జ్ఞానమయ మైన చూపే శ్రేష్ఠ మైనదిగాని, (నాసికాగ్రమును) అనగా భ్రూమధ్యమును జూచుచుండునట్టి చూపు శ్రేష్ఠ మైనది గాజాలదు. మఱియు, ఆకాశాది పంచభూతములున్ను సర్వకాలదేశములున్ను దేహేంద్రియ ప్రాణమనోబుద్ధి చిత్తాహంకారములున్ను విద్యావిద్యలున్ను సకల ప్రపంచమున్ను దృశ్యములనబడును. ఈ దృశ్యములను అన్నిటిని ఏశుద్ధ తెలివి యెఱుగుచున్నదో, ఆ శుద్ధ తెలివియే పరమదృక్కు అనియు, ఆత్మ అనియు, పరబ్రహ్మ మనియు చెప్పబడును. మఱియు, శిష్యా! (త్రిపుటి) అనగా మాయాసంబంధము లగు (ద్రష్ట) అనగా జీవుడున్ను, (దృక్కు) అనగా బుద్ధిన్ని, (దృశ్యము) అనగా ఈచరాచర ప్రపంచమున్ను ఈ మూడున్ను ఏపరబ్రహ్మమునందు లయించునో, ఆపరబ్రహ్మమే శుద్ధ తెలివి, పరమదృక్కు అని చెప్పబడును. అట్టి పరమదృక్కగు (పరబ్రహ్మమునందే) అనగా శుద్ధ తెలివియందే దృష్టిని నిలువువారే జ్ఞాను లనబడుదురు. (నాసాగ్రమందు) అనగా భ్రూమధ్యమందు దృష్టి నిలిపి యోగపంచముద్రలను పట్టి సాధించు యోగులు జ్ఞానులు గాజాలరు సుమా! కాబట్టి భ్రూమధ్యమందు దృష్టిని నిలుపరాదు

## జ్ఞానయోగమునందలి పంచముద్రలు.

సుమా! శిష్యా! జ్ఞానయోగమునందలి పంచముద్రలు యెట్లనగా (1) ఏచూపు (బాహ్యేంద్రియములను) అనగా జ్ఞానేంద్రియ కర్మేంద్రియంబులను చూచుచుండునో,

ఆ చూపే కెలిమూపనియు, జ్ఞాన భూచరీముద్ర యనియు చెప్పబడును (2) ఏచూపు (అంతరింద్రియవృత్తులను) అనగా మనోబుద్ధి చిత్తాహంకారములను, వాటి వృత్తులను చూచుచుండునో, ఆ చూపే లోచూపనియు, జ్ఞానయోగమునందలి అంతశ్చరీముద్ర యనియు చెప్పబడును. (3) ఏచూపు బాహ్యేంద్రియ అంతరింద్రియంబులు రెంటి యొక్క వృత్తులను సమముగా చూచుచుండునో, ఆ చూపే మధ్యలక్ష్యముద్ర యనబడును. (4) ఏ చూపు మనస్సును జ్ఞానేంద్రియము లైదింటిని మొత్తము ఈ యాఱింటిని చూచుచుండునో, ఆ చూపే జ్ఞానషణ్ముఖీముద్ర యనబడును. (5) ఏ చూపు ఈ నాలుగు చూపులను చూపించుచున్నదో, (ఆ చూపే) అనగా శుద్ధ తెలివియే, అనగా కేవల ప్రజ్ఞయే, బ్రహ్మ మని తెలిసి సకల సంకల్పములు నశించి, కేవల శుద్ధ తెలివిమాత్రముగా నుండుటే జ్ఞానశాంభవీముద్ర యనియు, ఉత్తరశాంభవీముద్ర అనియు చెప్పబడును. శిష్యా! అట్టి శుద్ధ తెలివిమాత్రముగా నుండు జ్ఞానశాంభవీ ముద్ర యనెడి చూపే సకలచూపులలోపల శ్రేష్ఠమైనది. అది తెలిసినవారే బ్రహ్మ జ్ఞానులు గాని, భ్రూమధ్యమందు చూపునిలిపి నాదబిందుకళలను చూచుచుండువారు

## జ్ఞానప్రాణాయామము.

జ్ఞానులు గాజాలరు. (11) ప్రాణాయామ మనగా.—(శ్రుతి। చిత్తాది- సర్వభావేషు- బ్రహ్మత్వేనైవ - భావనాత్ । నిరోధ - స్సర్వవృత్తీనాం - ప్రాణాయామ - స - ఉచ్యతే॥ నిషేధనం - ప్రపంచస్య - రేచకాఖ్య - స్సమీరితః । బ్రహ్మైవాస్మీతి - యావృత్తిః - పూరకో - వాయురుచ్యతే । తత స్తద్వృత్తి - నైశ్చల్యం కుంభకం - ప్రాణసంయమః । అయంచాపి - ప్రబుద్ధానా - మజ్ఞానం - ఘ్రాణపీడనమ్॥) — అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, నానావిధరూప నామములు గల భూషణములన్నియును బంగారుకంటెను వేఱుగా లేనట్లు, దేహేంద్రియ ప్రాణమనోబుద్ధి చిత్తాహంకారాది ప్రపంచము సర్వమున్ను బ్రహ్మముకంటెను వేఱుగా లేనందున సర్వమును చిన్మాత్ర స్వరూప మగు బ్రహ్మముగా నెఱింగి, ఆ బ్రహ్మము తానుగా భావించి తదాకారముగా నుండినయెడల ప్రాణవాయువు, అంతకరణము, దాని సంబంధమగు సకలవృత్తులు, తమకు తామే ఆత్మస్వరూపు డగు తనయందు లయించి పోవును. అట్లు సకల వృత్తులున్ను తనయందు లయించుటే ప్రాణాయామ మనబడును. (1) రేచక మనగా, రూపనామక్రియలన్నియు అసత్య మనియు, మాయాకార్యము లనియు తెలిసి, అవి తానుగా నని వాటియందలి భ్రాంతిని విడిచిపెట్టుట. (2) పూరక మనగా, ఆత్మ స్వరూపు డగు తాను రూపనామక్రియలు లేని పరబ్రహ్మ మని భావించుట. (3) కుంభక మనగా, అట్లు ఆత్మస్వరూపుడగు తాను బ్రహ్మమను ధ్యానమునున్ను విడిచి పెట్టి సకల సంకల్పములు నశించి కేవల ప్రజ్ఞామాత్రముగా బ్రహ్మస్వరూపుడుగానే యుండుట ఇట్టి జ్ఞాన రేచక పూరక కుంభకము లనెడి ఈ జ్ఞానప్రాణాయామమ

బ్రహ్మజ్ఞానులు సదా అభ్యాసము చేయుదురు గాని, అజ్ఞానులరీతిగా ముక్కునుపట్టి పీడించుట, ప్రాణవాయువును బంధించుట అనెడి కష్టయోగ ప్రాణాయామమును అభ్యాసము చేయజాలరు. (12) ప్రత్యాహారమనగా—(శ్రుతి॥ విషయేష్వాత్మతాం - దృష్ట్వా - మనస - శ్చిత్తరంజకమ్ । ప్రత్యాహార - స్సవిజ్ఞేయోఽభ్యస - నీయో - ముహుర్ముహుః)—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, నిత్యానిత్యము లగు చేతనా చేతనములు సర్వమున్ను సచ్చిదానంద పరబ్రహ్మముగా భావించుటే ప్రత్యాహార మనబడును. (13) ధారణ యనగా.—(శ్రుతి॥ యత్రయత్ర - మనోయాతి - బ్రహ్మణ స్తత్ర - దర్శనాత్ । మనసా - ధారణం చైవ - ధారణా - సా పరమా - మతా॥)—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, మనస్సు దేనిదేనియందు వ్యాపించునో, ఆ వస్తువు లన్నిటిని పరబ్రహ్మమను గతిని మనస్సున నిల్పుటె ధారణయనబడును. (14) ఆత్మ ధ్యానమనగా.—(శ్రుతి॥ బ్రహ్మైవాస్మీతి - సద్వృత్త్యా - నిరాలంబతయా - స్థితిః । ధ్యానశబ్దేన - విఖ్యాతః - పరమానంద దాయకః॥)—అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, దేహేంద్రియ ప్రాణమానసాది సకలదృశ్యములు నేను గాను, ఈ దృశ్యము లన్నిటిని తెలియుచుండెడి దృగ్రూపమగు పరబ్రహ్మమే నేనని సదా చింతించు చుండుటే ఆత్మధ్యాన మనబడును. (15) సమాధి యనగా—(శ్రుతి॥ నిర్వికార తయా - వృత్త్యా - బ్రహ్మాకారతయా - పునః । వృత్తి - విస్మరణం - సమ్యక్ - సమాధి - రభిధీయతే॥)—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, ఆత్మస్వరూపుడగు నేనే బ్రహ్మ మనెడి ధ్యానమునున్ను మఱచి, తాను వృత్తిశూన్యుడై సదా కేవల నిర్గుణ నిర్వికార చిన్మాత్రముగా నుండుటే సహజ నిర్వాణసమాధి యనబడును. శిష్యా! ఈ పదియేను అంగములను సదా అభ్యాసము చేయువాడే జ్ఞానయోగి యన బడును. అతడే బ్రహ్మైక్య మనెడి విదేహకైవల్యముక్తిని పొందునుగాని, తక్కినవారు యెంతకష్టపడినను పొందజాలరు సుమా? మఱియు పరమహంసు డనగా నెవ డనగా,—(శ్రుతి॥ స్వప్రకాశ చిదానందం - స - హంస - ఇతి - గీయతే॥)—

## పరమహంసుని లక్షణము.

అనెడి బ్రహ్మవిద్యోపనిషత్తురీతిగా, స్వయంప్రకాశమై పరంజ్యోతియై జ్ఞానానంద స్వరూపమై సర్వసాక్షియై వెలుగుచుండు పరబ్రహ్మమగు ఆత్మయే హంస అనబడును.—(శ్రుతి॥ జ్ఞానాత్స్వరూపం - పరమం - హంసమంత్రం - సముచ్చరేత్ । ప్రాణినాం - దేహమధ్యేతు - స్థితోహంస - సదాచ్యుతః । హంసఏవ - పరం - సత్యం - హంస ఏవతు - శక్తికమ్ । హంసఏవ - పరోరుద్రో - హంసఏవ-పరాత్పరః । సర్వదేవస్య- మధ్యస్థో - హంసఏవ - మహేశ్వరః । సదా - సమాధిం - కుర్వీత - హంసమాత్ర - మనుస్మరన్ । నిర్మల స్ఫటికాకారం - దివ్యరూప - మనూపమమ్, మధ్యే - దేశే పరమహంస - జ్ఞానముద్రాత్మకమ్)—అనెడి బ్రహ్మవిద్యోపనిషత్తురీతిగా, అట్టి (శ[illegible]రూపమైన (హంసయే) అనగా ఆత్మయే దేహమధ్యంబున బుద్ధియనెడి గుహ

లోపల స్వయం ప్రకాశముగా సాక్షి స్వరూపముగా వెలుగుచున్నది. ఆ హంసయే బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనబడును. పిపీలికాది బ్రహ్మపర్యంతము సకలదేహములందు ఆ హంస వ్యాపించి యుండుటవల్లనే దేవ మానవ క్రిమి కీటకాది సకలమైన జంతువు లున్ను జీవించుచు సకలకార్యములు చేయుచుండును; లేకున్న యెడల పీనుగులుగా నుందురు. కాబట్టి ఆ హంసయే పరమాత్మ యనబడును, అట్టి హంసమంత్రమును సదా

## హంసభావరహస్యము.

జపించుచు బ్రహ్మనిష్ఠయందుండువాడే పరమహంస యనబడును.—(శ్రుతిః జాగ్రత్స్వప్న - ద్వయోర్మధ్యే - హంసఏవ - ప్రకాశతే । సకారః - ఖేచరీప్రోక్తా - త్వంపదంచేతి - నిశ్చితమ్ । హకారః - పరమేశః - స్యాత్ - తత్పదంచేతి - నిశ్చితమ్ । సకారో ధ్యాయతే - జంతుః - హకారోహి - భవేత్ - ధ్రువమ్) అనెడి యోగచూడామణ్యుపనిషత్తురీతిగా (హంస) అనెడి పదములో (హ) అనెడి అక్షరము, బిందువు, (స) అనెడి అక్షరము ఈ మూడున్ను చేరియున్నది. అందులో, హ - అనగా పరమాత్మ అనబడును. స - అనగా జీవుడు అనబడును; హ - స-అనెడి రెండక్షరములకు మధ్యనుండు బిందువు, పరమాత్మయే జీవాత్మయనియు, జీవాత్మయే పరమాత్మయనియు ఐక్యమును బోధించుచున్నది గాన, హంసమంత్రమును జపించువాడు సత్యముగా పరమాత్మస్వరూప మగుచున్నాడు. ఇందుకు సందేహమేలేదు. ఇదిసత్యము. మఱియు—(శ్రుతి॥ సకారంచ - హకారంచ - జీవో - జపతి - సర్వదా)—అనెడి బ్రహ్మవిద్యోప నిషత్తురీతిగాను, మఱియు—(శ్రుతిః ప్రాణాపాన - వశో - జీవో - హ్యధశ్చోర్ధ్వం - ప్రధావతి । వామదక్షిణ మార్గేణ - చంచలత్వా - న్నదృశ్యతే । ఆక్షిప్తో - భుజదండేన - యథోచ్చలతి - కందుకః । ప్రాణాపాన-సమాక్షిప్త - స్తద్వజ్జీవో - నవిశ్రమేత్ । అపానాత్కర్షతి - ప్రాణో - ఉపానః - ప్రాణాచ్చ-కర్షతి । ఖగరజ్జువ - దిత్యేతత్ - యోజానాతి - సంయోగవిత్ । హకారేణ - బహిర్యాతి - సకారేణ - విశేత్పునః । హంసహం సేత్య మంత్రం- జీవో-జపతి- సర్వదా॥)—అనెడి ధ్యానబిందూప నిషత్తురీతిగా, బిడ్డలు చేతితో ఎగరవేయుబడిన చెండు పైకి క్రిందికి ఎగురుచు పడుచుండునట్లు, ప్రాణాపాన వాయువులు రెండున్ను ఈ దేహమధ్యంబున ప్రతిదినమున్ను 21600-సార్లు షడాధారములందు పైకి క్రిందికి ఎక్కుచు దిగుచు ద్వాదశాంగుళ అష్టాంగుళ ప్రమాణముగా రేచక పూరక రూపంబున నాసికా ద్వారములగుండా ఈ ప్రకారముగా ఇడ యనెడి సూర్యనాడినుండి పింగళ యనెడి చంద్రనాడి మార్గంబుగాను, పింగళ యనెడి చంద్రనాడినుండి ఇడ యనెడి సూర్యనాడి మార్గంబుగాను, మాటిమాటి తిరుగుచుండును. ఒక త్రాటియందు కట్టబడిన పక్షిని ఆ త్రాడు యెట్లు లాగుచుండునో, అట్లు రేచక పూరకంబు లనెడి ఈ ప్రాణాపానములు దీనికి నడుమనుండు జీవుని (పైకి క్రిందికి) వెలుపలికి బయటికి వచ్చుచు, మరల లోపలికి పోవుచు,

అనగా లోపలికి బయటికి ఊదుచుండును ఈ జీవుడు తద్ద్వారా హంసమంత్ర కీలకం బగు (సోహం) అనెడి పదమును తనకు తానే జపించుచుండును. ఈ రహస్యము తెలిసినవారే రాజయోగులు. మఱియు—(శ్రుతి॥ హంసహంసేతి-యో-బ్రూయాత్ -హంసో నామ-హరిశ్శివః। గురువక్త్రాత్తు - లభ్యంతే - ప్రత్యక్షం - సర్వతోముఖమ్॥)—అనెడి బ్రహ్మవిద్యోపనిషత్తు రీతిగా, బ్రహ్మైక్య కారణంబగు ఈ హంసస్వరూప సంచార రహస్యంబును గురుముఖంబుగా తెలిసి ధ్యానించువారే ఆత్మారామధ్యానము చేయు బ్రహ్మజ్ఞానులు అనబడుదురు. ఇట్లు హంసధ్యానము చేయువారు హరిహరాది దేవతల తోడ సమానులగుచున్నారు.—(శ్రుతి॥ సోహం- చిన్మాత్ర మేవేతి- చింతనం- ధ్యాన ముచ్యతే। ధ్యానస్య - విస్మృతిః - సమ్య - క్సమాధి - రభిధీయతే॥)—అనెడి త్రిశిఖ బ్రాహ్మణోపనిషత్తు రీతిగాను, మఱియు—(శ్రుతి॥ ఆనందాబ్ధిర్యత్పర - స్సోహమస్మి। ప్రత్యగ్ధాతు - ర్నాత్ర-సంశీతిర స్తి:—అనెడి మైత్రేయోపనిషత్తు రీతిగాను, మఱియు శ్రుతి॥ జ్ఞాత్వా - స్వం - ప్రత్యగాత్మానం - బుద్ధితద్వృత్తి - సాక్షిణమ్। సోహమిత్యే తత్ -వృత్త్యా - స్వాత్మన్యాత్మమతిం- త్యజేత్॥)— అనెడి అధ్యాత్మోపనిషత్తు రీతిగాను, సదా హంసరహస్యమగు (సోహంభావమును) సదా స్మరించు చుండుటే ఆత్మ ధ్యాన మనబడును. అట్టి ధ్యానమునున్ను మఱచి కేవల ప్రజ్ఞానమాత్రముగ తూష్ణీం భావ స్థితియం దుండుటే ఆత్మసాక్షాత్కార మనియు, నిర్వికల్ప సమాధి అనియు, బ్రహ్మనిష్ఠఅనియు చెప్పబడును. ఈ రహస్యమును తెలిసినవారే పరమహంస యన

## అ వ ధూ త ల క్ష ణ ము.

బడును. మఱియు అవధూత యనగా యెవడనగా, (శ్రుతి॥ అక్షరత్వాద్ - వరేణ్యత్వాద్ - ధూతసంసార - బంధనాత్। తత్త్వమస్యాది - లక్ష్యత్వా - దవధూత- ఇతీర్యతే॥)—అనెడి అవధూతోపనిషత్తు రీతిగా (అవధూత) అనెడి పదమునందు (అ-వ-ధూ-త) అని నాలుగక్షరము లున్నవి. అందులో (1) అ-అనగా నాశము లేనివా డనబడును. (2) వ-అనగా సకలమైన వారిలో శ్రేష్ఠుడు, అనగా బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్న్యాసము అనెడి నాలుగాశ్రమములలో నుండువారి కంటెను శ్రేష్ఠుడనబడును. దేహేంద్రియంబులే నే ననెడి అభిమానమే సంసార మనబడును; మఱియు చిత్తమే సంసారమనబడును; అట్లు అభిమానమే లేకపోవుటే సంసారత్యాజ్య మనబడును. మఱియు చిత్తము సంకల్ప శూన్యముగా నుండుటే సంసారత్యాజ్య మనబడును. (3) ధూ-అనగా అట్టి అభిమానమనెడి సంసారమును, చిత్తసంకల్పము అనెడి సంసారమును త్యజ్యము చేసినవా డనబడును. (4) త-అనగా తత్త్వమసి అనెడి మహావాక్య లక్ష్యార్థమగు బ్రహ్మాత్మ అభేద ఐక్యజ్ఞాన సాక్షాత్కారము గలవాడనబడును. కాబట్టి ఈ నాలుగక్షరములయొక్క రహస్యార్థములను తెలిసి తద్వత్తుగా నుండువారే అవధూత యనబడును. (శ్రుతి॥ యో - విలఘ్యాశ్రమాన్ - వర్ణానాత్మన్యేవ - స్థిత స్సదా - అతివర్ణాశ్రమీ - యోగీ - అవధూత - స్సకథ్యతే॥)—అనెడి అవధూతోప

షత్తు రీతిగా, వర్ణాశ్రమాదులు దేహమునకే గాని దేహేంద్రియాదులకంటెను వేరుగా నుండు ఆత్మకు ఏమియులేవని, ఆ వర్ణాశ్రమాదులను విడిచిపెట్టి పరబ్రహ్మమునకు అన్యమేమియు లేదను ప్రపంచైక్యమును కలిగి సదా తన్మయుండుగా నుండువాడే అవధూత యనబడును.—(శ్రుతి: యః శరీరేంద్రియాదిభ్యో - విహీనం - సర్వసాక్షిణమ్ । పారమార్థ - విజ్ఞానం - సుఖాత్మానం - స్వయంప్రభమ్ । పరతత్త్వం - విజానాతి - సోతివర్ణాశ్రమీ - భవేత్ ।)—అనెడి నారద పరివ్రాజకోపనిషత్తు రీతిగా, దేహేంద్రియాదులకు వేరై సర్వసాక్షియై మాయారహితమై స్వయంప్రకాశమై వెలుగుచుండు ఆత్మయే తానని తెలిసి, సదా తద్రూపముగా నుండువాడే అతివర్ణాశ్రమి, లేక అవధూత యనబడును.—(శ్రుతి: వర్ణాశ్రమాదయో - దేహే - మాయయా - పరికల్పితాః । నాత్మనో - బోధరూపస్య - మమ తే - సంతి - సర్వదా । ఇతి యో - వేద వేదాంతైః - సోతి వర్ణాశ్రమీ - భవేత్ ।)— అనెడి నారద పరివ్రాజకోపనిషత్తు రీతిగా, కులగోత్రములు వర్ణాశ్రమములు మాయచేత దేహమునకు కల్పింపబడియున్నది, ఆత్మస్వరూపుడను నాకు కులగోత్ర వర్ణాశ్రమాచారాదులు ఏవియు లేవు, దేహమే నేననెడి అభిమానము కలిగిన వారికి కులగోత్ర వర్ణాశ్రమాచారాదులు గలవు గాని, దేహేంద్రియములకు సాక్షిగా ఆత్మస్వరూపముగా నుండు నాకు ఏవియు లేవని కులగోత్ర వర్ణాశ్రమాదులను విడిచి పెట్టి సర్వమున్ను బ్రహ్మముగా భావించుచు సదా బ్రహ్మస్వరూపుడై యుండువాడే అతివర్ణాశ్రమి యనియు అవధూత యనియు చెప్పబడును.—(శ్రుతి: యస్య - వర్ణాశ్రమాచారో - గలిత - స్స్వాత్మదర్శనాత్ । సవర్ణానాశ్రమాన్ - సర్వానతీత్య - స్వాత్మని - స్థితః యోతీత్య స్వాశ్రమాన్ - వర్ణా - నాత్మన్యేవ - స్థితః - పుమాన్ । సోతివర్ణాశ్రమీ - ప్రోక్త - సర్వవేదార్థ - వేదిభిః ।)—అనెడి నారద పరివ్రాజకోపనిషత్తు రీతిగా, నిద్రించుచు తూగుచున్న వాని చేతనున్న వస్తువు జారిపడి పోయినట్లు, బ్రహ్మనిష్ఠ అనెడి నిద్రకెంచి నిద్రించుచు వర్ణాశ్రమాచారాదులు సకలమును విడిచిపెట్టినవాడే అతివర్ణాశ్రమి, అవధూత—(శ్రుతి: ఆనంద - మంతర్నిజమాశ్రయంత - మాశాపిశాచీ - మవమానయంతమ్ । ఆలోకయంతం - జగదింద్రజాలం - మాపత్క-థం-మాం - ప్రవిశేదసంగమ్ । వర్ణాశ్రమాచార - యుతా - విమూఢాః - కర్మానుసారేణ - ఫలం - లభంతే । వర్ణాదిధర్మంహి - పరిత్యజంత - స్స్వానంద-తృప్తాః - పురుషాః - భవంతి ।)—అనెడి మైత్రేయోపనిషత్తు రీతిగా, అంతరంగ దృష్టిచే సదా సచ్చిదానంద పరబ్రహ్మమును దర్శించుచు, ఆశ యనెడి పిశాచమును అవమానించి తిరస్కరించుచు, జగత్తును ఇంద్రజాలము రీతిగా భావించి తనలో తాను నవ్వుకొనుచు సకల దుఃఖములున్ను శరీరమునకే గలవుగాని శరీరముకంటెను వేరుగానుండు నాకు ఏ దుఃఖమున్ను లేదు, ఆత్మస్వరూపుడను నేను సదానందుండను అని సదా నిత్యానంద సాగరంబున మునిగి నిర్భయుండుగా నుండు వతే అతివర్ణాశ్రమి, అవధూత, అజ్ఞానులే కుల గోత్ర వర్ణాశ్రమాచారాదులు గలవారై ఆ వర్ణాశ్రమధర్మములకు

తగిన నిత్యనైమిత్తిక కామ్యకర్మములు చేయుచు తత్ఫలంబు అనుభవించుటకుగాను పునర్జన్మముల పొందుచుందురు, కాబట్టి వర్ణాశ్రమాచారాది ధర్మములను విడిచిపెట్టి సదా స్వస్వరూపమును ధ్యానించుచు తన్మయంబుగా నుండువాడే అతివర్ణాశ్రమి, అవధూత అనబడును గాని బ్రహ్మజ్ఞానము యిట్టిదని తెలియక కౌపీనమును వర్జించి తిరుగుటవల్లనే అవధూత గాజాలడు. మఱియు బ్రాహ్మణుడనగా యెవడనగా.—

## బ్రాహ్మణలక్షణము.

(శ్రుతి। తదేతదృచాభ్యుక్తం - ఏష - నిత్యోమహిమా - బ్రాహ్మణస్య - నవర్ధతే - కర్మణా - నోకనీయాన్। తస్యైవ - స్యాత్పదవిత్తం - విదిత్వా - నలిప్యతే - కర్మణా - పాపకేనేతి తస్మాదేవం - విచ్ఛాంతో - దాంత - ఉపరతి - స్తితిక్షు - స్సమాహితో - భూత్వా - ఆత్మన్యేవాత్మానం - పశ్యతి।సర్వమాత్మానం - పశ్యతి। నైనం - పాప్మా - తరతి। సర్వం - పాప్మానం - తరతి నైనం - పాప్మా - తపతి సర్వం - పాప్మా - తపతి విపాపో - విరజో - విచికిత్సో - బ్రాహ్మణో - భవతి॥)—అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగా, బ్రాహ్మణత్వము బ్రహ్మజ్ఞానము వలన సిద్ధించుగాని కర్మానుష్ఠానమువలన సిద్ధింపదు. అట్టి బ్రహ్మజ్ఞానము గల బ్రాహ్మణుడు కర్మానుష్ఠానము చేయజాలడు ? ఒకవేళ లోకుల కొఱకు తాను కర్మానుష్ఠానము చేసినను తాను కర్మబద్ధుడు గాజాలడు. శాంతి దాంతి ఉపరతి తితీక్ష శ్రద్ధ సమాధానము లనెడి శమాదిషట్కసంపత్తి గలవాడై ఆత్మ స్వరూపుడైన తన్ను తాను బ్రహ్మముగా తెలుసుకొని, సదా ఆత్మానుసంధానమును చేయుచు ప్రపంచము సర్వమును బ్రహ్మస్వరూపమని భావించునట్టి అహంకారరహితుడే బ్రాహ్మణుడు గాని, జన్మముచేతను కర్మానుష్ఠానముచేతను బ్రాహ్మణుడు గాజాలడు—(శ్రుతి తమేవ - ధీరో - విజ్ఞాయ - ప్రజ్ఞాం - కుర్వీత - బ్రాహ్మణః। నానుధ్యాయాద్ - బహూన్ఛబ్దాన్ - వాచో - విగ్లాపనంహి - తత్॥)—అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగా, బ్రహ్మజ్ఞానముగలవాడే బ్రాహ్మణు డనబడును. బ్రహ్మజ్ఞానము కోరువాడు శమదమాది సద్గుణ సంపన్నుడై శ్రవణ మననములను చేసి బ్రహ్మతత్త్వమును తెలుసుకొని, అట్టి బ్రహ్మసాక్షాత్కారమును పొందుటకుగాను సదా నిదిధ్యాసనము చేయుచుండవలయును. తదితరములైన ప్రపంచవ్యవహారములను గూర్చి వ్యర్థవాదము చేయుచుండ రాదు ఎందువల్ల ననగా, అట్లు వ్యర్థ వాదము చేయుటవలన వాగింద్రియమునకు అలసట గలుగును గాన వ్యర్థవాదము చేయరాదని నిషేధింపబడినది. అయితే తన్ను ఆశ్రయించిన శిష్యులకు తత్త్వోపదేశము చేయుచుండుట మాత్రము వృథావాదము గాజాలదు గాన అది నిషేధము గాజాలదు. యును వ్యాసాది మహర్షులచే జీవన్ముక్తుడగు జ్ఞానియే బ్రాహ్మణుడని చెప్ప చు[illegible]డి. [illegible]ందుకు వ్యాసమహాఋషి వాక్యములు యేవనగా.—(శ్లో॥ అనుత్తరీయ

వసన - మనుపశీర్ణ - శాయినమ్ । బాహూపధాయినం - శాంతం - తం - దేవాః - బ్రాహ్మణం - విదుః )—అనగా ఉత్తరీయ వస్త్రమును త్యజించినవాడును, దాపముత్తదిండ్లు మొదలైనవి లేకయే కేవలము భూమియే పడకగా శయనించువాడును, భుజమునే దిండుగా తలక్రింద వుంచుకొనువాడును, దేవతలచే స్తోత్రము చేయబడినవాఁడును బ్రాహ్మణు డనబడును.—(శ్లో॥ యేనకేన - చిదాచ్ఛన్నో - యేనకేన-చిదాశితః । యత్రక్వచన - శాయీ - స్యాత్తం - దేవాః - బ్రాహ్మణం - విదుః॥) అనగా, ఒకవేళ శరీరపోషణార్థముగా భోజనమును వస్త్రమును పడకను కోరినప్పటికిన్ని, ఇది మంచిది ఎక్కువైనది అని వానియందు గుణదోషము లెంచక యథాలాభ సిద్ధములగు వస్త్రమును పడకను అనుభవించుచు, సదా అపరోక్ష జ్ఞానసాక్షాత్కారమునం దుండు వాఁడే దేవతలచే స్తుతింపబడిన బ్రాహ్మణు డనబడును.—(శ్లో॥ కంథా- కౌపీన-వాసాస్తు-దండధృత్- ధ్యానతత్పరః - ఏకాకీ గమతే- నిత్యం - తం-దేవాహ -బ్రాహ్మణం-విదుః॥)—అనగా, శీతమును నివారించుటకుగాను బొంతమును, కౌపీనమును, కాషాయమును, దండమును దరించి, సదా ఆత్మానుసంధానపరుండయి జనసంఘములో నుండక ఏకాంతముగా నుండునట్టివాఁడే దేవతలచే పొగడదగిన బ్రాహ్మణుడు.—(శ్లో॥ యోహిశివ - గణాద్భీత - సమ్మానా - న్నరకాదివ । కుణపాదివ - యః స్త్రీభ్యం - స్తం - దేవాం - బ్రాహ్మణం - విదుః॥)—అనగా లోకులు సర్పమును జూచి భయపడునట్లు జనసమూహమును జూచి వెఱచువాడును, తనకు లోకులు చేయునట్టి సన్మానములను నరకములకు సమానముగా నెంచువాడును, స్త్రీలను పీనుగువలె తలంచి తిరస్కరించువాడును, సదా జ్ఞానానుభవనిష్ఠయం దుండువాడును, దేవతలచే బ్రాహ్మణుడనబడు.—(శ్లో॥ యేన - పూర్ణ - మివాకాశం - భవత్యేకేన - సర్వదా । శూన్యం—యస్య- జనాకీర్ణం - తం దేవా-బ్రాహ్మణం - విదుః॥)—అనగా, ఆకాశమువలె సర్వపరిపూర్ణముగా నుండు బ్రహ్మమే తానని ఆత్మానుసంధానము చేయుచు, సదా పరిపూర్ణ భావమునం దుండుచు, తన సమాధినిష్ఠలకు జనసంఘమయిన చోటు తగదని తలంచి ఏకాంతస్థలమునం దుండువాఁడే దేవతలచే కొనియాడదగిన బ్రాహ్మణు డనబడును. మఱియు—(శ్రుతి॥ యేన- సర్వమిదం- ప్రోతం- సూత్రే- మణిగణా- ఇవ । తత్సూత్రం- ధారయేద్యోగీ- యోగవిత్తత్త్వ- దర్శివాన్ । బహిస్సూత్రం- త్యజేద్విద్వాన్- యోగముత్తమమాశ్రితః । బ్రహ్మభావమిదం - సూత్రం - ధారయే ద్యః - స్సచేతనః ధారణాత్తస్య - సూత్రస్య - నోచ్ఛిష్టో - నాశుచిర్భవేత్ । సూత్రమంతర్గతం - యేషాం - జ్ఞానయజ్ఞోపవీతినామ్ । తేవై - సూత్రవిదో - లోకే - తేచ - యజ్ఞోపవీతినః॥ జ్ఞానశిఖినో- జ్ఞాననిష్ఠాః - జ్ఞానయజ్ఞోపవీతినః । జ్ఞానమేవ - పరం - తేషాం - పవిత్రం-జ్ఞానముచ్యతే॥)—అనెడి బ్రహ్మోపనిషత్తు రీతిగా, ఒక ముత్యాల హారమునందుగల ముత్యము లందంతట ఒకసూత్రమే వ్యాపించియుండునట్లు, సకల జీవజంతువుల హృదయంబున పరమాత్మ ఒక్కఁడే వ్యాపించియున్నాడు గాన, అట్టి పరమాత్మయే మహా

సూత్రము, మహాయజ్ఞోపవీతము, నిజమయిన జ్ఞానజంధ్యము అనబడును. అట్టి పర సూత్రమైన బ్రహ్మమును తెలిసి బ్రహ్మానుసంధానము చేయుటయే యజ్ఞోపవీత ధార అనబడును. బ్రహ్మజ్ఞానియైన బ్రాహ్మణుడు అట్టి బ్రహ్మానుభూతి అనెడి పరమసూత్ర మును ధరించి నూలుపోగుల జంజమును త్యజింపవలెయును, అట్టి పరమసూత్రము ధరించిన జ్ఞానబ్రాహ్మణునకు ఉచ్ఛిష్టము శుచి అనెడి భేదము లేనేలేదు. సర్వ మున్న అభేదబ్రహ్మ స్వరూపముగానే యుండును. అట్టి బ్రహ్మమనెడి సూత్రము తెలిసి సదా దానిని ధ్యానించుచుండువాడే సూత్రము ఇట్టిదని తెలిసినవాడు, యజ్ఞో పవీతమును ధరించిన బ్రాహ్మణుడు అనబడును. అట్టి బ్రహ్మసూత్ర మెఱిగినవాడే జీవిం యుండువాడు, తక్కినవారు జీవించియుండియు పీనుగులతో సమానులే. నూలుపోగు జంధ్యమును ధరించినవాడు బ్రాహ్మణుడు గాజాలడు. బ్రహ్మజ్ఞానము గలవా బ్రాహ్మణు డనబడును గాని, జన్మముచేతను కర్మానుష్ఠానముచేతను, నూలుపోగుల జంధ్య మును ధరించుటచేతను బ్రాహ్మణుడు గాజాలడు.—

శ్రుతి॥ నిరాలంబోపనిషదం — యో అధీతే - గుర్వనుగ్రహత - సోఽగ్నిపూతో భవతి । స వాయుపూతో - భవతి । నస - పునరావర్తతే - నస - పునరావర్తతే పునర్నాభి - జాయతే - పునర్నాభి - జాయత - ఇత్యుపనిషత్॥ పూర్ణమద - ఇ శాంతిః పాఠః - ఓం - నిరాలంబోపనిష త్సమాప్తా.

తాత్ప॥ సద్గురు కరుణా కటాక్షముచేత ఈ నిరాలంబోపనిషత్తును యెవడు మొదటినుండి కడవఱకు అర్థముతోడ చదువుచున్నాడో అతడు అగ్నివలె పవిత్రు డగుచున్నాడు. అతడు వాయువువలె పవిత్రుడగుచున్నాడు. అతనికి పునరావృ లేదు. అతనికి పునరావృత్తిలేదు, అతనికి పునర్జన్మము లేదు, అతనికి పునర్జన్మ ఈ ఉపనిషత్తు పరమరహస్యము. ఇది పరమ గోప్యము. ఈ ఉపనిషత్తు ప్రారం ములో (పూర్ణమదః - శాంతిః) అనెడి వాక్యములు తాత్పర్యములో చదివినట్లు ఇక్కడనున్న ఈ ఉపనిషత్తు అంత్యమునందును ఆ ప్రకారముగా చదువవలయును.— నిరాలంబోపనిషత్తు సంపూర్ణము.

---

శ్రీరస్తు.

కృష్ణయజుర్వేదమునందలి.

## అమృతబిందూపనిషత్తు - తాత్పర్యసహితము.

ప్రారంభము.

శ్రుతి॥ సహనా - వవతు । సహనౌ-భునక్తు । సహ - వీర్యం - కరవావహై తేజస్వినా - వధీతమస్తు । మావిద్విషావహై॥ ఓం - శాంతి - శ్శాంతి - శ్శాంతిః॥

తా॥ సచ్చిదానందస్వరూపి యగు పరబ్రహ్మము గురుశిష్యు లగు మమ్మును కాపాడును గాక. ఆ పరబ్రహ్మము సదా బ్రహ్మవిచారమునందే కాలము గడుప నిచ్చుగల మాయందు ప్రీతినుంచును గాక. ఆ పరబ్రహ్మము కటాక్షమువలన వేదాంత శ్రవణ మననాదులను పొందుటకు మాకు శీర్యముగలుగు గాక. స్వయంజ్యోతి యగు ఆత్మానుభవము మాకు గలుగును గాక. గురుశిష్యరూపులైన మాకు ద్వేషము మొదలగు దుర్గుణములు లేకపోవును గాక. ఓ భగవంతుడా! నారాయణా! పరబ్రహ్మమా! ఓం శాంతము శాంతము శాంతము.—

## మా న స ల క్ష ణ ము.

శ్రుతి॥ ఓం - మనోహి - ద్వివిధం - ప్రోక్తం, శుద్ధం చా శుద్ధ మేవచ। అశుద్ధం - కామసంకల్పం, శుద్ధం - కామ - వివర్జితమ్॥

తా॥ శిష్యా! మనస్సు శుద్ధము అశుద్ధము అని రెండువిధములు. కామ క్రోధ లోభ మోహాది సంకల్పసహిత మైన మనస్సు అశుద్ధ మనియు, కామ క్రోధ లోభ మోహాది సంకల్పరహిత మై, శమదమాది సద్గుణంబులు, విషయవైరాగ్యము, ఆత్మానాత్మవివేకము మొదలైనవి గలిగియుండు మనస్సు శుద్ధ మైనదనియు చెప్పబడును—

శ్రుతి॥ మన ఏవ జగత్సర్వం - మనఏవ - సదారిపుః। మనఏవహి - సంసారో - మనఏవ - జగత్రయమ్। మనఏవ - మహద్దుఃఖం - మనఏవ - జరాదికమ్। మనఏవహి - కాలంచ - మనఏవ - మలం - తథా। మన ఏవహి - సంకల్పో - మనఏవహి - జీవకః। మనఏవహి - చిత్తంచ - మనోహంకార - ఏవచ। మనఏవ - మహద్బంధం - మనోంతఃకరణంచ - తత్। మనఏవహి - భూమిశ్చ - మనఏవహి - తోయకం। మనఏవహి - తేజశ్చ - మనఏవ - మరున్మహాన్। మనఏవహి - చాకాశం - మన ఏవహి - శబ్దకమ్। స్పర్శో - రూపం - రసంగంధం - కోశాఃపంచ - మనోభవాః। జాగ్రత్స్వప్న - సుషుప్త్యాది - మనోమయ - మితీరితమ్। దిక్పాలా - వసవో - రుద్రా - ఆదిత్యాశ్చ - మనోమయాః। దృశ్యం - జడం - ద్వంద్వజాత - మజ్ఞానం - మానసం - స్మృతమ్। సంకల్పమేవ - యత్కించిత్ - తత్త్వం - నాస్తీతి-నిశ్చితు। నాస్తినాస్తి - జగత్సర్వం - గురుశిష్యాదికం - నహి॥)—అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, శిష్యా! బంగారు ఒక్కటే నానావిధరూప నామములు గలిగి నానావిధ భూషణములుగా అయినట్లు, మనస్సు ఒకటియే నానావిధరూప నామములు గలిగి ప్రపంచరూపముగా కనబడుచున్నది. అట్టి మనస్సే గొప్ప శత్రువుగా నున్నది. ఇదియే సంసార రూపముగాను, జగత్రయముగాను వున్నది. మనస్సే దుఃఖస్వరూప మయినదిగా నున్నది. అదే బాల్య యౌవన కౌమార వార్ధిక్యములుగా నున్నది. అదే కాలరూపముగాను మలరూపముగాను వున్నది. మనస్సే సంకల్ప వికల్పముగాను, జీవ రూపముగాను, బుద్ధి చిత్తము అహంకారముగాను, అంతఃకరణముగాను [illegible]. మనస్సే

బంధముగా నున్నది. మనస్సే ఆకాశాది పంచభూతములుగాను, శబ్ద స్పర్శాది పంచ తన్మాత్రలుగాను, అన్నమయాది పంచకోశములుగాను, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ పంచ ప్రాణములుగాను, కామ క్రోధ లోభ మోహాదులుగాను, సత్త్వరజ స్తమోగుణములుగాను వున్నది. జాగ్రత్త స్వప్నము సుషుప్తి అనెడి అవస్థాత్రయమున్ను మనోమయముగానే యున్నది. అష్టదిక్పాలురున్ను అష్టవస్తువులున్ను ఏకాదశ రుద్రులున్ను ద్వాదశాదిత్యులున్ను మనస్సుగానే యున్నది. దృశ్యము లన్నియు మనస్సుగానే యున్నది. మనస్సే (ఎఱుకమఱపులుగా) అనగా జ్ఞానాజ్ఞానములుగాను, గురుశిష్యులుగాను, మాయ అవిద్యలుగాను వున్నది. రూపనామములుగల ఈ చరాచర ప్రపంచము సర్వ

## మనస్సు శునకమువంటిది.

మున్ను మనస్సుగానే యున్నదిసుమా.—(శ్రుతి॥ ఇతశ్చేతశ్చ-సువ్యగ్రం-వ్యర్థమేవాభిధావతి । మనో - దూరతరం - యాతి - గ్రామే - శాలేవ శునో - యథా॥)— అనెడి మహోపనిషత్తు రీతిగా, శిష్యా! మనస్సు ఇది మంచిది, ఇది చెడ్డదని విచారించి చెడ్డదానిని పరిత్యజించి మంచిదానిని పట్టుకొనక సర్వవస్తువులందును ఆశగలిగి గ్రామ శునకమువలె ఇక్కడి కక్కడికి నలుగడ వ్యర్థముగా తిరుగుచుండును స్వర్గమర్త్య పాతాళ లోకములకు ఒక క్షణములోపల తిరిగితిరిగి సంచరించుచుండును. ఇట్లు మనస్సు నలుగడల సంచరించుటవల్లనే యెల్లవారికి జనన మరణ దుఃఖంబులు గలుగుచుండును. (శ్రుతి॥ స్వసంకల్పిత - తన్మాత్రా - జాలాభ్యంతర - వర్తిచ । పరాం - వివశతా - మేతి - శృంఖలాబద్ధ - సింహవత్॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, శిష్యా! జీవుడు మనోవశుడై విషయ వాసనాలోలుడై, సింహము సంకిళ్ల గొలుసుచే కట్టబడినట్లు సంసారములో దగులుకొని సుఖదుఃఖము లనుభవించుచు జననమరణ సాగరంబున మునిగి అల్లాడుచుండును.

(శ్రుతి॥ మనఏవ - మనుష్యాణాం - కారణం - బంధమోక్షయోః । బంధాయ విషయాసక్తం - ముక్త్యై - నిర్విషయం - స్మృతమ్॥—

తా॥ శిష్యా! మనస్సే బంధమోక్షములకు కారణముగా నున్నది, స్త్రీ చందన పుష్పతాంబూలాది విషయములందు ఆశ గలిగిన మనస్సు అశుద్ధమైనది గాన, దానివలన జీవునికి బంధము కలుగును. విషయాసక్తిని పొందనట్టి మనస్సు శుద్ధమైనది గాన, దానివలన జీవునికి మోక్షము సిద్ధించును. ఎట్లనగా, (శ్లో॥ వాయునా - జాయతే - మేఘః - పునస్తేనైవ - లీయతే । మనసా - కల్ప్యతే - బంధో - మోక్షస్తేనైవ - కల్ప్యతే॥)—అనునట్లు, నిర్మలమైన ఆకాశంబున మేఘములు గల్గుటకును, మరల ఆ మేఘములు లేకపోవుటకును వాయువే కారణముగా నుండునట్లు, మనుష్యులకు బంధములు గలుగుటకున్ను మరల ఆ బంధములు నశించి మోక్షము గలుగుటకున్ను మనస్సే కారణముగా నున్నది సుమా!—

శ్రుతి॥ యతో - నిర్విషయస్యాస్య - మనసో - ముక్తి - రిష్యతే । తస్మాన్నిర్విషయం - నిత్యం - మనః కార్యం - ముముక్షుణా॥

తా॥ శిష్యా! ఎప్పుడు మనస్సు విషయసంబంధము లేనిదిగా నుండునో, అనగా పుత్ర మిత్ర కళత్ర గృహ ధన ధాన్యాదులను, ఇది నాది ఇది నాది యనెడి మమకారమున్ను, వీనికన్నిటికిని నేనే కర్తను అనెడి అహంకారమున్ను, ఈ రెండున్ను మనస్సునకు లేకపోవునో, అప్పుడే జీవుడు ముక్తి పొందగలడు. కాబట్టి మోక్షాపేక్ష గలవారందరున్ను మనస్సును విషయసంబంధము లేనిదిగా శుద్ధమైనదిగా జేయవలయును. ఎట్లనగా—(శ్రుతి మనసా - భావ్యమానో హి - దేహతాం - యాతి - దేహకః । దేహవాసనయా - ముక్తో - దేహధర్మైర్ - నలిప్యతే॥)—అనెడి మహోపనిషత్తు రీతిగా, మనస్సు దేనిని దేనిని స్మరించుచుండునో, ఆ ప్రకారముగానే జీవునికి జన్మము గలుగును. ఎట్లనగా, సదా మనస్సు భార్యను స్మరించు చుండినయెడల, అంత్యంబున జీవుడు ఒకనికి భార్యగా జన్మించును. పుత్రుని స్మరించుచుండినయెడల అంత్యంబున జీవుడు ఒకనికి పుత్రుడుగా జన్మించును. దేహవాసన గలిగిన దేహమే తనని స్మరించుచుండినయెడల, అంత్యంబున జీవుడు దేహధారిగా జన్మించును. బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలను మనస్సు సదా స్మరించుచున్నయెడల, అంత్యంబున జీవుడు ఆ దేవతా జన్మంబులను పొందును. అట్లు గాక సదా మనస్సు శుద్ధనిర్గుణ పరబ్రహ్మమును స్మరించుచున్నయెడల, అంత్యంబున జీవుడు పరబ్రహ్మస్వరూపుం డగుచు జననమరణ రహితుండై

## మనస్సనుటకు అర్థము.

ముక్తి పొందును.—(శ్రుతి॥ సైషా- స్వభావాభిమతం - స్వయం సంకల్ప్య- ధావతి- చిచ్చైత్యం - స్వయ - మ్మ్లానం - మననా - న్మన - ఉచ్యతే॥)— అనెడి మహోపనిషత్తు వాక్యరీతిగా, శిష్యా! ఈ మనో వాసన తనకిష్టమగు విషయములను సంకల్పించుకొని ఆ విషయములందే పరుగెత్తుచు పలుమారు ఆ విషయములందే ప్రవర్తించు చుండును. ఇట్లు మనస్సు కొంచెమయినను వాడిపోక నానాట వృద్ధిపొందు చుండును. (చిచ్చైత్యములను) అనగా ప్రపంచ విషయములనున్ను, ప్రపంచ విషయములను గుఱింతెరుగు శుద్ధ లివిగాగు బ్రహ్మమునున్ను, ఈ రెంటిని ఈ మనస్సు స్మరించు చుండుట వలన, ఇది మనస్సని చెప్పబడుచున్నది.— (శ్రుతి సంకల్పనం - మనో విద్ధి - సంకల్పస్తన్న విద్యతే । యత్ర- సంకల్పనం - తత్ర - మనో స్తీ - త్యవగమ్యతామ్॥ — అనెడి మహోపనిషత్తు రీతిగా, శిష్యా! సంకల్పమునే మనస్సుగా తెలియును. సంకల్పము మనస్సుకంటెను వేఱుగాదు సుమా! ఎచ్చట సంకల్పము పుట్టుచుండునో అచ్చట మనస్సున్నదని తెలియవలయును.—(శ్రుతి విరించి రూపాన్మనసః - కల్పితత్వా - జ్జగత్ - స్థితేః । తావత్ - స్థితిరియం-ప్రోక్తా - తన్నాశే - నాశ మాప్నుయాత్॥)— అనెడి మహోపనిషత్తు రీతిగా, సంకల్ప రూపముగా నుండు మనస్సువలననే ప్రపం

ధము కల్పింపబడెను గాన, అట్టి మనస్సే చతుర్ముఖబ్రహ్మదేవు డనబడును.—(శ్రుతి॥ చిత్తమేవహి - సంసారో - రాగాది - క్లేశ - దూషితత్ । తదేవ - తైర్వినిర్ముక్తం- భవాంత - ఇతి - కథ్యతే॥)—అనెడి మహోపనిషత్తు రీతిగా, మనస్సే రాగద్వేష కామక్రోధాది వృత్తులుగా నున్నది. కాబట్టి మనస్సే మహాసంసార మనబడును. అట్లు రాగద్వేష కామ క్రోధాది వృత్తులు బ్రహ్మజ్ఞానమువలన నశించి పోవుటే మనోనాశ మనబడును. అదే మోక్ష మనబడును.—(శ్రుతి॥ తస్య - చంచలతా - యైషా- త్వవిద్యా - వాసనాత్మికా । వాసనాఽపర నామ్నీ - తాం - విచారేణ - వినా శయ॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, శిష్యా! మనస్సుయొక్క చంచలమే అవిద్యా వాసన యనబడును. కాబట్టి దానిని ఆత్మవిచారణవలన నాశము చేయవలయును— (శ్రుతి॥ - నధనాన్యుప - కుర్వంతి - నమిత్రాణి - నబాంధవాః । నకాయక్లేశ - వైధుర్యం — నతీర్థాయతనాశ్రయః । కేవలం - తన్మనోమాత్ర - జయేనాసాద్యతే - పదమ్॥—అనెడి మహోపనిషత్తురీతిగా, శిష్యా! ధనము, మిత్రులు, బంధువులు మొదలైనవారు ఉపకారము చేయజాలరు. శరీరకష్టమున్ను గలుగజేయు ఉపవాసా దులు ఉపకారము చేయజాలవు. పుణ్యతీర్థ యాత్రలు, దేవాలయదర్శనములు, బ్రహ్మ చర్యము, సన్న్యాసము మొదలగు ఆశ్రమములు ఉపకారములు చేయజాలవు. కాబట్టి వీటివలన లాభమేమియును లేదు, అనగా మోక్షము గలుగజాలదు. అయితే చంచలరూపముగా నుండు మనస్సును జయించినయెడల మోక్షము పొందవచ్చును. కాబట్టి అన్నిటికంటెను మనోజయమే శ్రేష్ఠమైనది.—(శ్రుతి॥ మనసైవ-మనశ్ఛిత్వా- పాశం - పరమబంధనమ్ । భవాదుత్తారయాత్మానం - నాఽసా - వస్యేన - తార్యతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, శిష్యా! విషము విషము వల్లను, బాణము దానికి సమాన మగు మరియొక బాణముచేతను ఖండింపబడునట్లు, మనస్సు మనస్సు వల్లనే నాశము జెందును. ఎట్లనగా, జ్ఞానరూపమగు శుద్ధమైన మనస్సుచేత (అశుద్ధ మైన మనస్సును) అనగా కామక్రోధాది వృత్తిరూపముగా నుండు మనస్సును నాశము చేయవలయును,—(శ్రుతి॥ మనోవ్యాధే-చికిత్సార్థ - ముపాయం - కథయామి తే । యత్తత్స్వాభిమతం - వస్తు - తత్త్యజనోక్ష - మత్ను తే॥)—అనెడి మహోపనిషత్తు రీతిగా, శిష్యా! కోరిక లన్నిటిని విడిచిపెట్టుటే మనోవ్యాధికి చికిత్స యనబడును.—

## మనోనాశమే పరమపద మనబడును.

శ్రుతి॥ నిరస్త విషయాసంగం - సన్నిరుద్ధం-మనోహృది । యదా-యాతున్మనీ - భావం - తదా - తత్పరమం పదమ్॥—

తా॥ శిష్యా! మనస్సు సకలవిషయంబులనుండి తొలగి, నేను నాదియనెడి అహంకార మమకారము లేనిదై, ఆత్మస్వరూపమునందు ఎప్పుడు లయించి పోవునో, అప్పుడు అది (పరమపదమును) అనగా మోక్షమును పొందును; అనగా దీపము

కలిగింపబడిన కర్పూరము గడ్డ అయియుండుటకును వెలిగి తర్వాత తనకు తానుగానే యుపశాంతిని జెందునట్లు, బ్రహ్మస్వరూపమునందు జేరిన మనస్సు తనకు తానే ఆ పరబ్రహ్మమునందు లయించి ఉపశాంతిని జెందును, అట్లు ఉపశాంతిని జెందుటే పరమపద మనబడును.—(శ్రుతి॥ మనః - ప్రశమనోపాయో - యోగ - ఇత్యభిధీయతే॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, శిష్యా! మనస్సు సంకల్ప వికల్పములులేక బ్రహ్మమునందు లయించి ఉపశాంతిని జెందుటే జ్ఞానయోగ మనబడును గాని, తక్కిన ప్రాణాయామాది కర్మయోగములు జ్ఞానయోగము గాజాలవు—(శ్రుతి॥ అసంకల్పన - శస్త్రేణ ఛిన్నం - చిత్తమిదం - యదా। సర్వం - సర్వగతం - శాంతం - బ్రహ్మ - సంపద్యతే - తదా॥)—అనెడి మహోపనిషత్తురీతిగా, శిష్యా! ఎప్పుడు సంకల్ప వికల్ప శూన్యమై బ్రహ్మమునందు లయించునో, అప్పుడు అది అఖండపరిపూర్ణ పరబ్రహ్మ స్వరూప మగుచున్నది సుమా? (శ్రుతి॥ జ్ఞస్య - చిత్తం - నచిత్తాఖ్యం - చిత్ - సత్వమేవహి॥)—అనెడి అన్నపూర్ణోపనిషత్తురీతిగా, శిష్యా! జ్ఞానులయొక్క మనస్సు బ్రహ్మమునందులయించి బ్రహ్మస్వరూపమే అగుచున్నది సుమా? (శ్రుతి॥ మనసా - మన - ఆలోక్య - వృత్తిశూన్యం - యదా - భవేత్। తతః - పరంబ్రహ్మ - దృశ్యం - దృశ్యతేచ - సుదుర్లభమ్। మనసా - మన ఆలోక్య - ముక్తోభవతి - యోగవిత్। మనసా - మన ఆలోక్య - ఉన్మన్యంతం - సదా - స్మరేత్। మనసా - మన - ఆలోక్య - యోగనిష్ఠ - స్సదా - భవేత్॥)—అనెడి యోగశిఖోపనిషత్తురీతిగా, శిష్యా! మనస్సుచేతనే ఆ మనస్సు యిట్టిదని యెఱింగిదానిని బ్రహ్మనిష్ఠయందు నిలిపి సంకల్పశూన్యముగా చేసినయెడల, అప్పుడు మిక్కిలి సులభముగా బ్రహ్మస్వరూపము జెందవచ్చును. అట్లు మనస్సు యిట్టి దని యెఱింగి దానిని వృత్తిశూన్యముగా చేయువాడే ముక్తుడనియు, రాజయోగి యనియు, బ్రహ్మజ్ఞాని యనియు చెప్పబడును.—

మనోనాశమే జ్ఞాన మనియు, మోక్ష మనియు చెప్పబడును.

శ్రుతి॥ తావదేవ - నిరోద్ధవ్యం - యావద్ధృది - గతం - క్షయమ్। ఏతద్ - జ్ఞానంచ - మోక్షంచ - అతోన్యో - గ్రంథవిస్తరః॥—

తా॥ శిష్యా! కాబట్టి మనస్సు యెందాక (నశింపకుండునో) అనగా సంకల్ప వికల్ప రహితమైన స్థితిని జెందకుండునో, అందాక దానిని నాశము చేయునటువంటి బ్రహ్మనిష్ఠను సదా అభ్యాసము చేయవలయును. ఇట్లు బ్రహ్మనిష్ఠను అభ్యాసము చేయుటయే బ్రహ్మజ్ఞానమనియు, మోక్షమనియు జెప్పబడును గాని, శాస్త్రాభ్యాసమువలన గలుగు జ్ఞానమును బ్రహ్మజ్ఞానమనియు మోక్షమనియు చెప్పబడజాలదు సుమా? శిష్యా!— (శ్రుతి॥ ద్వివిధ - శ్చిత్తనాశోస్తి - సరూపోఽరూప - ఏవచ। జీవన్ముక్త - సరూపస్స్యాత్ - అరూపోఽదేహముక్తిగః॥)—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, మనోనాశనము స్వరూప మనోనాశన మనియు, అరూప మనోనాశనమనియు రెండు విధములు గలవు. జీవన్ముక్తియందు సరూప మనోనాశనమున్ను, విదేహముక్తి యందు

## సరూప మనోనాశము

అరూపమనోనాశనమున్ను గలుగును. ఎట్లనగా, (1) సరూప మనోనాశన మనగా—
(శ్రుతి॥ భూయోజన్మ - వినిర్ముక్తం - జీవన్ముక్తస్య - తన్మనః । సరూపోఽసౌ-మనో
నాశః - జీవన్ముక్తస్య - విద్యతే॥—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, ప్రారబ్ధము నశిం
చువఱకు జీవన్ముక్తునియొక్క స్థూలసూక్ష్మ శరీరములు నశింపదు గాన, అప్పట్లో అతని
యొక్క మనస్సు కర్తృత్వ భోక్తృత్వము లనెడి అభిమానములున్ను (వృత్తులున్ను)
అనగా రాజస తామసగుణమున్ను కామ క్రోధాదులున్ను లేనిదిగా నుండును. అట్లు
అభిమానమున్ను రాజస తామస కామాది వృత్తులున్ను మనస్సునకు లేకపోవుటే
స్వరూప మనోనాశనము అనబడును—(శ్రుతి॥ చిత్తనాశాభిధానం- హి- యదా - తే-
విద్యతే - పునః । మైత్ర్యాదిభి - ర్గుణైర్యుక్త - శ్శాంతిమేతి - న సంశయః )—అనెడి
ముక్తికోపనిషత్తు రీతిగా, (మైత్రి) అనగా సుఖవంతులయందు స్నేహభావము, (కరుణ)
అనగా దుఃఖించు వారియందు దయ, (ముదిత) అనగా సజ్జనసంఘమునందు ఆనందము,
(ఉపేక్ష) అనగా దుర్జనులందు ఉదాసీనత్వము అను నీ సద్గుణములు గలిగి, రాజస
తామస వృత్తులను వదలి వ్యవహరించుచుండుటే సరూప మనోనాశనము అనబడును.

## అరూప మనోనాశము

(2) అపరూప మనోనాశన మనగా—(శ్రుతి॥ అరూపస్తు - మనోనాశో - వైదేహే -
ముక్తిగో - భవేత్॥)—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, విదేహముక్తియందు ప్రారబ్ధ
మున్ను, దానితోడు స్థూలసూక్ష్మ కారణములనెడి దేహత్రయమున్ను నశించును గాన,
అప్పట్లో మనస్సు (రూపములేక నశించును) అనగా కర్పూరదీపము కర్పూర మున్నంత
వఱకు వెలిగి, అది నశించినతోడనే మహాతేజోరూపమును బొందునట్లు, ఆ మనస్సు
పరబ్రహ్మమునందు లయించి బ్రహ్మస్వరూప మగును. అట్లు విదేహముక్తి యందు
కర్పూరదీపము రీతిగా, మనస్సు రూపములేక బొత్తిగా పరబ్రహ్మమునందు లయించి

## సంసారవృక్ష లక్షణము

బ్రహ్మస్వరూప మగుటే అరూప మనోనాశము అనబడును.—(శ్రుతి॥ సహస్రాంకుర
శాఖాత్మ - ఫలపల్లవ - శాలినః । అస్య - సంసార - వృక్షస్య - మనోమూల - మిదం
స్థితమ్॥)—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, శిష్యా! మనస్సే సంసార మనెడి వృక్షము
నకు మూలకారణముగా నున్నది సుమా! సంసారమనెడి వృక్షమునకు రాగద్వే
షాదులే మొలకలుగాను, స్వర్గ నరకాదులు శాఖలుగాను, సుఖదుఃఖములు పండ్లు
గాను, మఱియు। (దారేషణ) అనగా భార్యయందలి ఆశ, (ధరణీషణ) అనగా
గృహములు భూములు మొదలగు వానియందలి ఆశ, (ధనేషణ) అనగా ద్రవ్యమునం
దలి ఆశ, ఇట్టి ఈషణాత్రయమే చిగురుటాకులు గాను గలిగియున్నది, ఇట్టి సంసార

వృక్షమునకు మనస్సు మూలకారణంబై అనాదిస్సై అనంతమై యున్నది. ఇట్టి మనస్సునకు అపరోక్షజ్ఞాన సాక్షాత్కారమనెడి బ్రహ్మైకత్వజ్ఞానము గలుగువంతవఱకు దీనివల్లను నాశనము లేకుండును. జ్ఞానులు ఇట్టి చండాల మనస్సుయొక్క బాధను ఎఱుగుదురు గాన, ఈ దుఃఖము నివర్తించుటకుగాను బ్రహ్మజ్ఞానమును సాధనముగా జేసికొనిరి సుమా—(శ్రుతి॥ సంకల్పమేవ - తన్మక్త్య - సంకల్పోపశమేవ । తత్ లోపయాతు - యథా - లోపమేతి - సంసారసాగరః)—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, శిష్యా! ఈ మనస్సునకు సంకల్పములే స్వరూపముగా నున్నది గాన, సంకల్పములను నాశనము చేసినయెడల మనస్సు నశించును. మనస్సు నశింపగా సంసారమనెడి వృక్షమున్ను దానితోగూడా నశించును సుమా!—(శ్రుతి॥ జ్ఞమనోనాశ - మభ్యేతి - మనోఽజ్ఞస్య హి - శృంఖలా । తావన్నిశీథ - వేతాళా - వల్గంతి - హృది-వాసనాః । ఏకతత్త్వ దృఢాభ్యాసాత్ - యావన్నవిజితం - మనః॥)—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, శిష్యా! జ్ఞానియొక్క మనస్సు నశించిపోవును. అజ్ఞానియొక్క మనస్సు సంకెళ్ళరీతిగా బంధకముగా నుండును గాన, బ్రహ్మనిష్ఠాభ్యాస కారణముయినట్టి మనోజయము ఎంతవఱకు సిద్ధింపకుండునో, అంతవఱకున్ను రాత్రివేళయందు భయంకరములగునట్టి భేతాళాది గ్రహములు సంచరించి లోకమునకు బాధను గలుగజేయునట్లు, హృదయమునందు వాసనలనెడి భేతాళ గ్రహములు సంచరించుచు జనన జరామరణము లనెడి దుఃఖములను గలుగజేయుచుండును.—(శ్రుతి॥ ప్రక్షీణ- చిత్తదర్పస్య- నిగృహీతేంద్రియ-ద్విషః । పద్మిన్య - ఇవ - హేమంతే - క్షీయంతే - భోగవాసనాః॥)—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, శిష్యా! తత్త్వజ్ఞానము అభ్యాసము చేయుటవలన ఇంద్రియజయమున్ను మనోనాశమున్ను సిద్ధించును. అట్లు అవి రెండున్ను సిద్ధించినయెడల హేమంతఋతువునందలి తామరలరీతిగా మలినవాసనలన్నియు నశించును. అట్లు తత్త్వజ్ఞానము సిద్ధించి మనోనాశము కలుగకున్నయెడల, అప్పటి కప్పటికి మలినవాసనల యందుండి మనస్సును తొలగించి శుద్ధవాసనలను అభివృద్ధి జేసినయెడల మనోనాశము సిద్ధించును. కాబట్టి మనోనాశము సిద్ధించుటకుగాను, తత్త్వజ్ఞానమున్ను మలినవాసనక్షయమున్ను ఈ రెండున్ను ఒకటికొకటి సహకారులుగా నున్నది. కాబట్టి శిష్యా! ఏ ప్రకారముగా నయినను మనోనాశము చేయుటకు ప్రయత్నింపుము. —(శ్రుతి॥ వాసనా - ద్వివిధా - ప్రోక్తా—శుద్ధాచ - మలినా - తథా । మలినా - జన్మహేతుస్స్యాత్ - శుద్ధా - జన్మవినాశినీ॥ అజ్ఞాని - ఘనాకార - ఘనాహంకార - శాలినీ । పునర్జన్మకరీ - ప్రోక్తా మలినా - వాసనా - బుధైః॥)—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, శిష్యా! మలినవాసన శుద్ధవాసన అని రెండువిధములగు వాసనలు గలవు. మలినవాసన జనన మరణములు

## మలినవాసనాలక్షణము.

గలుగజేయును. శుద్ధవాసన జనన మరణములను నాశనము చేయును. (1) మలినవాసన—

అనగా—లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అనెడి వాసనాత్రయమున్ను, కామ క్రోధాదులు, ప్రమాదాలస్యములు, ఇవియన్నియు అజ్ఞానస్వరూపము అగుచు, అహంకార సంబంధములయినవి గాన మలిన వాసన యనబడును. (2) శుద్ధవాసన యనగా—

## శుద్ధవాసనాలక్షణము.

(శ్రుతి॥ పునర్జన్మాంతం - త్యక్త్వా - స్థిత - స్సంభ్రిష్ట - బీజవత్ । బహుశాస్త్ర - కథా కంథా - రోమంథేన - వృథైవ - కిమ్॥ అన్వేష్టవ్యం - ప్రయత్నేన - మారుతే - జ్యోతిరాంతరమ్॥)— అనెడి ముక్తికోపనిషత్తు రీతిగా, శిష్యా! వాసనాత్రయ మనెడి మలినవాసన పునర్జన్మ కారణమయినది గాన, దానిని విడిచిపెట్టి ప్రపంచము సర్వము పరబ్రహ్మ మనియు, అట్టి పరబ్రహ్మ ఆత్మస్వరూపు డగు తాననియు భావించుట; వేదాంత శ్రవణ మననాదులు ఇవి యన్నియు శుద్ధవాసన యనబడును. కాబట్టి— (శ్రుతి॥ వాసనాక్షయ - విజ్ఞాన - మనోనాశా - మహామతే । సమకాలం - చిరాభ్యస్తా - భవంతి - ఫలదాయినః॥ త్రయమేతే — సమం - యావన్నాభ్యస్తాశ్చ - పునఃపునః । తావన్నపద - సంప్రాప్తి - ర్భవత్యపి - సమా - శతైః)— అనెడి ముక్తికోపనిషత్తురీతిగా, శిష్యా! మలిన వాసనాక్షయము, తత్త్వజ్ఞానము, మనోనాశము అనునివి మూడున్ను చిరకాలముగా అభ్యాసము చేయవలయును. ఈ మూడున్ను అభ్యసించినవానికే బ్రహ్మైక్య మనెడి నిజమోక్షము లభించును గాని, తక్కినవారు యెంత కష్టపడినను వారికి లభింపదు ? అయితే ఈ మూటిలో ఒకటి యైనను అభ్యాసము చేయువారికి పునర్జన్మమునందు తక్కిన రెండున్ను లభించి నిజ మోక్షమును జెందగలడు సుమా ?—

## సర్వసంకల్పశూన్యము గాకున్న సాక్షాత్కారము గలుగజాలదనుట.

(శ్రుతి॥ నైవ - చింత్యం - నచాచింత్య - మచింత్యం - చింత్య మేవచ । తత్ పాత - వినిర్ముక్తం - బ్రహ్మ - సంపద్యతే - తథా॥

తా॥ శిష్యా! విషయాసక్తిని పొందినమనస్సు అశుద్ధమైనది గాన అది భార్య, బిడ్డలు, ధనము మొదలగువాటినే కోరుచుండును గాని, ఒకప్పుడైనను దానికి పరబ్రహ్మముయొక్క నిజధ్యానము గలుగజాలదు గాన, అట్టి అశుద్ధమనస్సుచే పరబ్రహ్మము (చింత్యము గాజాలదు) అనగా ధ్యానింపవలవిగానిది అగుచున్నది. అయితే విషయవైరాగ్యము గలిగిన మనస్సు శుద్ధమైనది గాన, దానికి పరబ్రహ్మ ధ్యానము గలుగక పోజాలదు. కాబట్టి శుద్ధమనస్సుచే పరబ్రహ్మము (అచింత్యము గాజాలదు) అనగా ధ్యానింపదగినది అగుచున్నది. మఱియు అట్టి శుద్ధమనస్సు గలవాడు సద్గురువును ఆశ్రయించి వారిచే సూచన చేయబడిన బ్రహ్మతత్త్వమును పొందినప్పటికిన్ని వానికి (నేను

లక్ష్యమునందే మనస్సును నిలిపియున్నాను)—అనెడి జ్ఞానము యెంతవఱకుండునో, అంతవఱకున్ను సంకల్పము నశించి స్వానుభవము గలుగజాలదు గాన పరబ్రహ్మము (అచింత్యమే) అనగా ధ్యానింపనలవి కానిదే అగుచున్నది. అయితే—(నేను సద్గురువుచే సూచింపబడిన బ్రహ్మలక్ష్యమునందు మనస్సును నిలిపియున్నాను)—అనెడి అహంభావమున్ను యెప్పుడు జారిపోవునో, అప్పుడు సకలసంకల్పములు క్షయించి స్వానుభవము సిద్ధించును గాన, అట్టి స్వానుభవముచే పరబ్రహ్మము చింత్యమే అనగా ధ్యానింపదగినదే అగుచున్నది. కాబట్టి పరబ్రహ్మము స్వానుభవములేని అజ్ఞానులచేత ధ్యానింపదగనిది గాని, స్వానుభవమును పొందిన జ్ఞానులచే ధ్యానింపరానిది గాదు సుమా! అయితే శిష్యా! అట్లు స్వానుభూతిని జెందిన జ్ఞానులచే సహితము—(నేను పరబ్రహ్మమును ధ్యానించుచున్నాను)—అనెడి అహంభావ ముండువఱకున్ను పరబ్రహ్మమును ధ్యానింపదగదు, అట్టి అహంభావము లేని స్వానుభూతిచే ధ్యానింపదగును, అనునట్టివి మొదలగు పక్షపాతభావములు యెప్పుడు లేకపోవునో, అప్పుడే స్వానుభవమగు బ్రహ్మసాక్షాత్కారము పొందదగిన దగును. ఏల ననగా, బ్రహ్మము వినా రెండవవస్తువు లేదనియు, సర్వము బ్రహ్మమనియు భావించుచు తన్మయంబుగా నుండుటే స్వానుభవజ్ఞాన మనబడును.

## బ్రహ్మనిష్ఠాభ్యాసరహస్యము.

శ్రుతి॥ సర్వేణా - సంధయేద్యోగ - మస్వరం-భావయేత్పరం । అస్వరేణానుభావేన - నభావో - భావ ఇష్యతే॥

తా॥ శిష్యా! (సర్వము) అనగా ప్రణవమును ధ్యానించుచు (అస్వరమ్) అనగా నామరూప క్రియాశూన్యశబ్దరహిత మగు పరబ్రహ్మమును, అది నేనని సదా స్వస్వరూపమునందు దృష్టినిలిపి, దానినే భావించుచుండవలయును. అట్లు భావించుటవలన సకల సంకల్పరహితమగు (స్వానుభూతి) అనగా బ్రహ్మసాక్షాత్కారము సిద్ధించును సుమా! ఎట్లనగా.—(శ్రుతి॥ ఆత్మాన - మరణిం - కృత్వా - ప్రణవం - చోత్తరారణిమ్ । ధ్యాన - నిర్మథనాభ్యాసాత్ - దేవం - పశ్యే - న్నిగూఢవత్॥)— అనెడి బ్రహ్మోప నిమత్తురీతిగా, శిష్యా! రెండుకట్టెలను యెడతెగక ఒకటితోనొకటి రాచుటవలన ఆ కట్టెలయందుండి అగ్ని వుత్పత్తి యగుచు, ఆ కట్టెలను దహించి రూపనామములులేక నాశముచేసి, వాటితోకూడా ఆ యగ్నియు నశించిపోవునట్లు, శుద్ధమనస్సును క్రింది కట్టెగాను, ప్రణవమంత్రమును మీదికట్టెగాను భావించి, (నిరంతరధ్యాన మనెడి) మథనంబును జేయుటవలన జ్ఞానాగ్ని వుత్పత్తియగుచు, అశుద్ధమనస్సును, ప్రణవమును, రెంటినిన్ని దహించి నాశముచేసి వాటితోగూడా ఆ జ్ఞానాగ్నియు ఉపశాంతిని బొందును. అట్లు అది ఉపశాంతి పొందుటవలన స్వానుభూతి యనెడి బ్రహ్మసాక్షాత్కారము సిద్ధించును సుమా!—

బ్రహ్మాత్మ ఐక్యైక ధ్యానుసంధానమువల్లనే ముక్తి లభించును.

శ్రుతి॥ తదేవ - నిష్కలం - బ్రహ్మ - నిర్వికల్పం - నిరంజనమ్। తద్ - బ్రహ్మాహ - మితి - జ్ఞాత్వా - బ్రహ్మ - సంపద్యతే - ధ్రువమ్॥—

తా॥ శిష్యా! ఆ పరబ్రహ్మము (నిష్కలమ్) అనగా నాదబిందుకళలు గానిది, (నిర్వికల్పమ్) అనగా—(జ్ఞానం - యన్నిర్వికల్పాఖ్యం - తదతీంద్రియ - మిష్యతే॥)- అనునట్లుగా, ఇంద్రియములచే తెలియరానిది, అనగా రూపనామక్రియలు లేనిది. (నిరంజనమ్) అనగా అజ్ఞాన రహితమైనది, అట్టి పరబ్రహ్మమే (అహంసబ్దముగా) అనగా ఆత్మస్వరూపముగా నున్నది. కాబట్టి బ్రహ్మమే ఆత్మ యనియు. ఆత్మయే బ్రహ్మమనియును, తెలిసికొన్నవాడు సత్యముగా బ్రహ్మస్వరూపియే అగుచు, జనన మరణ దుఃఖములు లేనివాడగుచున్నాడు.—

## పరబ్రహ్మలక్షణము.

శ్రుతి॥ నిర్వికల్ప - మనంతంచ - హేతు - దృష్టాంత - వర్జితమ్।అప్రమేయ - మనాదించ - జ్ఞాత్వాచ - పరమం - శివమ్॥

తా॥ శిష్యా! ఆ పరబ్రహ్మము (నిర్వికల్పమ్) అనగా ఇంద్రియంబులచే తెలియరానిది. (హేతుదృష్టాంతవర్జితమ్) అనగా తనకు మఱియొకటి కారణముగా లేనిది, తనకు సమానమగు వస్తువు వేఱొకటిలేనిది. (అప్రమేయమ్) అనగా (ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, సబ్దము, అరాపత్తి, అభావము, ఐతిహము, సంభవము) అనెడి అష్టవిధప్రమాణములను అతిక్రమించినది. (అనాది) అనగా సకలమునకు కారణమైనది. (పరమ్) అనగా అన్నిటికంటెను శ్రేష్ఠమైనది. (శివమ్) అనగా సదా మంగళకరమైనది, అని తెలిసికొనుమా! శిష్యా! అష్టవిధ ప్రమాణములను విశదముగా జెప్పుచున్నాను వినుమని యిట్లనియె. (1) ప్రత్యక్షము—అనగా నేత్రములకు కనబడునట్టి

## అష్టవిధప్రమాణములు.

నలుపు, ఎఱుపు, తెలుపు, పసుపు, పచ్చ, మిశ్రవర్ణము, పొట్టి, పొడుగు, లావు, సన్నము అనెడి దశవిధరూపమున్న ప్రత్యక్షము అనబడును. ఆ దశవిధరూపములున్న రూపతన్మాత్రలుగాను, అగ్నిభూతముయొక్క గుణములుగాను వున్నవి, కాబట్టి అవి బ్రహ్మము గాజాలవు. మఱియు—(యద్దృశ్యం - తన్నశ్యమ్॥)—అనెడి శ్రుతివాక్యము రీతిగా, నేత్రములకు కనబడువస్తువు లన్నియు నశించునట్టివి. పరబ్రహ్మము నేత్రములచే చూడబడనిది గాన, అప్రత్యక్షము అనబడును. (2) అనుమానము—అనగా ఒక అడవియందు మిక్కిలి పొడుగుగా నుండెడి ఒక పర్వతముమీద పొగ లేచుచుండగా దానిని జూచినమాత్రమున అగ్ని మనకండ్లకు కనబడ కున్నను, ఆ పొగకు కారణమగు అగ్ని ఆ పర్వతమునందు వుండవచ్చునని భావించుటే అనుమాన మన

బడును. అనగా కార్యమునకు కారణమున్ను, కారణమునకు కార్యమున్ను గలదని వాదించుట అనుమాన మనబడును.—(శ్లో॥ కార్యోపాధి - గతో - జీవః - కారణోపాధి - రీశ్వరః । కార్య - కారణ - నిర్ముక్తో - పూర్ణబోధో - విశిష్యతే॥)— అనునట్లుగా, మాయ కారణముగాను, అవిద్య కార్యముగాను వున్నదిగాన, మాయాప్రతిబింబమగు ఈశ్వరుడున్ను, అవిద్యా ప్రతిబింబమగు జీవుడున్ను, వీరిద్దరే కారణోపాధిని, కార్యోపాధిని పొందినవా రగుచున్నారు. పరబ్రహ్మము కార్యకారణ వుపాధులు రెండున్ను లేనిదిగాన, అనుమానరహిత మైనది అనబడును. (3) ఉపమానము—అనగా స్వజాతీయ విజాతీయాది భేదములు గలిగియుండుట పరబ్రహ్మము. అట్టి స్వజాతీయాది భేదశూన్యమై తనకు రెండవది లేనిదిగా నున్నదిగాన, ఉపమానరహిత మైనది అనబడును. (4) శబ్దము—అనగా చెవులకేత వినబడినట్టి శివ కేశవ హరి హరాది నామములే శబ్దము అనబడును.—(శ్రుతి॥ ఆకాశస్య - గుణశ్శబ్దః - విశ్శబ్దో - బ్రహ్మ - ఉచ్యతే॥)—అనెడి శ్రుతివాక్యమురీతిగా, శబ్దములన్నియు ఆకాశముయొక్క గుణమేగాని, పరబ్రహ్మను సబ్దములేనిదిగాన శబ్దరహిత మనబడును. (5) అర్థాపత్తి— అనగా ఎక్కడనైనను ఒక్కచోట ఉన్నదియని నిశ్చయించుట. అయితే ఒక్కచోటనే ఉన్నదని చెప్పబడక, పరబ్రహ్మము క్రింద మీద ప్రక్కన లోపల వెలుపల అక్కడ ఇక్కడ ఎక్కడనున్ను సర్వపరిపూర్ణముగా నున్నదిగాన, అట్టి పరబ్రహ్మము అర్థాపత్తిరహిత మైనది. (6) అభావము—అనగా అసత్యమైన వస్తువు. అయితే పరబ్రహ్మము కాలత్రయమునందును నాశము లేక సత్యముగా నుండుటవలన, అట్టి పరబ్రహ్మము అభావశూన్య మైనది అనబడును. (7) ఐతిహ్యము—అనగా అప్పటికప్పటికి నూతనము నూతనముగా వచ్చుచు పోవుచు నుండుట ఐతిహ్య మనబడును. ఇట్లు జీవేశ్వరజగత్తులే ప్రళయ ప్రళయమునకు పలుమాఱు పుట్టుచు చచ్చుచు నుండువారుగాని, పరబ్రహ్మము రాకపోకలు లేనిదిగాన, ఐతిహ్యరహితమైనది అనబడును. (8) సంభవము అనగా ఒకటిగా కూడుట, మరల అనేకభాగములుగా భేదపడుట, ఇది మాయాకార్యములే గాని, పరబ్రహ్మమునందు లేవు గాన, పరబ్రహ్మము (అసంభవము) అనగా సంభవప్రమాణము లేనిది యనబడును.

శ్రుతి॥ ననిరోధో - నజోత్పత్తి - ర్నబద్ధో - నచ - సాధకః । నముముక్షు - ర్నవై - ముక్త - ఇత్యేషా - పరమార్థతా॥—

తా॥ శిష్యా! పరబ్రహ్మము (నిరోధము లేనిది) అనగా నాశములేనిది. (ఉత్పత్తి లేనిది) అనగా పుట్టుకలేనిది. మఱియు ఆ పరబ్రహ్మము కర్మబద్ధమైనదిగాదు. అది ఏ సాధనాభ్యాసియు గాదు. మోక్షాపేక్ష గలిగినట్టి ముముక్షువున్ను గాదు. మఱియు ఆ పరబ్రహ్మము నిత్యముక్త మైనది గాన, దానికి ఒకప్పుడు బంధము గలిగి మఱియొకప్పుడు (మోక్షము) అనగా బంధనివర్తియు గలుగుటలేదు సుమా? శిష్యా! ఇవియే పరబ్రహ్మముయొక్క పరమార్థస్థితియని తెలిసికొనుము.—

### అవస్థాత్రయముల దాటినవానికే ముక్తికలుగును.

శ్రుతి॥ ఏక - ఏవాత్మా - మంతవ్యో - జాగ్రత్స్వప్న - సుషుప్తిషు । స్థానత్రయ - వ్యతీతస్య పునర్జన్మ - నవిద్యతే॥—

తా॥ శిష్యా! జాగ్రత్తు స్వప్నము సుషుప్తి అనెడి అవస్థాత్రయమునందున్న పరబ్రహ్మమను ఆత్మ ఒక్కటియే వ్యాపించియున్నదని తెలిసికొనుము. శిష్యా! ఈ మూడవస్థలను దాటినవానికి—(అనగా ఈ మూడవస్థలున్ను ఈ మూడవస్థలయందు తోచెడి జీవేశ్వర జగత్తులున్ను నేనుగానని వాటియందలి భ్రాంతిని విడిచిపెట్టి, ఈ అవస్థాత్రయసాక్షిగా నుండు ఆత్మయే నేనని తెలిసి, సదా తన్మయంబుగా నుండు వానికి)—మరల జన్మము లేదుసుమా.—

### పరబ్రహ్మమే సకలజీవకోటిగా తోచుచున్నదనుట.

శ్రుతి॥ ఏక - ఏవహి - భూతాత్మా - భూతే - భూతే-వ్యవస్థితః । ఏకధా - బహుధా చైవ - దృశ్యతే - జలచంద్రవత్।—

తా॥ శిష్యా! సకల భూతములందును పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే వ్యాపించియున్నది సుమా! ఒక్క చంద్రుడే అనేక కుండలయందుండు జలములోపల అనేక ప్రతిబింబములుగా తోచునట్లు, పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే అనేక శరీరములందుండు అనేక అంతఃకరణములందు ప్రతిబింబించి అనేక జీవులుగా తోచుచున్నాడు సుమా!—

### జీ వ ల క్ష ణ ము.

శ్రుతి॥ ఘటసంభృత - మాకాశం - లీయమానే - ఘటే - యథా । ఘటో లీయేత - నాకాశే - స్తద్వజ్జీవో - ఘటోపమః॥—

తా॥ శిష్యా! (ఘటము) అనగా ఒకకుండ, అది పగిలిన తోడనే ఘటాకాశము) అనగా ఆ కుండయందుండు ఆకాశము మహాకాశమునందు చేరును. అయితే కుండయందుండు ఆకాశమును ఘటాకాశమనుచు వ్యవహారములో మాత్రము చెప్పబడునే గాని, ఆకాశము కుండయందు ప్రవేశించుటవలన దానికి ఘటాకాశ మని పేరు గలిగినట్లు చెప్పగూడదు. ఎందువల్ల ననగా, ఆకాశము రూపములేనిది, సర్వవ్యాపకమయినది, అఖండమయినది, సర్వపరిపూర్ణ మయినది, చలనము లేనిది, అట్టి ఆకాశము కుండయందు చొరబడుట లేదుసుమా! అయితే కుండమాత్రము మొదట మన్నుగా నుండి, తర్వాత కుమ్మరవానివలన కుండగా నిర్మింపబడుచు, రూపనామములను క్రొత్తగా చెందెను. అయితే ఆ కుండయందుండు ఆకాశము మాత్రము యెప్పటివలె అరూపముగా అఖండముగా నున్నది గాని, క్రొత్తగా రూపనామములను చెందిన కుండ యొక్క సంబంధమువలన, ఆ కుండరీతిగా ఆ యాకాశమునకున్ను క్రొత్తగా నామరూపంబులు కల్పింపబడలేదు సుమా! మరియు ఆకాశము సదా ఏకరీతిగా నున్నది

గాని, కుండ భిన్నమయినప్పుడు ఆకాశము భిన్నమగుట లేదుసుమా? మఱియు ఆకాశము కుండయందున్నను, ఆ కుండతోడ సంబంధము లేక, ఆ కుండయొక్క రూపనామంబులను జెందకున్నది సుమా? ఆ ప్రకారముగా బ్రహ్మమగు ఆత్మ, సర్వత్ర పరిపూర్ణముగా వ్యాపించియున్నది గాన ఆ పరబ్రహ్మమునందు కల్పింపబడిన రూపనామంబులు గల చరాచరజగత్తు సర్వమున్ను నశించినను, పరబ్రహ్మమగు ఆత్మ నశింపజాలదు సుమా?—శిష్యా! ఆకాశమునకు ఘటత్వము కల్పితము గాన, ఘటము పగిలి నశించినను, దానియందుండు ఆకాశము మాత్రము పగులుట నశించుట మొదలగు వికారములు లేకుండునట్లు, పరబ్రహ్మమగు ఆత్మయందు జీవేశ్వర జగత్తులు మొదలయినవి కల్పితములగుటవలన, జీవేశ్వర జగత్తులు నశించినను, పరబ్రహ్మమగు ఆత్మ నాశములేక, ఏ వికారములను జెందక సదా ఏకరీతిగా వెలుగుచుండును సుమా?

## ఆత్మలక్షణము.

శ్రుతి॥ ఘటవద్ - వివిధాకారం - భిద్యమానం - పునఃపునః । తద్భేదేచ-నజానాతి సజానాతిచ - నిత్యశః॥—

తా॥ శిష్యా! (ఘటము) అనగా కుండ, అది యనేకమాఱులు పగులుచు మరల అనేక రూపంబులను జెందునట్లు, చిదాభాసజీవుడు అనేకమాఱులు చచ్చుచు పుట్టుచు జననమరణ సాగరంబున మునిగియుండును. ఘటము తాను పగిలి నశించుటను యెఱుంగనట్లు, చిదాభాసజీవుడు తాను పలుమాఱు చచ్చుచు పుట్టుచు జననంబులను జెందుచున్నను, అందులో నొక్కటినైనను యెఱుంగజాలడు. అయితే ఘటము పగిలి అనేక వికారంబులను జెందినను, ఆ ఘటమునందుండునట్టి ఆకాశము ఏ వికారములను జెందక ఏకరీతిగా నుండునట్లు, చిదాభాసజీవుడు పలుమాఱు పుట్టుట చచ్చుట అనెడి వికారములను గలిగియున్నను, ఆజీవునికి సాక్షిగా అధిష్ఠించియుండు పరబ్రహ్మ మగు ఆత్మ జననమరణంబులను జెందక ఎట్టివికారములను పొందక, ఏకరీతిగా నున్నదిసుమా? మఱియు వికారములను జెందునట్టి ఘటము, దానియందుండునట్టి నిర్వికారమగు ఆకాశము అది యెఱుంగునట్లు, జననమరణాది వికారంబులను జెందునట్టి జీవుడు, తనయందు సాక్షిగా వ్యాపించియుండు ఆత్మను యెఱుంగజాలడుసుమా?—(శ్రుతి॥ ద్వాసుపర్ణా - భవతో - బ్రహ్మణో - హంసభూత । స్తథేతరో - భోక్తా - భవత్యన్యోహి - సాక్షీ - భవతీతి । వృక్షధర్మే - తే - తిష్ఠతః॥)—అనెడి గోపాలతాపిన్యుపనిషత్తురీతిగా, నిర్వికారి యగు ఆత్మ స్వయంజ్ఞానస్వరూపమై సాక్షిగానున్నది గాన తన్ను యెఱుంగును, వికారియగు జీవునిన్ని యెఱుంగును సుమా? అయితే జీవుడు తనయొక్క వికారములను యెఱుంగజాలడు, తనకు సాక్షిగా నుండునట్టి ఆత్మయొక్క నిర్వికారస్థితినిన్ని యెఱుంగజాలడు సుమా?

## విషయాసక్తియే బంధహేతువు.

శ్రుతి॥ శబ్దమాయావృతో - నైవ - తమసో - యాతిపుష్కరే । భిన్నేత మసి - చైకత్వ - మేక మేవాను - పశ్యతి॥—

తా॥ శిష్యా! శబ్దమువలన సర్పమును, స్పర్శమువలన ఏనుగును చమరీమృగమును, రూపమువలన మిడుతలును, రసమువలన చేపలును, గంధమువలన తుమ్మెదలును నశించును. (1) ఎట్లనగా ఒక పాముల వాడు నాగసరమును ఊదినయెడల సర్పము పుట్టలోనుండి బయటికివచ్చి ఆ నాగసరముయొక్క ధ్వనిని విని సంతోషించుచు మైమఱచి అచ్చటనే నిలుచుచుండును. అప్పట్లో ఆ పాములవానిచేతిలో చిక్కుకొని తాను బాధపడుచు మరణించును. (2) అడవియందు సంచరించుచుండు చమరీమృగము వేటగానిచేతిలో చిక్కక తప్పించుకొని పాఱిపోవుచుండునప్పుడు. దాని తోక యందలి వెంట్రుకలు పొదలయందు తగులుకొన్నయెడల, ఆస్పర్శమువలన పాఱిపోక అచ్చటనే నిలుచుండును. అంతలో వేటగానివద్ద చిక్కుకొని మృతిజెందును. మఱియు ఏనుగు సంభోగవాంఛ గలిగి స్పర్శమునకులోనై ఆడయేనుగును ఒక పల్లమునందు పడద్రోసి, తానున్న ఆ పల్లమునందు దిగబడి, ఆ ఆడయేనుగుతోడ భోగించుచు స్పర్శమును అనుభవించుచుండగా, వానికి యెట్టి ఆపదలు సంభవించినను ఆ యాడ యేనుగును విడిచి రాకుండును. అందువలన అది వేటగానివశములో తగులుకొని దుఃఖించును.—(3) రాత్రికాలమునందు మిడుతలు మొదలగు పురుగులు దీపమునుజూచి పండని భ్రమించి ఆ దీపమునందు బడి నశించును.—(4) ఒక బెస్తవాడు గాలమునందు మాంసఖండమును తగిలించి ఆగాలమును జలమునందు వేయగా, చేపలు జిహ్వా చాపల్యమునొంది ఆ గాలమునందలి మాంసఖండములకు ఆశపడివచ్చి ఆగాలమునందు తగులుకొని మరణించును.—(5) తుమ్మెదలు చంపకపుష్పముయొక్క వాసనకు ఆశించి వచ్చి ఆ చంపకపుష్పమునందు జేరి నశించును. ఇట్లు ఒక్కొక్క విషయంబు వలన ఒక్కొక్కజంతువు నశించుచుండగా, మాయాకార్యములగు శబ్ద, స్పర్శ, రూప, రసగంధంబులనెడి ఈ అయిదువిషయంబులందున్న మనుష్యుడు యెంతవఱకు తగులుకొనియుండునో, అంతవఱకు జనన మరణప్రవాహమునుండి లేక దుఃఖించుచుండు ననుటకు సందేహములేదు సుమా? కాబట్టి శబ్దాదివిషయంబులందు తగులుకొని యుండుటే (మాయాస్థితి) అనగా అజ్ఞానస్థితి అనబడును. ఇట్టి అజ్ఞానము సాధుసంఘమువల్లను, శ్రవణ మననాదులవల్లను, శ్రవణ మననాదులవల్లను, సద్గురువుచే బోధింపబడిన బ్రహ్మనిష్ఠాభ్యాసమువల్లను నశించిపోవును. అట్లు నశించిపోవుటవలన (స్వానుభవము) అనగా బ్రహ్మసాక్షాత్కారము తనకు తానే లభించును సుమా?

శబ్దాదివిషయ శూన్యస్థితియే బ్రహ్మానుభూతి యనబడును.

శ్రుతి॥ శబ్దాక్షరం - పరంబ్రహ్మ - యస్మిన్ - క్షీణే - యదక్షరమ్ । తద్విద్వానక్షరం - ధ్యాయేత్ - యదిచ్ఛేత్ - శాంతిమాత్మనః॥

తా॥ శిష్యా! అట్టి (స్వానుభూతి) అనగా బ్రహ్మసాక్షాత్కారస్థితి శబ్దస్పర్శ రూపరస గంధంబులు లేనిది. మాయాకార్యములైన శబ్దాదివిషయంబు లెప్పుడు నశించి పోవునో, అప్పుడు (అక్షరము) అనగా నాశరహిత మగు బ్రహ్మసాక్షాత్కారము గలుగును. అట్టి సాక్షాత్కారమును గోరువారు శమదమాది సద్గుణంబులు గలవారై, సదా ఆ నాశరహిత మగు పరబ్రహ్మమునే ధ్యానించుచుండ వలయును సుమా!—

ముముక్షువు ముఖ్యముగా రెండు విద్యలను అభ్యసింపవలయును.

శ్రుతి॥ ద్వే - విద్యే - వేదితవ్యేతు - శబ్దబ్రహ్మ - పరంచయత్ । శబ్దబ్రహ్మణి- నిష్ణాతః - పరంబ్రహ్మాధిగచ్ఛతి॥—

తా॥ శిష్యా! ముముక్షువు ముఖ్యముగా రెండు విద్యలను తెలుసుకొనవలయును. అవి యేవియనగా శబ్దబ్రహ్మవిద్య, పరబ్రహ్మవిద్య అనునవి. (1) సద్గురువుచే బోధింపబడిన ప్రణవము, లేక హంసమంత్రము శబ్దబ్రహ్మవిద్య యనబడును; ఇదియే మొదటిది. (2) తర్వాత అట్టి మంత్రానుష్ఠాన అభ్యాసమువలన దానిని అతిక్రమించినట్టి (స్వానుభూతిని) అనగా బ్రహ్మసాక్షాత్కారస్థితిని పొందుటే పరబ్రహ్మవిద్య యనబడును. శబ్దబ్రహ్మస్థితిని దాటినవాడు (పరబ్రహ్మస్థితిని) అనగా స్వానుభవం బగు బ్రహ్మసాక్షాత్కారమును జెందగలడు సుమా!—

తత్త్వమెఱింగిన వెనుక శాస్త్రాభ్యాసమును విడిచిపెట్టవలయును.

శ్రుతి॥ గ్రంథ మభ్యస్య - మేధావీ - జ్ఞానవిజ్ఞాన - తత్పరః । పలాల మివ - ధాన్యార్థీ - త్యజేత్ గ్రంథ - మశేషతః॥—

తా॥ శిష్యా! పంటకాపు ఒకడు తాను కోసిన పంటకుప్పను నురిమి తూర్పెత్తి పొల్లు పొట్టు చెత్త మొదలైనవాటిని త్రోసివేసి, ధాన్యమును మాత్రము తీసుకొని పోయి చేర్చి పెట్టుకొనునట్లు, బుద్ధిమంతుడగు ముముక్షువు సద్గురువు నాశ్రయించి వారివద్ద వేదాంత శాస్త్రములను చదువుకొని, శ్రవణ మనన నిదిధ్యాసనములను జేసి, బ్రహ్మతత్త్వ మెఱింగి, తర్వాత ఆ శాస్త్రములనున్ను విడిచిపెట్టి, వానియొక్క సారం బగు (స్వానుభూతిని) అనగా బ్రహ్మసాక్షాత్కారస్థితిని, సదా అభ్యాసము చేయవలయును సుమా! ఇందుకు ప్రమాణము యెట్లనగా.—శ్రుతి॥ ఆత్మాన - మాత్మనా - సాక్షాత్ - బ్రహ్మ - బుధ్వా - సునిశ్చలమ్ । దేహ - జాత్యాది - సంబంధాన్ - వర్ణాశ్రమ - సమన్వితాన్ । వేదశాస్త్రాణి - చాన్యాని - పదపాంసుమివ - త్యజేత్॥)—అనెడి బ్రహ్మవిదోపనిషత్తురీతిగా, శిష్యా! బ్రహ్మతత్త్వ మెఱింగినవాడు దేహసంబంధములైన జాతి వర్ణాశ్రమములనున్ను వేదశాస్త్ర పురాణాదులనున్ను పాదములందలి ధూళివలె భావించి విడిచిపెట్టి, సదా బ్రహ్మానుభూతియందే వుండవలయును సుమా!

## సర్వత్ర సమదర్శనమే జ్ఞాన మనబడును.

శ్రుతి॥ గవామనేక - వర్ణానాం - క్షీరస్యాప్యేక - వర్ణతా। క్షీరవత్పశ్యతే- జ్ఞానం - లింగినస్తు - గవాం - యథా॥

తా॥ శిష్యా! ఆవులు నానావిధవర్ణములుగా వేఱువేఱు రూపములుగా వేఱు వేఱుగా నున్నను, వానివల్ల గలుగు పాలుమాత్రము ఒకటేవిధముగా నుండునట్లు, భేద బుద్ధి గలవాడు సద్గురువు నాశ్రయించి వేదాంత శ్రవణ మనన నిది ధ్యాసనములం జేసి వానికి గల భేదబుద్ధినశించి, అభేదబుద్ధియగు బ్రహ్మజ్ఞానము గలిగినయెడల, వాడు సర్వ జీవశరీరములందును అభేదముగా కేవలజ్ఞానస్వరూప మైన బ్రహ్మము ఒక్కటే వ్యాపించి యున్నదని తెలిసికొనును సుమా!

## పరిశుద్ధమనస్సువల్లనే ఆత్మానుభవము సిద్ధించును.

శ్రుతి॥ ఘృతమివ - పయసి - నిగూఢం - భూతేభూతేచ - వసతి-విజ్ఞానమ్। సతతం - మనసి మథయితవ్యం - మనో - మంథానభూతేన॥

తా॥ శిష్యా! పాలలో నెయ్యి రహస్యముగా కనబడక మఱుగైయుండునట్లు, సకలజంతువులందును జ్ఞానస్వరూప మగు పరబ్రహ్మము రహస్యముగా కనబడక మఱుగై యున్నది సుమా! ఐతే పాలలోనుండు నెయ్యిని యెత్తవలయునన్నయెడల, ఆపాలను కాచి చేమిరిపెట్టి, తర్వాత పెరుగుగా అయినప్పుడు కవ్వముతో చిలికి దానియందుండి వెన్నయెత్తి కాచినయెడల అది నెయ్యిగా అగునట్లు, సకల జంతువులందును వ్యాపించి రహస్యముగా మఱుగై యుండునట్టి కేవలజ్ఞానస్వరూపమగు బ్రహ్మమును తెలియ గోరువారు, తమయొక్క పరిశుద్ధ అంతఃకరణ మనెడి పాలను, గురుసేవ యనెడి అగ్నిలో కాచి, శ్రద్ధాభక్తిసహిత మగు శ్రవణ మనెడి చేమిరి పెట్టి, మనన నిదిధ్యాసము లనెడి కవ్వముతోడ (మథనమును చేసి) అనగా చిలికి, అందుగలిగిన (నిర్మలమైన) అనగా అజ్ఞాన విపరీత సందేహరహిత మగు మనస్సనెడి వెన్నను సద్గురుహస్తమస్తక సంయోగ, దృష్టదీక్ష, మానసికదీక్ష లనెడి అగ్నియందు కాచగా, అప్పట్లో ఆ పరిశుద్ధమనస్సనెడి వెన్నయందుండి స్వానుభవ మనెడి (నెయ్యి) అనగా బ్రహ్మ సాక్షాత్కారస్థితి లభించును సుమా.

## ఐక్యానుసంధానము చేయువాడే బ్రహ్మజ్ఞాని.

శ్రుతి॥ జ్ఞాననేత్రం - సమాధాయ - చోద్ధరేద్వహ్నివత్-పరమ్। నిష్కళం- నిశ్చలం - శాంతం - తద్బ్రహ్మాహ - మితి స్మృతమ్॥

తా॥ శిష్యా! స్వానుభవజ్ఞాన మనెడి నేత్రమును బొంది, తర్వాత నిర్వికార నిశ్చల పరమశాంత స్వయంజ్యోతి యగు పరబ్రహ్మస్థితిని పొందవలయును. అట్టి స్వయంజ్యోతి యగు పరబ్రహ్మము ఆత్మయనియు, అట్టి ఆత్మయే నేననియు తెలిసి ఆత్మానుసంధానము చేయవలయును సుమా!

శ్రుతి॥ సర్వభూతాధి - వాసంచ - యద్భూతేషు - వసత్యపి। సర్వానుగ్రాహకత్వేన-తదస్మ్యహం - వాసుదేవ - స్తదస్మ్యహం- వాసుదేవ- ఇత్యుపనిషత్॥ సహనా-వవత్వితి - శాంతిః॥ అమృతబిందూపనిషత్ సమాప్తా.

తా॥ శిష్యా! అట్టి అఖండసచ్చిదానంద పరిపూర్ణమగు పరబ్రహ్మము సకల జీవజంతువులందును వ్యాపించియుండును. అట్లు ఆ బ్రహ్మము సకల జీవజంతువులయందున్న వ్యాపించియున్నను, ఱెవడు దేహవాసన, శాస్త్రవాసన, లోకవాసన యనెడి వాసనాత్రయ శూన్యుడై సదా అహం బ్రహ్మాస్మి అనెడి బ్రహ్మాత్మ అభేద విజ్ఞానుసంధానము జేయుచు, స్వానుభూతియనెడి జీవబ్రహ్మైక్యనిష్ఠను జెంది నిరంతరము ఆనందించుచుండునో, అట్టి బ్రహ్మజ్ఞానియందే విశేషముగా ప్రకాశించుచుండును సుమా!—(శ్లో॥ వాసనాద్వాసు దేవస్య- వాసితం- తేజగత్ - త్రయమ్॥ సర్వభూతనివాసోపి - వాసుదేవ - నమోస్తుతే॥) అనెడి శ్లోకమురీతిగాను, మఱియు, (వసు - నివాసే - ఇత్యస్మాద్ధాతోః వసత్యతా - సర్వత్రేతి - వాసుః। దీవ్యతే - ప్రకాశత-ఇతి - దేవః। సచాసౌ - సచేతి - వాసుదేవః॥)—అనెడి వ్యుత్పత్త్యర్థమురీతిగాను, ఈ చరాచర ప్రపంచము సర్వము దేనియందుండి గలిగెనో, ఏది ఈ జగత్తు సర్వత్ర నిండియున్నదో, ఏది కేవల నిర్వికార పరిశుద్ధ చైతన్య స్వరూపమైయున్నదో, అదే వాసుదేవు డనబడును అట్టి వాసుదేవుడే పరబ్రహ్మమనియు ఆత్మయనియు జెప్పబడును గాన,—(శ్రుతి॥ అహ మేకో - వాసుదేవాఖ్య - మద్వయమ్॥)—అనెడి శ్రుతివాక్యరీతిగా, శిష్యా! అట్టి సర్వపరిపూర్ణమైన వాసుదేవ పరబ్రహ్మమే, ఆత్మస్వరూపుడనగు నేనని యెవడు యెఱుంగుచున్నాడో వాడే బ్రహ్మజ్ఞాని యనియు, జీవన్ముక్తుడనియు, విద్వాంసుడనియు, బ్రాహ్మణుడనియు జెప్పబడును సుమా! ఇట్లు ఇది యజుర్వేదమునందు చెప్పబడినట్టి అమృతబిందూపనిషత్తు॥

శ్రుతి॥ సహనా - వవతు। సహనౌ - భునక్తు। సహవీర్యం - కరవావహై తేజస్వినా - వధీత మస్తు। మావిద్విషావహై॥ ఓం శాంతి - శ్శాంతి - శ్శాంతిః॥

తా॥ అఖండ సచ్చిదానంద పరిపూర్ణ పరబ్రహ్మము గురు శిష్యులగు మమ్మును కాపాడును గాక, విషయాసక్తి లేక సదా బ్రహ్మవిచారణయందే కాలము గడుపుచుండ వలయుననెడి మామీద ప్రేమయుంచును గాక, ఆ పరబ్రహ్మము యొక్క కృపాకటాక్షమువలన సదా శ్రవణ మనన నిధిధ్యాసనములను జెందుటకు మాకువీర్యము గలుగును గాక. ఆత్మానుభవము మాకు గలుగును గాక. గురుశిష్యులగు మా యిద్దరికి ద్వేషము మొదలగు దుర్గుణములు లేకపోవుగాక. ఓ పరబ్రహ్మమా! భగవంతుడా! నారాయణా! ఓం శాంతము, శాంతము, శాంతము.—

ఇట్లు యజుర్వేదమునందలి అమృతబిందూపనిషత్తు
తాత్పర్య సహితము - సంపూర్ణము.

---

సా మ వే ద ము సం బ ధి

## మైత్రేయోపనిషత్తు - ద్వితీయాధ్యాయము తాత్పర్యసహితము ప్రారంభము.

శ్రుతి॥ ఆప్యాయంతు - మమాంగాని - వాక్ప్రాణ - శ్చక్షు శ్రోత్ర - మథో బల - మింద్రియాణిచ - సర్వాణి। సర్వం - బ్రహ్మోపనిషదం - మాహం - బ్రహ్మ నిరాకుర్యాం। మామా - బ్రహ్మ - నిరాకరో - దనిరాకరణ - మస్త్వనిరాకరణం - మే - అస్తు। తదాత్మని - నిరతే - య ఉపనిషత్సు - ధర్మా। స్తేమయి - సంతు - తే - మయి - సంతు - తే - మయి - సంతు। ఓం - శాంతి - శ్శాంతి - శ్శాంతిః॥

తా॥ నాయొక్క అంగములున్ను వాక్కు ప్రాణము నేత్రము శ్రోత్రము మనస్సు మొదలగు సర్వేంద్రియములున్ను విషయాదులందు ప్రవర్తించక పరబ్రహ్మమగు ఆత్మ స్వరూపమందు నిలిచి తృప్తిపొందును గాక. వేదాంత ప్రతిపాదిత మగు సచ్చిదానంద పరబ్రహ్మము సర్వస్వరూపి యగును గాక, ఆత్మస్వరూపుడగు నేను ఆ పరబ్రహ్మమును నిరాకరించకుండును గాక, ఆ పరబ్రహ్మము ఆత్మస్వరూపుడగు నన్ను నిరాకరించకుం డును గాక, ఆ పరబ్రహ్మముయొక్క ఆదరము నాకు గలుగును గాక, నాకు ఆ పర బ్రహ్మమునందు విశ్వాసమున్ను ఆ బ్రహ్మైక్య భావమున్ను గలుగును గాక, మఱియు ఆ పరబ్రహ్మమునందు ఆసక్తిగల నాయందు ఉపనిషత్తులచే చెప్పబడినట్టి ధర్మములు గలిగియుండును గాక, ఆ ధర్మములు నాయందు గలిగియుండును గాక, ఓ ప్రణవ స్వరూపియగు పరబ్రహ్మమా! భగవంతుడా! నారాయణా! (శాంతి శ్శాంతి శ్శాంతిః) అనగా, సకల విఘ్నములనున్ను పరిహరింతువు గాక.

శ్రుతి॥ అథ - భగవాన్ - మైత్రేయః - కైలాసం - జగామ। తం గత్వోవాచ భో భగవన్ - పరమతత్త్వ - రహస్య - మనుబ్రూహీతి। సహోవాచ - మహాదేవః॥

తా॥ తదనంతరము మైత్రేయ మహాఋషి కైలాస పర్వతమునకుం బోయి, అచ్చట శ్రీ జగన్మాతయగు పార్వతీదేవి సహితుండగు పరమశివుని దర్శించి దండ ప్రమాణంబు లాచరించి యిట్లనియె. ఓ భగవంతుడా! సర్వేశా! విశ్వరక్షకా! దేవర వారు నాయందు కరుణాకటాక్షముంచి నాకు పరమతత్త్వ రహస్యమును సులభముగా బోధింపుడని ప్రార్థింపగా, ఆ ఉమామహేశ్వరుండు కరుణగలవాడై ఆ మైత్రేయ మహాఋషికి పరమతత్త్వ రహస్యంబును అతి సులభముగా బోధింప దొడంగెను. అదెట్లనగా.—

### సకల పూజలలోపల ఆత్మపూజయే శ్రేష్ఠము.

శ్రుతి॥ దేహో- దేవాలయః- ప్రోక్త- స్సజీవః- కేవల- శ్శివః। త్యజే దజ్ఞాన- నిర్మాల్యం- సోహంభావేన- పూజయేత్॥—

తా॥ మునివర్యా! ఈ దేహమే దేవాలయ మనబడును. ఈ దేహమనెడి దేవాలయమునందు వసించునట్టి జీవుతే దేవుడుగా నున్నాడు. కాబట్టి జీవుడు వేఱు, దేవుడు వేఱు అనెడి అజ్ఞానమును విడిచిపెట్టి (సోహంభావముతో) అనగా జీవస్వరూపు డగు నేనే పరబ్రహ్మమనెడి ఐక్యభావములోడ నిర్మలమైన మానసుడై ఆత్మపూజ చేయవలయును. సకల దేవతా పూజలకంటెను సోహంభావ రహస్యమగు ఆత్మపూజయే శ్రేష్ఠమయినది సుమా?

## జ్ఞా న స్నా నా దు లు.

శ్రుతి॥ అభేద - దర్శనం- జ్ఞానం - ధ్యానం- నిర్విషయం - మనః । స్నానం - మనోమల- త్యాగ- శ్శౌచ- మింద్రియ- నిగ్రహః॥ బ్రహ్మామృతం- పిబేద్భైక్ష- మాచరేద్దేహ- రక్షణే । వసే దేకాంతికో - భూత్వా- చైకాంతే- ద్వైతవర్జితే॥

తా॥ ఋషిపుంగవా! ఆత్మయే బ్రహ్మము, బ్రహ్మమే ఆత్మయని రెంటిని అభేదముగా భావించుటే బ్రహ్మజ్ఞాన మనబడును. శబ్దాది విషయములందు మనస్సు వ్యాపించకుండుటే ధ్యానమనబడును. కామ క్రోధ లోభ మోహాది దుర్గుణములు లేక వాసనాత్రయశూన్యమై మనస్సు నిర్మలముగా నుండుటే తీర్థస్నాన మనబడును. ఇంద్రియంబు లను శబ్దాది విషయంబులందు విచ్చలవిడిగా వ్యాపింప కుండునట్లు లఱపఱచుకొనుటే శౌచ మనబడును, బ్రహ్మనిష్ఠయనెడి అమృతపానము చేయుటే భిక్షాన్న మనబడును, తనకు రెండవ వస్తువు లేక సర్వము తానై ఏకముగా వెలుంగుచుండు పరబ్రహ్మము తానై యుండుటే ఏకాంతస్థలవాసన మనబడును. ఈ రహస్యములను తెలిసి ఈ ప్రకారముగా అనుష్ఠించువాడే జ్ఞాని యనబడును. ఇట్టి జ్ఞాని యొక్కడే ముక్తి పొందును గాని, తక్కినవారు ముక్తి పొందజాలరు సుమా?

## దే హ ము చం డా ల మై న ద ను ట.

శ్రుతి॥ జాతం- మృతమిదం — దేహం - మాతాపితృ - మలాత్మకమ్ సుఖదుఃఖాలయా మేధ్యం-స్పృష్ట్వా- స్నానం విధీయతే॥ ధాతుబద్ధం- మహారోగం- పాపమందిర- మధ్రువమ్ । వికారాకార । విస్తీర్ణం- స్పృష్ట్వా- స్నానం విధీయతే॥ నవద్వార - మలస్రావం- సదాకాలే- స్వభావజమ్ । దుర్గంధం- దుర్మలోపేతం - స్పృష్ట్వా- స్నానం- విధీయతే॥ మాత్రా- సూతక- సంబంధం- సూతకే- సహజాయతే । మృతసూతకజం - దేహం- స్పృష్ట్వా- స్నానం విధీయతే॥—

తా॥ మునిపుంగవా! ఈదేహము చావుపుట్టుకలు కలిగినది. తల్లిదండ్రుల యొక్క శుక్లశోణితమువలన గలిగినది. హేయమయిన ప్రపంచ సంబంధమగు సుఖదుఃఖములకు ఆలయముగా నున్నది. (అమేధ్యం) అనగా పరిశుద్ధము గానిది. ఇట్టి చండాలదేహమును తాకినమాత్రమున స్నానము చేయవలసినదే సుమా? మఱియు ఈ దేహము సప్తధాతుమయ మయినది, మహారోగములకు వాసస్థానముగా నున్నది, ప్రపంచ మహా

పాతకములు పొందలయిన పాపములకు మందిరముగా నున్నది, అనిత్యమయినది, వి... స్వరూపమయినది, ఇట్టి చండాలదేహమును స్పృశించిన మాత్రమున స్నానము చేయ వలసినది సుమా? మఱియు ఈ దేహము నవరంధ్రములు గలిగినది. సదాకాలము సకా... ముగా నవరంధ్రములందును మలము స్రవించుచుండును; ఇది దుర్గంధమయినది, దుర్భల ములోడ గూడియున్నది, ఇట్టి రోతశరీరమును అంటినమాత్రమున స్నానము చేయవలసి నదే సుమా? మఱియు ఈ దేహము తల్లిదండ్రుల మాతృక సంబంధమయినది, సహా... ముగా మాతృకములోడనే పుట్టుచున్నది. ఇదిగాక, మృతమాతృక సంబంధమయినది, ఇట్టి హేయమయిన శరీరమును తాకినతోడనే స్నానము చేయవలసినదే సుమా! కాబట్టి మునివరా! ఈ సకలజనులకున్ను ఇట్టి అశుద్ధమయిన చండాలదేహములే యున్నవి గాన, వీరందఱున్ను సమానులే కాని, వీరిలో హెచ్చు తక్కువలు లేవుసుమా!

## జ్ఞానిశౌచలక్షణము.

శ్రుతి॥ అహం-మమేతి-విణ్మూత్రలేప-గంధాది-విమోచనమ్। శుద్ధశౌచ-మితి ప్రోక్తం-మృజ్జలాభ్యాంతు-లౌకికమ్। చిత్తశుద్ధికరం-శౌచం-వాసనాత్రయ నాశనమ్। జ్ఞాన వైరాగ్య-మృత్తో-యైః-క్షాళనా-చ్ఛౌచముచ్యతే॥—

తా॥ మునివరేణ్యా! అహంకార మమకారము లనెడి మలమూత్రములను రెంటిని (విసర్జించుటె) అనగా విడిచిపెట్టుటె శుద్ధశౌచ మనబడును. మృత్తిక జలము మొదలగు వానితో చేయు శౌచము లౌకికమయినది యనబడును. దేహవాసన శాస్త్రవాసన లోకవాసన అనెడి వాసనాత్రయనాశము చేయుటవలన చిత్తము పరిశుద్ధముగా అగుచున్నది గాన, అదే శ్రేష్ఠమయిన శౌచ మనబడును. జ్ఞానవైరాగ్యము లనెడి మృత్తికచే చేయబడినట్టి శౌచమే అన్నిటికంటెను శ్రేష్ఠమయినది సుమా?—

## జ్ఞానభిక్షాన్నలక్షణము

శ్రుతి॥ అద్వైతభావనా-భైక్ష-మభక్ష్యం-ద్వైతభావనమ్। గురుశాస్త్రోక్త-భావేన-భిక్షోర-భైక్ష్యం-విధీయతే॥—

తా॥ ఋషివర్యా! ఆత్మస్వరూపుడను నేనే బ్రహ్మము కాబట్టి నాకంటెను అన్యమేమియును లేదు, సర్వము నేనే అని భావించుచు తాను బ్రహ్మాకారముగా నుండుటే అద్వైతభావన యనబడును. అట్టి అద్వైతభావనయే నిజమయిన జ్ఞానభిక్షాన్నము అనబడును. జ్ఞానసన్యాసి అట్టి అద్వైతభావన యనెడి అన్నమును భిక్షమెత్తి తినుచుండవలయును. (ద్వైతభావన) అనగా ఆత్మ వేఱు, బ్రహ్మము వేఱు, ఆత్మ బ్రహ్మము గాజాలదు, బ్రహ్మము ఆత్మ గాజాలదు అని భేదముగా భావించుట, జ్ఞానసన్యాసి అట్టి ద్వైతభావన అనెడి అన్నమును భిక్షమెత్తి భుజింపరాదు, సద్గురువాక్యరీతిగాను, వేదాంతశాస్త్రరీతిగాను, నిజమయినట్టి అద్వైతజ్ఞానమనెడి భిక్షమునెత్తి తినుచునా...

నిజమయిన సన్న్యాసి యనియును భిక్షుకుడనియును చెప్పబడును. గాని, ఆత్మైకత్వజ్ఞానసాధనము లేక తలబోడి చేసుకొని కాషాయ వస్త్రములు ధరించుకొని భార్యబిడ్డలను పరిత్యజించి దేశాంతరియై వీధులందు సంచరించుచు ఇంటింటను సాధారణమైన అన్నమును భిక్షమెత్తి జీవించువాడు సన్న్యాసి గాజాలడు, భిక్షుకుడున్ను గాజాలడు సుమా! (రాగవస్త్రధారణం - రాగ నాశ- సాధనమ్॥)—అనునట్లు కాషాయవస్త్రమును ధరించువాడు సమస్త వస్తువులందు నిరాశయును, తత్త్వజ్ఞానమున్ను, బ్రహ్మనిష్ఠాభ్యాసమున్ను పొంది యుండవలయును. అట్లు లేకున్నయెడల కాషాయవస్త్రమును ధరించుట వలన ప్రయోజనము లేదు సుమా!—

## జ్ఞా న స న్న్యా సి ల క్ష ణ ము.

శ్రుతి॥ విద్వాన్ - స్వదేశ- ముత్సృజ్య- సన్న్యాసానంతరం- స్వతః । కారాగార- వినిర్ముక్త- చోరవద్దూరతో- వసేత్ । అహంకార- సుతం- విత్తం- భ్రాతరం- మోహమందిరమ్ । ఆశాపత్నీం- త్యజేద్యావత్ - తావన్ముక్తో- నసంశయః॥

తా॥ మునివర్యా! బ్రహ్మజ్ఞానము లేక వ్యర్థముగా మూఢవైరాగ్యముతోడ ఆశ్రమసన్న్యాసమును పుచ్చుకొని, తన తల్లిదండ్రులను, దారాపుత్రాదులను, స్వదేశమును విడిచిపెట్టి పారిపోవుచు దేశద్రిమ్మరియై తిరుగుచుండు శాస్త్రపండితుడు వ్యర్థుడగుచున్నాడు. అట్టివాడు బహుకాలముగా కారాగృహమునం దుండుచు తర్వాత విడుదల చేయబడిన దొంగతో సమానుడగుచున్నాడు సుమా! కాబట్టి అహంకారమనెడి పుత్రుని, ధన మనెడి సోదరుని, మోహమనెడి గృహమును, ఆశ యనెడి భార్యను విడిచిపెట్టినవాడే నిజమయిన సన్న్యాసి యనియును, జ్ఞానియనియును చెప్పబడును. అతడే ముక్తి పొందగలడు గాని, తక్కిన వేషధారులయిన సన్న్యాసులు ముక్తిని పొందజాలరు సుమా!—

## జ్ఞానసన్న్యాసికి సంధ్యావందనాదులు పరిత్యాజ్యము.

శ్రుతిః మృతా- మోహమయీ- మాతా । జాతో- బోధమయ- స్సుతః । సూతకద్వయ- సంప్రాప్తౌ- కథం- సంధ్యా- ముపాస్మహే ॥ హృదాకాశే- చిదాదిత్య- స్సదా భాసతి- భాసతే । నాస్తమేతి- నచోదేతి- కథం- సంధ్యా - ముపాస్మహే॥

తా॥ మునివరేణ్యా! మోహము అనెడి తల్లి చనిపోయెను, మఱియును తత్క్షణమే పరిపూర్ణబోధ యనెడి పుత్రుడు పుట్టెను, నాయొక్క మోహమనెడి తల్లి చనిపోవుట వలన మృతసూతకమున్ను, మఱియును నాకు పరిపూర్ణబోధ యనెడి పుత్రుడు జన్మించుట వలన జాతసూతకమున్ను సంభవించెను. ఇట్లు ఈ రెండు సూతకములు సంభవించుట వలన నేను సంధ్యావందనమును యెట్లు చేయగలను. ఇదిగాక నాయొక్క హృదయాకాశమునందు జ్ఞానసూర్యుడు సదా ప్రకాశించుచున్నాడు. అట్టి జ్ఞానసూర్యుడు ఒకప్పు

దయినను అస్తమించుట లేదు, ఉదయించుటలేదు, ఉదయాస్తమానములు లేక, సదా ఏకరీతిగా వెలుగుచున్నాడు గాన నేనెట్లు సంధ్యావందనము చేయగలను. కాబట్టి జ్ఞానసాక్షాత్కారము చెందిన వానికి సంధ్యావందన కార్యము నిష్ప్రయోజనమే సుమా!—

### జ్ఞానసమర లక్షణము.

ఏకమేవాద్వితీయం- యద్గురో- ర్వాక్యేన - నిశ్చితమ్। ఏతదేకాంత - మిత్యుక్తం- న మఠం- నవనాంతరమ్॥—

తా॥ మునిశ్రేష్ఠా! (ఏకమేవా ద్వితీయమ్) అనెడి గురువాక్యము రీతిగా తీర్మానింపబడినదై, తనకు రెండవది లేక యేకమై వెలుగుచుండు పరబ్రహ్మమగు ఆత్మయే ఏకాంతస్థలమనియు, మఠమనియు చెప్పబడును. అట్టి ఏకాంత స్థలమయిన ఆత్మయందు మనస్సు ఐక్యమగుచు తదాకారముగా నుండువాడే ఏకాంతస్థలవాసి యనియు, మఠవాసి యనియు చెప్పబడును గాని, ఆత్మానుభవము లేక నిర్జనమయిన అరణ్యమందుండయినను, లేక మఠమునందయినను వాసము చేయువాడు ఏకాంతస్థలవాసి గాజాలడు, మఠవాసియు గాజాలడు సుమా.—అందువలన ముక్తియు లభింపదుసుమా.—

### సంశయాత్మునకు ముక్తి లభింపదు.

శ్రుతి॥ అసంశయవతాం - ముక్తిః- స్సంశయావిష్ట- చేతసామ్। న ముక్తిర్జన్మ- జన్మాంతే- తస్మా ద్విశ్వాస-మాప్నుయాత్॥

తా॥ ఋషిపుంగవా! సంశయము లేనివానికే ముక్తి గలుగునుగాని, సంశయము గలవానికి ఎన్ని జన్మములకైనను ముక్తి గలుగజాలదు గాన, గురువాక్యమునందు సందేహపడక సత్యముగా విశ్వాసముంచవలయును సుమా. అట్లు సద్గురువాక్యమునందు విశ్వాసముంచినవాడే మహాత్ముడు, కృతార్థుడు సుమా.—

### బ్రహ్మజ్ఞానము లేక కర్మత్యాజ్యము చేసెనేని సన్న్యాసి గాజాలడు.

శ్రుతి॥ కర్మత్యాగాన్న- సన్న్యాసో - న ప్రేషోచ్చారణేనతు। సంధౌ - జీవాత్మనో- రైక్యం- సన్న్యాసః- పరికీర్తితః॥

తా॥ మునిసత్తమా! కర్మానుష్ఠానమును విడిచిపెట్టుటవల్లను, మంత్రములను ఉచ్చరించుటవల్లను సన్న్యాసము సిద్ధింపజాలదు. జీవబ్రహ్మైక్యనిష్ఠయే సన్న్యాస మనబడును గాన, అట్టి జీవబ్రహ్మైక్యనిష్ఠను పొందినవాడే నిజమైన సన్న్యాసియనబడును.

### సన్న్యాసము పొందుటకు అధికారి యెవడు?

శ్రుతి॥ వమనాహారవద్యస్య- భాతి- సర్వేషణాదిషు। తస్యాధికార-సన్న్యాసే- త్యక్త- దేహాభిమానినః॥ యదా- మనసి- వైరాగ్యం- సజాతం- సర్వవస్తుషు। తదైవ-

సన్న్యసే ద్విద్వాన్- అన్యథా- పతితో- భవేత్॥ ద్రవ్యార్థం-అన్నవస్త్రార్థం-యఃప్రతిష్ఠార్థ మేవచ। సన్న్యసే దుభయభ్రష్ట- స్సంముక్తిం- నాప్తు- మర్హతి॥

తా॥ తాపసోత్తమా! (దారేషణ) అనగా స్త్రీలమీద ఆశ, (ధరణీషణ) అనగా గృహములు తోటలు పంటభూములు మొదలయిన వాటియందలి ఆశ, (ధనేషణ) అనగా ధనము ధాన్యము భూషణములు వాహనములు మొదలయిన వాటియందలి ఆశ, (పుత్రేషణ) అనగా పుత్రులు పౌత్రులు మొదలగు వారియందలి ఆశ, ఇవి మొదలగు సకలమయిన ఆశలనున్ను విడిచిపెట్టి, వాంతిచేసిన అన్నమునందు అసూయ గలిగినట్లు ప్రపంచవిషయ భోగములందు వాంఛ లేక దేహాభిమానమును విడిచియుండు వానికే సన్న్యసము పుచ్చుకోవలయునని శాస్త్రములందు చెప్పబడుచున్నది. కాబట్టి పరబ్రహ్మము తప్ప తక్కిన దేహేంద్రియాది సకల పదార్థములందును యెప్పుడు ఆశలేకపోవునో, అప్పుడే పండితుడు సన్న్యసమును పొందవలయును గాని, అట్లు బ్రహ్మజ్ఞానానుభవమున్ను విషయవైరాగ్యమున్ను లేక, ధనముకొఱకును, అన్నవస్త్రములకొఱకున్ను, ప్రతిష్ఠకొఱకున్ను, సన్న్యసమును పుచ్చుకొనెడి విద్వాంసుడు (ఉభయభ్రష్టుడై) అనగా గార్హస్థ్య ధర్మమును అనుష్ఠించునట్టి గృహస్థుడున్ను గాక, మఱియు సన్న్యాసధర్మమును అనుష్ఠించునట్టి సన్న్యసియు గాక, (పతితుడు) అనగా పాపాత్ము డగుచున్నాడు గాన, అట్టివానికి ముక్తి లభింపదు సుమీ?—

సకల చింతలలోపల తత్త్వచింతయే శ్రేష్ఠము.

శ్రుతి॥ ఉత్తమా- తత్వచింతైవ- మధ్యమం- శాస్త్రచింతనమ్। అధమా-మంత్రచింతాచ- తీర్థభ్రాంత్యధమాధమా॥—

తా॥ ఋషివర్యా! నిత్యానిత్య వస్తువివేకము గలవాడై, అనిత్యమగు దేహేంద్రియాది జగత్తు సర్వమునందున్ను నిరాశగలిగి, నిత్యమగు పరబ్రహ్మమయిన ఆత్మను ధ్యానించుచు తన్మయముగా నుండుటే (తత్త్వ చింత) అనబడును. అట్టి తత్త్వ చింతయే శ్రేష్ఠమయినది సుమీ! (శాస్త్రచింతనము) అనగా సదా శాస్త్రములను చదువుచు, లేక వినుచుండు అభ్యాసము మధ్యమము, (మంత్రచింత) అనగా సదామంత్రములను జపించుచుండుట అధమము. (తీర్థభ్రాంతి) అనగా కాశి గంగ గోదావరి కృష్ణ తుంగభద్ర కావేరి యమునా మొదలగు పుణ్యనదులందు స్నానము చేయవలయునెడి భ్రాంతి అధమాధమము సుమీ?

విచారణజ్ఞానము వల్లనే బ్రహ్మవేత్త గాజాలడు.

శ్రుతి॥ అనుభూతిం- వినా- మూఢో- వృథా- బ్రహ్మణి- మోదతే। ప్రతిబింబిత- శాఖాగ్ర- ఫలాస్వాదన- మోదవత్॥

తా॥ మునిశ్రేష్ఠా! స్వానుభవ జ్ఞానములేక వేదాంతశాస్త్ర శ్రవణమనెడి విచారణ జ్ఞానమువల్లనే, నేను పరబ్రహ్మమును తెలుసుకొంటినని సంతోషించువాడు పిచ్చివాడు.

అట్టివాడు ఒక తటాకము సమీపమందుండు మామిడిచెట్టు, ఆ తటాకజలమునందు ప్రతిబింబించగా, ఆ ప్రతిబింబము నందుండు మామిడిపండును జూచి, ఆ పండును తాను తిన్నట్లు సంతోషించుచున్నట్టి మూఢునితో సమానుడగుచున్నాడు. కాబట్టి ఎన్నాళ్ళు వేదాంతశ్రవణము చేసినను, గురుకటాక్షముచేత స్వానుభవమును పొందకున్నయెడల ప్రయోజనము లేదు సుమా!

## జ్ఞానసన్న్యాసికి ముఖ్యమైన సాధనములు.

శ్రుతి॥ సత్యజేద్యతి నిర్ముక్తో-యో-మాధూకర- భోజనమ్। వైరాగ్య-జనకం- శ్రద్ధా- కళత్రం- జ్ఞాన- నందనమ్॥

తా॥ మునిశ్రేష్ఠా! నిజముగా ముక్తుడయిన జ్ఞానసన్న్యాసి ఆత్మానుసంధాన మనెడి భిక్షాన్నమునున్ను, వైరాగ్యమనెడి తండ్రినిన్ని మఱియు బ్రహ్మనిష్ఠా సాధనము చేయవలయు ననెడి త్వరయే (శ్రద్ధ యనబడును) అట్టి శ్రద్ధయనెడి భార్యనున్ను, బ్రహ్మ జ్ఞానమనెడి పుత్రునిన్ని, ఒకప్పుడయినను విడిచియుండరాదు సుమా!

## ధనవంతులు మొదలగు వారికంటెను జ్ఞానియే గొప్ప.

శ్రుతి॥ ధనవృద్ధా- వయోవృద్ధా- విద్యావృద్ధ- స్తథైవచ। తే- సర్వే- జ్ఞానవృద్ధస్య- కింకరా- శ్శిష్యకింకరాః॥

తా॥ మునిపుంగవా! (ధనవృద్ధులున్ను) అనగా గొప్ప ధనవంతులున్ను (వయోవృద్ధులున్ను) అనగా వయస్సుచెల్లిన వృద్ధులున్ను, (విద్యావృద్ధులున్ను) అనగా వ్యాకరణము మొదలగు సకలశాస్త్రములను తెలిసిన గొప్ప విద్వాంసులున్ను, వీరందఱున్ను (జ్ఞానవృద్ధునియొక్క) అనగా స్వానుభవ జ్ఞానసంపన్నుడగు బ్రహ్మజ్ఞాని యొక్క పాదములను సేవించుచుండు సేవకులకు సేవకులుగా నున్నారు గాన, అట్టి ధనవంతులున్ను, వయస్సు చెల్లిన వృద్ధులున్ను, విద్వాంసులున్ను మేమే శ్రేష్ఠులమని గర్వపడరాదు సుమా!

## ఆత్మానుసంధానము చేయని విద్వాంసులు నిష్ప్రయోజకులు.

శ్రుతి॥ మన్మాయా- మోహిత- చేతసో- మామాత్మన- మాపూర్ణ మలబ్ధవంతః పరం- విదగ్ధోదర- పూరణాయ- భ్రమంతి- కాకా ఇవ- సూరయోపి॥

తా॥ మునిపుంగవా! నా మాయవలన మోహింపబడినవారగుచు విద్వాంసులు సహితము అఖండ సచ్చిదానంద సర్వపరిపూర్ణ పరబ్రహ్మమగు నన్ను ఆత్మస్వరూపునిగా తెలియలేక, స్వానుభవజ్ఞానము లేక, (మేము విద్వాంసులము, జ్ఞానులమని) తమంతట తామే పొగడుకొనుచు, వారి విద్యాప్రావీణ్యతను చెప్పుకొనుచు, వారి యుపన్యాసములవలన లోకులను భ్రమింపచేయుచు, ఉదర పోషణకొఱకు కాకులరీతిగా

ఇంటింటికి తిరిగి ద్రవ్యమును సంపాదించి కడుపు నిండించుకొనుచున్నారు. అట్టివారు వ్యర్థులే సుమీ! ఎట్లనగా:—(శ్రుతి॥ యోహి- వృత్తిం- విహాయైనాం- బ్రహ్మాఖ్యాం పావనీం- పరామ్। వృథైవ- తేతు- జీవంతి- పశుభిశ్చ- సమా- సమా- నరాః॥ యాతు- వృత్తిం- విజానంతి- జ్ఞాత్వా- వైవర్థయంతి- యే। తేవై - సత్పురుషా - ధన్యా - వంద్యాస్తే - భువనత్రయే॥)—అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, ఎవరు ఆత్మానుసంధానమును గురుముఖంబున దెలుసుకొన అభ్యసింపక వృథాగా కాలము గడుపుచుందురో, అట్టివారు చతుష్పాద జంతువులగు పశువులతో సమానులగుచున్నారు. ఎవరు సద్గురుకటాక్షముచేత వారొసగిన ఆత్మనిష్ఠను సదా అభ్యాసము చేయుచు బ్రహ్మానంద స్వరూపులై యుందురో, వారే సత్పురుషులనియు, కృతార్థులనియు, త్రిలోకములందు నమస్కరింపదగిన మహాత్ములనియు, చెప్పబడుదురు. మఱియు (శ్రుతి॥ ఏషాం- వృత్తి - స్సమావృత్తా - పరిపక్వాచ - సా పునః - తేవై సద్బ్రహ్మతాం - ప్రాప్తా- నేతరే- శబ్దవాదినః॥ కుశలా- బ్రహ్మవార్తాయాం- వృత్తిహీనా- స్సురాగిణః తేప్యజ్ఞానతయా- నూనం- పునరాయాంతి- యాంతిచ॥)—అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగాను, మఱియు, శ్రుతి॥ అవిద్యాయా - మంతరే- వర్తమానాః - స్వయంధీరాః - పండితం- మన్యమానాః। దంద్రమ్యమాణాః- పరియాంతి- మూఢా- అంధేనైవ- నీయమానా- యథాంధాః॥)—అనెడి కఠోపనిషత్తు వాక్యరీతిగాను, ఎవరు ఆత్మానుసంధానమును జేయుచు, మనోవృత్తిశూన్యులై ప్రకాశించుచుందురో, అట్టివారే సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మత్వమును పొంది ముక్తులగుదురు, అట్లుగాక, ఎవరు (నేను (బ్రహ్మమని) వాక్కుచే మాత్రము పలుకుచుందురో, వారున్ను మఱియు శాస్త్రములను చదువుకొని వాటియొక్క అంతరార్థమును దెలియక స్వానుభవము లేక, బాహ్యార్థమును మాత్రము తెలుసుకొని మేము బ్రహ్మజ్ఞానులమని విఱ్ఱవీగుచుందురో, అట్టి ఆభాస వేదాంతములున్ను, వారి వాక్యములను నమ్మకొని యుండువారున్ను వ్యర్థులగుచున్నారు. అట్టివారు మిట్టపల్లములుగల భూమియందు ఒక గ్రుడ్డివానిచే తీసుకొని పోబడిన గ్రుడ్డివారున్ను పల్లమునందు దిగబడిపోవుచు దుఃఖించునట్లుగా, జనన మరణ సాగరమునందు మునిగి మోక్షమనెడి దరిగానక దుఃఖించుచుందురు.

## జ్ఞానసన్న్యాసి విగ్రహారాధన చేయరాదు

శ్రుతి॥ పాషాణ- లోహ - మణి- మృణ్మయ- విగ్రహేషు, పూజా, పునర్జనన భోగకరీ - ముముక్షోః। తస్మాద్యతి - స్స్వహృదయార్చనమేవ - కుర్యాత్ - బాహ్యార్చనం- పరిహరే- దపునర్భవాయ॥

తా॥ ఋషిసత్తమా! రాయి, బంగారు, తామ్రము మొదలగు లోహములు మరకతము, పద్మరాగము, స్ఫటికము మొదలగు రత్నములు; మట్టి, మాను మొదలగు వానిచే జేయబడిన విగ్రహములు వీనిని పూజించుటవలన సకల భోగములను అనుభవిం

చుటకుగాను పునర్జన్మములు గలుగును. కాబట్టి జ్ఞానసన్యాసి తన హృదయమునందు ఆత్మారాముని పూజమాత్రము చేయవలసినది. (బాహ్యార్చనము) అనగా విగ్రహములను పూజించుట, పునర్జన్మము గలుగుటకు కారణముగా నున్నది గాన, జ్ఞానసన్యాసి యగువాడు పునర్జన్మరహితమగు మోక్షమును పొందుటకుగాను (బాహ్యార్చనమును) అనగా విగ్రహములను పూజించుటను విడిచిపెట్టవలసినది సుమా?

## స్వ రూ పా ను భ వ బో ధ.

శ్రుతి॥ అంతఃపూర్ణో- బహిఃపూర్ణో- పూర్ణకుంభ - ఇవార్ణవే । అంతశ్శూన్యో- బహిశ్శూన్య- శూన్యకుంభ- ఇవాంబరే॥ మాభవ - గ్రాహ్యభావాత్మా - గ్రాహకాత్మాచ- మాభవ । భావనా మఖిలం- త్యక్త్వా- యచ్ఛిష్టం- తన్మయో- భవ॥ ద్రష్టృ దర్శన- దృశ్యాని- త్యక్త్వా- వాసనయా- సహ । దర్శన-ప్రథమాభాస- మాత్మానం- కేవలం- భజ॥ సంశాంత- స్సర్వసంకల్పా- యా- శిలావదవస్థితిః । జాగ్రన్నిద్రా- వినిర్ముక్తా- సా- స్వరూపస్థితిః- పరేతి॥

తా॥ మునిశరేణ్యా! సముద్రమునందు మునిగియుండు కుండకు దాని లోపలనున్ను వెలుపలనున్ను జలము పరిపూర్ణముగా వ్యాపించి యుండునట్లు,—(శ్రుతి॥ స- బాహ్యాభ్యంతరే- దేహేహ్యధ- ఊర్ధ్వంచ- దిక్షుచ । ఇత- ఆత్మా- తతోప్యాత్మా- నాత్త్యనాత్మమయం - జగత్॥)—అనెడి మహోపనిషత్తు వాక్యరీతిగా, నీకు వెలుపను లోపలను, నీ దేహమందును, నీకు క్రిందను మీదను, నీకు ఇరుప్రక్కలందును, నీకు అష్ట దిక్కులందును, ఇక్కడను, అక్కడను, ఎక్కడను సర్వత్ర పరబ్రహ్మమగు ఆత్మ పరిపూర్ణముగా వ్యాపించియున్నది గాని, దానిని వినా రెండవవస్తువు లేదు సుమా? అట్టి సర్వపరిపూర్ణ పరబ్రహ్మమగు ఆత్మయే నీవగుచున్నావుగాన, అది ఎటింగి సదా తన్మయంబుగా నుండుము, మఱియు రూపశూన్యమగు బయలునం దుంచబడిన కుండయందు లోపల వెలుపల ఏమియులేక శూన్యముగా నుండునట్లు, నీకు లోపల నుండు (అంతరవృత్తులను) అనగా సంకల్పవికల్ప కామక్రోధాది వృత్తులనున్న, నీయందలి (బాహ్యవృత్తులను) అనగా బాహ్యేంద్రియములగు జ్ఞానేంద్రియ కర్మేంద్రియ వ్యాపారములనున్న, శూన్యముగాజేసి సకలవృత్తులు శూన్యమై తన్మయంబుగా నుండుము (గ్రాహ్యము) అనగా గ్రహింపబడిన వస్తువున్న, (గ్రాహకము) అనగా గ్రహించు వస్తువున్న నీవు గావు గాన, ఈ రెంటిని నీవనెడి తలంపును విడిచిపెట్టుము సకల తలంపులను విడిచిపెట్టి శేషించిన వస్తువగు కేవల చైతన్యస్వరూపమగు ఆత్మయే, నీవని తెలిసి తన్మయముగా నుండుము. (ద్రష్ట) అనగా జీవుడున్న, (దర్శనము) అనగా జీవసంబంధమగు అంతఃకరణమున్న, (దృశ్యము) అనగా దేహేంద్రియాది ప్రపంచమున్న, నీవుగావు గాన, ఈ మూటిని విడిచిపెట్టి, వీటికి భిన్నముగా సాక్షిగా స్వయంప్రకాశముగా అధిష్ఠానముగా నుండు పరబ్రహ్మమగు ఆత్మయే నీవని యెఱింగి

తన్మయముగా నుండును. సకల సంకల్పములున్ను నశించి, యెలుకమలపులు లేక చిత్రాయిరీతిగా అచంచలముగా కేవల నిర్వికల్ప ప్రజ్ఞామాత్రముగా నుండు స్థితియే జాగ్రదావస్థ నిద్రావస్థలను మీరినట్టి ఆత్మానుభవస్థితి యనియు, స్వానుభవస్థితి యనియు, బ్రహ్మసాక్షాత్కార స్థితి యనియు చెప్పబడును. అట్టి స్వానుభవస్థితిని తెలిసి సదా తన్మయంబుగా నుండుము. మునివర్యా! ఇదియే పరమతత్త్వ రహస్యము సుమా! ఇదియే సకల వేదాంతరహస్యము సుమా! అని శ్రీ ఉమామహేశ్వరుండు మైత్రేయ మహాఋషికి బోధించెను.

శ్రుతి॥ ఇతి - ద్వితీయోధ్యాయః॥—

తా॥ ఇది సామవేదమునందలి మైత్రేయోపనిషత్తు ద్వితీయాధ్యాయము తాత్పర్య సహితము సంపూర్ణము.—

☞ ఈ ద్వితీయాధ్యాయము కడపట ఈ ఉపనిషత్తు ప్రారంభమునందు చెప్పబడియుండు — (అప్యాయంతు - మమాంగాని) — అనెడి శాంతివాక్యము అను తాత్పర్యముతోడ చదువవలసినది.

---

అని యిట్లు శ్రీ సద్గురుండు తన ప్రియశిష్యరత్నమునకు సర్వసార, నిరాలంబ, అమృతబిందు, మైత్రేయము లనెడి ఈ నాలుగు ఉపనిషత్తులను మొదటినుండి కడ వఱకు సంపూర్ణముగా తాత్పర్యముతోడ బోధించి యిట్లనియె.—శిష్యా! నీకు వేదాంత సారంబగు సకల తత్త్వ రహస్యంబులను సులభముగా బోధించితిని గాన—(శ్రుతి॥

## దేహము నేననుటే చండాలము.

దేహోహమితి- సంకల్పో- మహాత్సంసార- ఉచ్యతే। దేహోహ మితి- యత్ -జ్ఞానం
దేహోహమితి- సంకల్పో- మహాత్సంసార- ఉచ్యతే। దేహోహమితి- యాబుద్ధి- స్సాదావిద్యేతి- ప్రోచ్యతే। దేహో
తదేవాజ్ఞాన- ముచ్యతే। దేహోహమితి- యాబుద్ధి- స్సాదావిద్యేతి- ప్రోచ్యతే। దేహో
హమితి- యత్ - జ్ఞానం - తదేవ- ద్వైతముచ్యతే। దేహోహమితి- సంకల్పో- మహా
పాప- మితి స్ఫుటమ్ )—అనెడి తేజోబిందూపనిషత్తు వాక్యమురీతిగాను, శిష్యా!
దేహము నేననెడి సంకల్పమే మహాసంసారమనుచు చెప్పబడును సుమా! దేహము నే
ననెడి జ్ఞానమే అజ్ఞానమనబడును. దేహము నేననెడి బుద్ధియే అవిద్య యనబడును.
దేహము నేననెడి జ్ఞానమే అద్వైతమనబడును. దేహము నేననెడి సంకల్పమే మహా

## సోహం మంత్ర ధ్యాన బోధ.

పాపమనబడును, కాబట్టి దేహము నేననెడి భ్రాంతిని సత్యముగా నీవు విడిచిపెట్టుము.
శ్లో॥ దేహేంద్రియాదయో- భావా- హానాది- వ్యాపృతి- క్షమాః। యస్య- సన్నిధి-
మాత్రేణ- సోహ- మిత్యవధారయ॥ 1. అనాపన్న- వికారః- సన్నయస్కాంతవదేవ-
యః। బుద్ధ్యాదీం- శ్చాలయేత్- ప్రత్యక్సోహ- మిత్యవధారయ॥ 2. అజడాత్మ- వదా

స్వరూపమగు వస్తువే ఆత్మయనియు, బ్రహ్మమనియు చెప్పబడును గాన, అదే నీవని సదా సోహంమంత్ర ధ్యానమం దుండుము అని శిష్యునిం జేరదీసి సమీపంబున కూర్చుండ బెట్టుకొని వాని లలాటంబున భస్మంబు బెట్టి కరుణారసదృష్టితో హంసమంత్ర కీలకంబును దెలిపి, శిష్యా! సోహం మంత్రధ్యానమే సవికల్పసమాధి యనబడును. అని దాని సంచార రహస్యమును చక్కగా బోధించి, తర్వాత శిష్యా! ఇక నిర్వికల్పసమాధి రహస్యమును బోధించుచున్నాను, శ్రద్ధగలవాడవై వినుమని యిట్లనియె.(—శ్రుతి। శమస్థిర- సమాధానో- యేన త్యజసి- తత్త్వజ॥)—అనెడి మహోపనిషత్తు రీతిగను, మఱియు,—(శ్రుతి। శమస్థిర- సమాధానో- మయి- త్వం- భజ- మారుతే॥)—అనెడి ముక్తికోపనిషత్తు రీతిగాను, శిష్యా! ఏ విచారజ్ఞానముచేత ఈ దేహేంద్రియాది ప్రపంచము నేనుగానని సకలమును విడిచిపెట్టి ఈ దేహేంద్రియాది ప్రపంచమును సర్వమును రెుఱుంగుచుండెడి కేవల సాక్షిస్వరూపమగు ఆత్మయే నేనని యెఱిగి ధ్యానించుచుంటివో, ఆ ధ్యానమునున్ను ఆ విచారజ్ఞానమునున్ను ఆ రెంటినిన్ని విడిచిపెట్టి, సకల సంకల్పములను నాశముచేసి శేషించిన కేవల జ్ఞప్తిమాత్ర స్వరూపమగు పరబ్రహ్మము నందు స్థిమితపడుము.—(శ్లో॥ బహిఃప్రజ్ఞాం- సదోత్సృ- జ్యాత్యంతః- ప్రజ్ఞాంచ-యో

## స్వానుభూతి రహస్య బోధ.

బుధః। కయాపి- ప్రజ్ఞయోపేతః- ప్రజ్ఞావానితి- కథ్యతే॥)—అనెడి శ్రుతివాక్య రీతిగా, శిష్యా! (బహిఃప్రజ్ఞ) అనగా దేహేంద్రియ దారా పుత్త్రి ధనధాన్య భూమణి వాహన గృహారామాది ప్రపంచవిషయ పదార్థములను ఇదినాది ఇదినాదియని అభిమానించుచు, వానియందు దగిలియుండు (ప్రజ్ఞ) అనగా మనస్సు, అది నీవుగావు గాన దానిని విడిచిపెట్టుము. మఱియు (అంతరప్రజ్ఞ) అనగా నేను కర్తను, నేను భోక్తను, నేను కామముగలవాడను, కోపము గలవాడను, నేను జీవుడను, నేనుసాక్షిని, నేను బ్రహ్మము అని భావించుచుండెడి (ప్రజ్ఞ) అనగా బుద్ధిసంబంధమగు జ్ఞానము అదియు నీవుగావు గాన దానిని విడిచిపెట్టుము. ఈ బహిరంతములయిన మనోబుద్ధ్యాది సకల తత్త్వములను ఏ జ్ఞానము కేవల నిర్వికార చిన్మాత్రముగా కూటస్థముగా నుండుచు రెుఱుంగుచున్నదో అజ్ఞానమే కూటస్థప్రజ్ఞ యనియు, ఆత్మయనియు, పరబ్రహ్మమనియు చెప్పబడుచున్నది. అట్టి కూటస్థప్రజ్ఞయే నీవుగాన, సకల సంకల్పములను నాశముచేసి తన్మయంబుగా నుండుము. ఇదియే నిర్వికల్పసమాధి యనబడునుసుమా! అని యిట్లు స్వస్వరూపంబును బోధించి చిన్ముద్రను అభినయించి చూపగా అంత నా శిష్యుండు దీర్ఘ వైరాగ్యములో చిన్ముద్రయందు నిలిచి దేహేంద్రియాది జగత్తు సర్వమును మఱచి కేవల చిన్మాత్రుండై స్వయంప్రకాశుండై బ్రహ్మస్వరూపుండై ఆనందించును. కొంత సేపటికి ప్రపంచజ్ఞప్తి గలిగి లేచి సద్గురునాథునకు దీర్ఘదండ ప్రణామంబు లాచరించి లేచి నిలువబడి అంజలీహస్తుండై, ఓ గురునాథా! పరబ్రహ్మస్వరూపా! నారాయణా!

దేవరవారికటాక్ష వీక్షణంబులవలన నా దుఃఖంబులు తొలంగెను, సకల సంశయములు నశించెను, నా నిజస్వరూపంబును గనుగొంటిని, బ్రహ్మానందుండ నయితిని, పరమపావనుండ నయితినని పెక్కువిధంబుల నా సద్గురుని కీర్తించుచుండగా, అంత నా సద్గురుండు కరుణాంతరంగుండయి ఆ శిష్యునిం జేరదీసి కౌగిలించి తన సమీపంబున గూర్చుండబెట్టుకొని యిట్లనియె.—

## జగత్తు మిథ్య యనుట.

శ్రుతి॥ శశశృంగేణ- నాగేంద్రో- మృతశ్చేత్- జగదస్తి- తత్ । మృగతృష్ణా- జలంపీత్వా- తృప్తశ్చేత్- అస్త్విదం జగత్॥ నరశృంగేణ- నష్టశ్చే త్కశ్చిత్-అస్త్విదమేవహి । గంధర్వనగరే- సత్యే- జగత్- భవతి- సర్వదా । గగనే- నీలిమా-సత్యే జగత్సత్యం భవిష్యతి । శుక్తికారజతం- సత్యం- భూషణం- చేజ్జగద్భవేత్ । రంభాస్తంభేన- కాష్ఠేన- పాకసిద్ధి- ర్జగద్భవేత్ । కూర్మరోమ్ణా- గజేబద్ధే- జగదస్తు- మదోత్కటే । జ్వాలాగ్నిమండలే- పద్మవృద్ధిశ్చేజ్జగత్- అస్త్విదం । మశకేన- హతే- సింహే- జగత్సత్యం తదాస్తు తే । స్వప్నదృష్టంచ- యద్- వస్తు జాగరేచే- జ్జగద్భవః వంధ్యాగర్భా స్థిత- స్సౌఖ్యం- జ్ఞాతాచేత్- అస్త్విదం- జగత్ । కాకోవా- హంసవద్- గచ్ఛే- జ్జగద్భవతు- నిశ్చలమ్ । మహాఖరో- గజగతిం- గతశ్చేజ్జగదస్తు-తత్ । సంపూర్ణచంద్ర- సూర్యశ్చే- జ్జగద్భాతు- స్వయం- జడమ్ । భ్రష్ట బీజ- సముత్పన్న- వృద్ధిశ్చే- జ్జగదస్తు- తత్ । శునాం- వీర్యేణ- సింహస్తు- జనోయది- జగత్తదా । శ్వాజేన- సాగరే- పీతే- నిశ్శేషేణ- జగద్భవేత్ । శుద్ధాకాశో- మనుష్యేషు- పతితశ్చేత్తదా- జగత్ । భూమావా- పతితం- వ్యోమ- వ్యోమపుష్ప- సుగంధకే । శుద్ధాకాశవనే- జాతే - చలితేతు - తథా- జగత్॥)— అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, శిష్యా! కుండేటికొమ్ములు పొడుచుకొనుటవలన ఏనుగు చచ్చినయెడల జగత్తు సత్యమగును యెవడయినను యెండమావులందలి జలమును పానముజేసి తృప్తిపొందినయెడల జగత్తు సత్యముగా నుండును. మనుష్యునికొమ్ములచే యెవడయినను పొడువబడి చచ్చినయెడల ప్రపంచము సత్యమగును. గంధర్వ పట్టణము నిజమయినయెడల ప్రపంచము నిజమగును. ఆకాశమునందలి నీలవర్ణము సత్యమయ్యెనేని ప్రపంచము వాస్తవ్యమయిన దగును. శుక్తికి రజతముచే చేయబడిన భూషణము నిజమయినదయ్యెనేని ప్రపంచము నిజమగును. అరటి స్తంభములను కట్టెలుగా అగ్నియందు నుపయోగించుటవలన అన్నము [illegible] పాకమయ్యెనేని ప్రపంచము నిజముగా నుండును. మజ్జిగ పాలుగా అయినయెడల జగత్తు నిజమగును. తాబేటి రోమములవలన గజము కట్టబడినయెడల జగత్తు వాస్తవ్యమగును, జ్వాలాగ్ని మండలంబునందు ఉంచబడిన తామరపుష్పము [illegible]

జగత్తు సత్యమగును. తానుచేత సింహము చచ్చినయెడల ప్రపంచము నిజమగును. స్వప్నమునందు తోచిన పదార్థములు జాగ్రదావస్థయందు కనబడినయెడల ప్రపంచము వాస్తవమగును. గొడ్రాలిబిడ్డ శౌర్యముగా జీవించి వృద్ధిపొంది యుండెనేని జగత్తు సత్యమగును. కాకి హంసరీతిగా పలుకుచు సంచరించినయెడల జగత్తు నిజంబగును. గాడిద సింహముతో యుద్ధముచేసి జయించెనేని ప్రపంచము సత్యంబగును. గాడిద గజమురీతిగా గర్జించుచు సంచరించినయెడల జగత్తు సత్యంబగును. పూర్ణచంద్రబింబము సూర్యబింబముగా తోచెనేని జగత్తు సత్యమగును. అగ్నియందు శీతలత్వము మంచు అంకురించిన పక్షమున జగత్తు వాస్తవముగా నుండును. కుక్కయు సింహముతో కలహించి జయించినయెడల జగత్తు నిజంబగును. కుక్కయు సాగరజలమునంతయు త్రాగినయెడల ప్రపంచము నిజంబగును. ఆకాశము మనుష్యుని తలమీద పడినయెడల జగత్తు నిజమగును. ఆకాశము భూమిమీద పడినయెడల జగత్తు సత్యంబగును. ఆకాశమునందలి తోటలోని చెట్లయందలి పుష్పములు ధరించి నేలరాలినయెడల జగత్తు సత్యంబగును సుమా!—కాబట్టి,—శ్రుతి॥ మాయా కార్యాదికం - నాస్తి-మాయా-నాస్తిభయం - నహి । ఇదం ప్రపంచం-నాస్త్యేవ - నోత్పన్నం-నోస్థితం - క్వచిత్॥ —అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, మాయయును మిథ్యయే, మాయాకార్యమయిన

## పరిపూర్ణబోధ.

ఈ జగత్తును మిథ్యయే సుమా!—(శ్రుతి॥ సర్వం - నాహం - నచాన్యకం।- సర్వం-బ్రహ్మైవ - కేవలమ్ । నదేహో నచకర్మాణి - సర్వం - బ్రహ్మైవ - కేవలమ్ । నభూతం - నచకార్యంచ - నచావస్థా - చతుష్టయమ్ అతీంద్రియం - విజ్ఞానం - సర్వం - బ్రహ్మైవ - కేవలమ్॥)—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, శిష్యా! నీవు లేవు, నేను లేను, మఱియు ఇతరమేమియును లేదు, సర్వము కేవల పరబ్రహ్మమే సుమా! దేహములేదు, కర్మములేదు, సర్వం బ్రహ్మమే సుమా! పంచభూతములు లేవు, ఆ పంచభూతకార్యములున్ను లేవు. జాగ్రదాది అవస్థాచతుష్టయమున్ను లేవు సుమా! సత్యజ్ఞానానంద సర్వపరిపూర్ణమగు పరబ్రహ్మమునకంటెను అన్యమేమియును లేదుసుమా! (శ్రుతి॥ యద్యత్పశ్యతి - చక్షుర్భ్యాం - తత్తదాత్మేతి - భావయేత్ । యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం - తత్తదాత్మేతి - భావయేత్ । లభతే - నాసయా - యద్య - తత్త - దాత్మేతి - భావయేత్ । జిహ్వయా - యద్రసంహ్యత్తి - తత్తదాత్మేతి భావయేత్ । త్వచా - యద్యత్ - స్పృశేద్యోగీ - తత్తదాత్మేతి - భావయేత్॥)—అనెడి యోగతత్త్వోపనిషత్తురీతిగా, శిష్యా! నేత్రములకు కనబడునట్టి రూపములన్నియును పరబ్రహ్మముగా భావింపుము. నీశ్రోత్రములచే వినబడునట్టి శబ్దములన్నియును పరబ్రహ్మముగా తలంచుము, నీముక్కుచే యెఱుంగబడిన గంధములన్నియును పరబ్రహ్మముగా ఎంచుము, నీజిహ్వచే నిరు యెఱుంగబడిన రసములన్నియు

పరబ్రహ్మముగా భావింపుము నీత్వగింద్రియముచే నీవు స్పృశించు వస్తువు లన్నిటిని
పరబ్రహ్మముగా నెంచుము—(శ్రుతి: ఇదం - బ్రహ్మ - పరంబ్రహ్మ - సత్యం-బ్రహ్మ-
ప్రభుర్హి - సః। లోకోబ్రహ్మ - గురుర్ - బ్రహ్మ - శిష్యోబ్రహ్మ - సదాశివః।
పూర్వం - బ్రహ్మ - పరంబ్రహ్మ - శుద్ధంబ్రహ్మ - శుభాశుభవమ్। జీవఏవ - సదా
బ్రహ్మ - సచ్చిదానంద మస్మ్యహమ్। సర్వం - బ్రహ్మమయం - ప్రోక్తం - సర్వం-
బ్రహ్మమయం - జగత్। స్వయం - బ్రహ్మ - నసందేహ - స్వస్మాదన్యం - నకిం
చన। చైతన్యమాత్ర - మోంకారం - బ్రహ్మైవ - సకలం - స్వయమ్। అహమేవ -
జగత్సర్వ - మహమేవ - పరం - పదమ్। అహమేవ - గుణాతీత - అహమేవ -
పరాత్పరః। అహమేవ - పరంబ్రహ్మ - అహమేవ - జగద్గురుః। అహమేవాఖిలా
ధార - అహమేవ - సుఖాత్సుఖమ్। ।ఆత్మనోన్య - జగన్నాస్తి - ఆత్మనోన్య -
త్సుఖం - నచ। ఆత్మనోన్యా - గతిర్నాస్తి - సర్వమాత్మమయం - జగత్। ఆత్మ
నోన్య - న్నహి క్వాపి - ఆత్మనోన్యం - తృణంనహి। ఆత్మనోన్యత్తుషం - నాస్తి -
సర్వమాత్మమయం - జగత్। బ్రహ్మమాత్ర - మిదంసర్వం - బ్రహ్మమాత్ర -
మసన్నహి। బ్రహ్మణోన్య - త్తృణం - నాస్తి - బ్రహ్మణోన్యత్పదం - నహి। సర్వం-
బ్రహ్మైవ - సతతం - సర్వం - బ్రహ్మైవ - కేవలమ్। సర్వం - బ్రహ్మైవ - సతతం -
సర్వం - బ్రహ్మైవ - చేతనమ్)—అనెడి వేదోక్తిరూపనిమత్తరీతిగా, శిష్యా! ఈ
భూలోకమంతయు బ్రహ్మమే, పరలోకమంతయు బ్రహ్మమే, బ్రహ్మము సత్యమైనది,
సకలమునకు ప్రభువైనది, ఈ పదునాలుగు లోకములున్ను బ్రహ్మమే, గురు
శిష్యులు ఇద్దఱున్ను బ్రహ్మమే, ముందు వెనుక సర్వత్ర బ్రహ్మమే, శుద్ధాశుద్ధ
ములు శుభాశుభములున్ను బ్రహ్మమే జీవుడున్ను సచ్చిదానంద పరబ్రహ్మమే, ఈ
చరాచర జగత్తు సర్వమున్ను బ్రహ్మమే, సర్వమున్ను బ్రహ్మమయముగానే
యున్నది, బ్రహ్మము స్వయంప్రకాశ మైనది, తనకంటెను అన్య మేమియు
కించిత్తయినను లేనిది సుమా! అట్టి బ్రహ్మము శుద్ధచైతన్యమాత్ర స్వరూప మయి
నది, ఓంకారస్వరూప మయినది, తన కన్యమేమియును లేక సర్వము తానయి
యున్నది. అట్టి పరబ్రహ్మము ఆత్మస్వరూపముగా నున్నది గాన, అట్టి ఆత్మస్వరూపుడ
నగు నేనే సర్వజగత్తుగా నున్నాను, నేనే పరమపదము, నేనే శుద్ధనిర్గుణ స్వరూపుం
డను, నేనే పరాత్పరుండను, నేనే పరబ్రహ్మము, నేనే జగద్గురుండను, నేనే సర్వా
ధారుండను, నేనే పరమానందుండను, పరమసుఖస్వరూపుండను, పరబ్రహ్మమగు ఆత్మ
కంటెను వేఱుగా జగత్తు లేదు. పరమ సుఖస్వరూపమగు ఆత్మకంటెను వేఱుగా
మఱియొక శ్రేష్ఠమయిన సుఖము లేదు సుమా! ఆత్మకంటెను వేఱేగతి ఏదియు లేదు.
సర్వజగత్తును ఆత్మమయముగా నున్నది, ఆత్మకంటెను అన్యము రొక్కడను లేదు,
ఆత్మకంటెను అన్యముగా తృణమయినను లేదు, ఆత్మకంటెను అన్యముగా అణుమాత్ర

యినను లేదు, సర్వజగత్తును ఆత్మమయముగా నున్నది, అట్టి ఆత్మకంటెను వేఱుగా పరబ్రహ్మమనునది వేఱొకటి లేదుగాన ఆత్మయే పరబ్రహ్మము, అట్టి బ్రహ్మమే సర్వముగా నున్నది, అట్టి సద్రూపమగు బ్రహ్మముకంటెను వేఱుగా అసత్తగు ప్రపంచము మఱియొకటి లేనేలేదుసుమా! బ్రహ్మముకంటెను అన్యముగా తృణమయినను లేదు. బ్రహ్మముకంటెను వేఱుగా మఱియొక పదము సత్యముగా లేదు. సంతతము సర్వము కేవలబ్రహ్మమే, పరిశుద్ధచేతనమగు పరబ్రహ్మమే సర్వముగా నున్నది— (శ్రుతి॥ అహం

## అహం బ్రహ్మాస్మి అను సంధానము.

బ్రహ్మాస్మి- మంత్రోఽయం- జన్మపాపం- వినాశయేత్ । అహంబ్రహ్మాస్మి- మంత్రోఽయం- భేదబుద్ధిం - వినాశయేత్ । అహం బ్రహ్మాస్మి - మంత్రోఽయం - కోటిదోషం - వినాశయేత్ । అహంబ్రహ్మాస్మి- మంత్రోఽయం- జ్ఞానానందం- ప్రయచ్ఛతి । సర్వమంత్రాన సముత్సృజ్య - ఏతన్మంత్రం - సమభ్యసేత్ । సద్యోమోక్ష - మవాప్నోతి - నాస్తి- సందేహ- మణ్వపి॥)—అనెడి తేజోబిందూపనిషత్తు రీతిగా, శిష్యా! ఆత్మస్వరూపుడను నేను బ్రహ్మమయితిని అను నీ మంత్రము జన్మమునకు కారణమయిన పాపమును పోగొట్టును. నేను బ్రహ్మమయితిని అను నీ మంత్రము (భేదబుద్ధిని) అనగా నేను వేఱు నీవు వేఱు అనెడి అజ్ఞానమును నాశముచేయును. నేను బ్రహ్మమయితి ననెడి ఈ మంత్రము కోటిదోషములను పోగొట్టును. నేను బ్రహ్మమయితి ననెడి ఈ మంత్రము జ్ఞానానందమును గలుగజేయును. కాబట్టి సమస్తమంత్రములను విడిచిపెట్టి (అహం బ్రహ్మాస్మి) అను మహామంత్రమునే ధ్యానించు చుండవలయును. ఈ మహామంత్ర రహస్యమును గురుముఖమునం దెలుసుకొని దీనిని ధ్యానించు చుండువాడు అప్పుడే మోక్షమును పొందును. ఇందుకు కొంచెమయినను సందేహము లేదుసుమా! మఱియు శిష్యా! జాగ్రత్తగా వినుమని యిట్లనిరి.—

(శ్రుతి॥ అహంబ్రహ్మేతి – నిశ్చిత్య - అహంభావం - పరిత్యజ । సర్వమేవ - అయంరాతి-సుప్తవాస్తస్థ- పుష్పవత్ । సర్వవ్యాపార ముత్సృజ్య-అహంబ్రహ్మేతి- భావయః । అహంబ్రహ్మ - నసందేహో - హ్యహంబ్రహ్మ - చిదాత్మకమ్ । సచ్చిదానందమాత్రోఽహ - మితి - నిశ్చయ - తత్త్వజ॥)—అనెడి తేజోబిందూపనిషత్తురీతిగా, శిష్యా! నిద్రించువాని చేతియందుండు వస్తువు తనకు తానుగా జాఱిపడిపోవునట్లు, ఎవడైతే అహంకారశూన్యుడై ఆత్మస్వరూపుడగు నేనే బ్రహ్మమని నిశ్చయించుకొని, సదా అహం బ్రహ్మాస్మి యనెడి మంత్రమును ధ్యానించుచున్నాడో, వానికి సకల కర్మములున్ను నశించి, వాడు నిజముక్తిని సత్యముగా బొందగలడు గాన, నీవు సకల వ్యాపారములను విడిచిపెట్టి, దేహము నేననెడి భ్రాంతిలేనివాడవై, నేనే బ్రహ్మమని భావించి (అహంబ్రహ్మాస్మి) అనెడి మంత్రమును ధ్యానించుము, తర్వాత నాధ్యానమున్ను విడిచిపెట్టుము.—(శ్రుతి॥ యత్పరం - విమలం - మద్వయం - శివం । తత్సదా

అనెడి శ్రుతిరీతిగా, సంకల్పముల నన్నిటిని శూన్యముగా హామిని - భావమాత్రయః)—అనెడి శ్రుతిరీతిగా, చిదాకాశముగా నిర్వాపసా భావనిష్ఠయాం దుండు జేసి యెట్టికల్మషములు లేక కేవల చిదాకాశముగా నిర్వాపసా — (ప్రతివాక్యం - సదా - యతిః)—ము:—(శ్రుతిః దద్యా - స్నానయణే లేశ్యత - (ప్రతివాక్యం - సదా - యతిః)— అనెడి శ్రుతిరీతిగా, ఎవరైనను నీవద్దకివచ్చి వారి కోరికలను దెల్పి మొఱబెట్టుకొనగా, నారాయణుడు మీకు సకలాభీష్టములను ఇచ్చునని పలుమారులు చెప్పుచుండుము ! అని యిట్లు శ్రీ సద్గురుండు తన ప్రియశిష్యునకు వేదాంతసారంబు సర్వంబును బోధించి సకల సంశయములను బోగొట్టి అతనిని కృతార్థునిగా జీవన్ముక్తునిగా బ్రహ్మస్వరూపునిగా జేసెను.

ఇది వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి అను గురుశిష్య
సంవాదంబు సర్వంబును సంపూర్ణము.

---

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాల, చెన్నపురి. (16-7-54) 2000

వసిష్ఠప్రోక్త వైద్యశాస్త్రమను,

# పులిప్పాణి వైద్యరహస్యము.

యీ గ్రంథము మహాసిద్ధుడగు పులిప్పాణి స్వాముల వారివలన వ్రాయబడిన గొప్పగ్రంథము. ఈ గ్రంథము యిటీవల జగన్నాథ స్థలమందు నివసించి యుండిన మహాంధాత యను గోపాయి స్వాములు చాలా కాలమునుంచి అనుభవించుచూయుండిరి. ప్రకృతము యీగ్రంథము డాక్టర్ ఎస్. టి. ఎస్. టి. గోపాలయ్య అను వారివల్ల దేశ భాషయగు నాగరభాష యందుండి ఆంధ్రీకరించి యేయొక్క తప్పులు లేక యుండగా అనేక గొప్పపండితులచే సరిచూడబడి అచ్చువేయబడిన గొప్పగ్రంథము. ఇందు మహాసిద్ధులయొక్క అనుభవములోనున్న ఔషధముల యొక్క శుద్ధిక్రమములు, ఔషధముల యొక్క కట్టుభాగములు, భస్మభాగములు, సింధూర భాగములు, గుళిక భాగములు, లేహ్యములు, చూర్ణములు, కషాయములు, నూనె భాగములు, ద్రావకములు, రసాయనములు, కన్ను భాగములు, క్షౌరక భాగములు, ఇవియేగాక యింకను గర్భిణీ చికిత్సలున్ను, తైలశాస్త్రమున్ను సర్పశాస్త్రమున్ను కొందలగు వైద్యులకు ముఖ్యమైన అనేక విషయములు ఇందుగలదు గావ ప్రతివారివద్దను యీ గ్రంథముపుండి తీరవలెను.

వెల 1-8 200

---

దొరకు వారు:—వెస్టు వార్డు అండు కంపెని,
నెం, 12. ఇన్ స్పెక్టర్ సుబ్బరాయులు నాయుడువీధి, చాకలపేట, మదరాసు-21

# సకలసర్వగుణ అదృష్టదీపిక

ఆర్యజన ప్రభృతులకు మనవి యేమనగా,

ఈజ్యోతిశ్శాస్త్రమందరికి ముఖ్యముగా కావలసినది, ఇందు ముహూర్తభాగము, లగ్నభాగము, దశాభుక్తిభాగము, హస్తభాగము, స్త్రీభాగము, ఋతుభాగము, పురుష భాగము, ఉత్తమ మధ్యమభాగము, ఆంజనేయప్రశ్న, రామప్రశ్న, శ్రీరామ సీతా ఆరూఢచక్రము మొదలగు విషయములు గలవు. వెల 1-కి 1 0 0

## శుక బ్రహ్మకైవల్యము అను

### శుకమహాఋషి చరిత్రము.

(శుకులు తనతండ్రివద్ద సమస్తము నెఱింగి జనకచక్రవర్తివలన సందేహ నివర్తి బొందిన అనంతరము) శుకులకును రంభకును సంవాదరూపముగ అనేక దృష్టాంత శ్లోకములతో వ్రాయబడియున్నది. తుదిలేని సంసారసాగరమునంబడి మునుగుచు దరిగానక తల్లడిల్లుచున్న పామరులు సైతము ఈ గ్రంథము నొక్కసారి పఠించిన మొదలవారు బ్రహ్మమిట్టిదని తెలిసికొని సంసారసాగరమును తరింపగలరనుట నిశ్చయము. వెల 1-4-0

## పాతంజలయోగశాస్త్రము.

(తాత్పర్యముగలది)

ఇది హఠయోగమునంగల విషయములగు యోగములంబోలినదై మహాత్మ్యాంశము లగు విద్యలను విమర్శచే యోగాంగపరిశీలనవల్ల విజయత్వమును గుర్తెరుగు సులభోపాయంబులం బోధించుచున్నది. వెల 1-4-0

## సాందీపకృష్ణ సంవాదంబను

(అఖండపరిపూర్ణభావము వచనం.)

(తెప్పపల్లె చిట్టంరెడ్డి నరసింహయోగి ప్రచితం.) వెల 0-8-0

## భగవన్నామ సిద్ధాంతము. 0-8-0

## శుదనిర్గుణ తత్త్వ కందార్థములు.

ఊరాతురోపాది ద్వయదోషరహిత

పరతత్వ కందపద్యసహితము. వెల 1-0-0

వలయువారు:- వెస్టువార్డు అండు కంపెని, చాకల

## హఠయోగప్రదీపిక.

ఇందు హఠయోగము చేయుటవలన ప్రయోజనమును, అష్టాంగములగు యమ నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి లక్షణములును, ఆహారాది నియమములును, ఆసన ప్రయోజనమును, ఆసన భేదములును ప్రాణాయామాభ్యాస లక్షణమును ప్రాణాయామ భేదములును, ప్రాణాయామ సౌకర్యార్థము, ధౌతి కర్మ, వస్తికర్మ, నేతికర్మ, త్రాటకకర్మ, నౌలి, కపాలభాతియను షట్కర్మల లక్షణములును, వాని గుణములును, కుంభక భేదములును, కుండలీ ప్రయోజనమును, కుండలీ ప్రబోధ ప్రయోజనమును, దశవిధ ముద్రాస్వరూపమును, బంధత్రయ ప్రయోజనమును, రాజయోగమహిమయు, ప్రాణలయక్రమమును, శాంభవీముద్రా ప్రభావమును, ప్రత్యాహార భేదములు, ధారణా భేదములు, ధ్యానభేదములు, బ్రహ్మజ్ఞానిలక్షణము మొదలగు యోగి అనుసరింపవలసిన సమస్త విషయములును సులభ శైలిలో వ్రాయబడి 128 ఆసన పటములను కలిగి మిక్కిలి ఆకర్షణీయమై యున్నది. యోగాభ్యాసము చేయువారికి ఈ గ్రంథము కల్పవృక్షమువంటిదని చెప్పుట అతిశయోక్తి కాదు. గ్లేజు కాగితములో 216 పేజీలు కలిగి క్యాలికో బైండు చేయబడినది. వెల 3-0-0

## శ్రీ మహాభక్తవిజయము వచనకావ్యము.

ఇందు పుండరీక భక్తులు, శ్రీజయదేవస్వామి, తులసీదాసు, శంకరాచార్య, శ్రీ నామదేవులు, జ్ఞానదేవులు, కబీరుదాసు, ఘోరాకుంభారు, కూర్మదాసు సావతమాలి, రాకాకుమ్మరి, జగమిత్రుడు, జోగా పరమానందుడు, నరహరి, మత్స్యేంద్ర గోరక్షులు, చోఖామేళుడు, గణేశ నాథుడు, గోపీచందు, కూబాకుమ్మరి, జనాబాయి, ఏకనాథుడు, నింబరాజా, భల్లభాచారి గోవిందదాసు, ప్రేమనిధి, భగవానదాసు, సనాతనురూపా, అతీబుసా మున్నగు 27 దాసులయొక్క చరిత్రములు దళసరి కాగితములో అచ్చువేయబడి అట్టబయిండు చేసినది. వెల 2-0-0

## వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి.

ఇందు గురుశిష్య సంవాదరూపముగా అనేక ఉపనిషత్ప్రమాణ్యములతో ఉపమానోపమేయములలో శిష్యలక్షణము, సాధనచతుష్టయం, సాంఖ్యము, అమనస్క రాజయోగము మొదలగు పెక్కు వేదాంతవిషయములు నిస్సందేహముగా వివరింపబడి యున్నది, సమస్త వేదాంత విషయములిందు పొందుపఱుపబడి యున్నందున ఈ గ్రంథమునకు వేదాంతసార ప్రశ్నోత్తర రత్నావళి అను పేరు తగియున్నది. 1-4-0

## సంపూర్ణ రామాయణము.

(వచనకావ్యము,)

ఇందు బాల కాండము, అయోధ్యా కాండము, అరణ్య కాండము, కిష్కింధా కాండము, సుందర కాండము, యుద్ధ కాండమువరకు పూర్తిగా గలవు. దళసరి రఫ్ కాగితములో అచ్చువేయబడినది. 296 పేజీలు గలది. వెల 1-0-0

---

దొరుకువారు:- వెస్టువార్డు అండు కంపెని, చాకలపేట, మదరాసు-21

(మహిళామనోరంజని అను) శ్రీ సంజీవి లేహ్యము.

స్త్రీలకు, అడుగడుగున గుంజగు ప్రసవములచేతను మాసాంతము నందు బహిష్టకాలములో కలుగు అధికరక్తము స్రవించుట చేతను. పురుషసంపర్గము మితిమీరిచి కోరి శరీరమునందు ఉష్ణము యేర్పడుట చేతను కుసుమజాఢ్యమువల్ల రక్తముచెడి బలహీనత యేర్పడి చంపలన్ను దళలున్ను. స్తనములున్ను అంటుకొని ఇంకను పలుకారణములచేత, బలహీనపడుతున్నారు. ఈలాగు బలహీనపడిన స్త్రీలకు మహిళామనో రంజని అను ఈ దివ్యలేహ్యము సంజీవి అనియె చెప్పవలయును. ఒక డబ్బి లేహ్యమును ఒక స్త్రీ భుజించేని తన శరీరము స్వర్ణమువలెనే సంతతిలేని స్త్రీలకు సంతానభాగ్యమునుకూడా కలిగించును, తుమ్మెదలు తేనె పండిన పూలను విడిచి వేరుగానట్లు పురుషుని విడిచి స్త్రీ త్యజించదు. పథ్యమేమియులేదు, డబ్బి 1-కి వెల రూ. 4—00

అయఃసింధూరము (100 పుటములు వేసినది)

ఈ అయఃసింధూరము నరములను బలబలచును రక్తవృద్ధి చేయును. రక్తమును కలిగించును. పసుపురామాల, పాండు, వాపు మున్నగునవి నివర్తియగును ఈ అయఃసింధూరమును పిత్తరోగనివారిణి. మహావిల్వాదిలేహ్యం వీటితోచేర్చి సేవించిన ఆ మూడు మందులకు చెప్పియున్న వ్యాధులన్నియు పూర్తిగా బహుశీఘ్రములో నివర్తి అగును. అనుభవమైనమందు. బుడ్డి రూ. 3—00

(శీవా స్త్రవక్ర పవుడరు ఆపరేషన్ అక్కరలేదు)

సకలవిధ కడుపునొప్పియును కడుపులో ఉండు వ్యాధియును పుండ్లును ఆపరేషన్ చేయకుండనే ఈ మందులో గుణమగును. ఈమందు మూలికల అష్టాంగములతో తయారు చేయబడినది. అల్సర్ అజీరణర ములబంధం కడుపు అరయుట పులిశేంపు కడుపు పొడుచుట కడుపులో పుంపు రణం తోలుపెరుగుట కునం ఇంక సకలవిధ వ్యాధులను పోగొట్టును. డబ్బి 1-కి 3-00

---